# యువ

సచిత్ర మాసపత్రిక

చందా వివరాలు

| | | |
|---|---|---|
| సంవత్సరచందా (దీపావళి ప్రత్యేక సంచిక మినహా) | ... | రు. **12-00** |
| సంవత్సరచందా (దీపావళి ప్రత్యేక సంచికతోసహా) | ... | రు. **17-00** |

వెంటనే చందాదారుగా చేరండి

**యువ కార్యాలయం**

5-10-194, సైఫాబాద్, హైదరాబాద్-4

## పొదుపు చేసుకోవడానికి
## ఇప్పుడే మీ బిడ్డ నేర్చుకోవాలి

*స్టేట్ బ్యాంక్ ఆఫ్ హైదరాబాద్‌లో ఖాతాను తెరవండి*

మైనారిటీ దాటని వారి కొరకు, తలిదండ్రులు గాని, కోర్టువారిచే నియమింపబడిన సంరక్షకులు గాని సేవింగ్స్ అకౌంటును తెరవవచ్చును. ఖాతా నిర్వహణకూడా మైనర్ల తరఫున జరపవచ్చును.

పధ్నాలుగు సంవత్సరాలు పైబడిన బాలబాలికలు తమ సేవింగ్స్ బ్యాంక్ ఎక్కౌంటును సొంతంగా నిర్వహించుకోవచ్చును.



# స్టేట్ బ్యాంక్ ఆఫ్
# హైదరాబాద్

SBH-69-4

శ్రీ లక్ష్మీనారాయణా కంబైన్స్

# కదలడు వదలడు

దర్శకత్వం
బి. విఠలాచార్య

నిర్మాతలు
కె. సీతారామస్వామి
జి. సుబ్బారావు



**అశోక్**
హైద్రాబాద్

**సంగం**
(ఎయిర్ కండిషన్డ్)
హైద్రాబాద్

**అంజలి**
సికింద్రాబాద్

రోజు 3 ఆటలు : 2-30, 6-00, 9-30 గంటలకు మరియు :-

**లక్ష్మి**
వరంగల్

**రమేశ్**
నిజామాబాద్

**సుందర్**
ఖమ్మమ్

— దివ్యదత్త

యువ
సచిత్ర మాసపత్రిక

సంచాలకుడు : చక్రపాణి

సంపుటి 20 ఆగష్టు, 1969 సంచిక 2

భారత రాష్ట్రపతి పదవికి, కాంగ్రెసుపార్టీ అభ్యర్థిగా శ్రీ నీలం సంజీవ రెడ్డిని నిర్ణయించినట్లు, కాంగ్రెసు అధ్యక్షుడు శ్రీ నిజలింగప్ప, జులై 13వ తేదీన బెంగుళూరులో ప్రకటించారు. ఈ ప్రకటన జరిగిన తీరు, ప్రతివారికీ అసహ్యం కలిగించేటట్టుగా వుంది. ఏమంటే, రాష్ట్రపతి పదవికి ఏవ్యక్తిని కాంగ్రెసు అభ్యర్థిగా నిర్ణయించినా, ఎవరికీ అభ్యంతరం వుండదు. రాష్ట్రపతిని ఎన్నుకొనే ఓటర్లు (అంటే పార్లమెంటు సభ్యులూ, రాష్ట్రాలలోని అసెంబ్లీల సభ్యులూ) కాంగ్రెసు అభ్యర్థి తమకు ఇష్టమైన వ్యక్తి అయితే ఓటు వేస్తారు; లేకపోతే లేదు. కాని సామాన్య పౌరులకుకూడ విసుగునూ, అసహ్యతనూ కలిగించినది ఏమిటంటే, పార్టీ అభ్యర్థిని నిర్ణయించుకోవడంలో, కాంగ్రెసుపార్టీ నాయకులు అవలంబించిన పద్ధతి.

రాష్ట్రపతి జకీర్ హుసేన్, మే 3వ తేదీన హఠాత్తుగా మరణించినప్పటినుంచీ, కొత్త రాష్ట్రపతిగా ఎవరిని ఎన్నుకోవడమనేది, బజారు

బేరంలాగా తయారయింది. కాంగ్రెసుపార్టీ తరఫున అభ్యర్థులను నిర్ణయించే పార్లమెంటరీ బోర్డు సభ్యులు, రాష్ట్రపతి ఎన్నిక విషయాన్ని ఒక గూడుపుఠానీ వ్యవహారంగా తయారు చేశారు. గడచిన రెండు మాసాలలోనూ, యీ అభ్యర్థిత్వానికి కాంగ్రెసుపార్టీ నిర్ణయించబోయే వ్యక్తులంటూ, అనేకమంది పేర్లు బయటికి వచ్చాయి. ఇదమిత్థమని తేలినదాకా ఎంతమంది పేర్లు బయటికి వచ్చినా రావచ్చునుగాని, ప్రతి పేరుతోపాటు, ఫలానా వ్యక్తి ప్రధానమంత్రికి ఇష్టుడనీ, మరొక వ్యక్తి కాంగ్రెసు అధ్యక్షునికి ఇష్టుడనీ, ఇంకొక వ్యక్తి కాంగ్రెసు పార్లమెంటరీ బోర్డులో ప్రధానమంత్రికి ఎదురు పార్టీగావున్న సిండికేటుకి ఇష్టుడనీ వార్తలు వచ్చాయి. అంతేకాదు; ప్రధానమంత్రికి యిష్టుడైన వ్యక్తిని తక్కినవారు ఆమోదించకపోతే, ప్రధానమంత్రి హఠాత్తుగా మరొక వ్యక్తిని సూచించవచ్చనీ, ప్రధానమంత్రి కాదనడానికి వీలులేకుండా ఆమెను ఇరకాటంలో పెట్టేపద్ధతిలో ఒకానొక వ్యక్తిని సిండికేటు సూచించవచ్చుననీ వార్తలు వచ్చాయి.

రాష్ట్రపతి పదవికి అభ్యర్థిని నిర్ణయించడంలో, ఇరవై రెండేళ్లుగా దేశపరిపాలనను నిర్వహిస్తున్న కాంగ్రెసు పార్టీనాయకులు అవలంబించవలసిన విధానం ఇదేనా?

ఈ నిర్ణయం విషయంలో ఒకసూచనగా వచ్చిన అసహ్యమైన విషయం ఏమిటంటే 1972లో దేశమంతటా జరగబోయే ఎన్నికలలో కాంగ్రెసుపార్టీ తగినంత బలంతో గెలవలేక పోవచ్చును కాబట్టి, ఆ ఎన్నికల అనంతరం ఏర్పడే క్లిష్టపరిస్థితిలో కాంగ్రెసు పార్టీకి అండగా వుండే వ్యక్తిని ఇప్పుడు రాష్ట్రపతిగా ఎన్నుకోవలసి వుంటుందని. ఇలాటి మాట ఏ పార్టీ అయినా అనకూడదు; అనుకోకూడదు.

రాష్ట్రపతి, దేశపరిపాలకుడు. దేశమంతటి మేలునూ దృష్టిలో ఉంచుకొని పరిపాలనను సాగింపచేయవలసిన వ్యక్తి, ఒకపార్టీకి అండగా వుండాలని ఎవరైనా కోరడంగాని, ఆశించడంగాని, సూచించడంగాని

తప్పు. అంతకన్న పెద్దతప్పు ఏమిటంటే, ఒకేపార్టీలో రెండువర్గాలు ఏర్పడి, ఆ రెండువర్గాలలోనూ ప్రతివర్గమూ తనకు అనుకూలుడుగా వుంటాడనే వ్యక్తిని నిర్ణయించ గోరుతున్నట్టు బయటపడటం.

చిట్టచివరకు, యీ అభ్యర్థిని నిర్ణయించడంలో, రెండునెలల తర్జన భర్జనల తరువాత, కాంగ్రెసు పార్లమెంటరీబోర్డు ఏకాభిప్రాయానికి రాలేక, ఓటింగు జరపడం. ఇది, కాంగ్రెసు పార్టీని నగుబాట్ల పాలు చేసింది. ఇదివరకు రాష్ట్రపతి పదవికి అభ్యర్థిని నిర్ణయించడంలో ఇలా ఎన్నడూ జరుగలేదు. ఈసారికూడా, ఇంకా కొన్నాళ్ళు తర్జన భర్జనలూ, బేరాలు జరిపినా, ఏకాభిప్రాయంతో తమ అభ్యర్థిని నిర్ణయించినట్లయితే, కాంగ్రెసు ప్రతిష్ఠ కొంతవరకైనా దక్కివుండేది. అలా కాకుండా, ఓటింగు జరపడమూ, ఆ ఓటింగులో ఎవరు పాల్గొన్నదీ, ఎవరు పాల్గొనకపోయినదీ, పాల్గొన్న వారిలో ఎవరు, ఎలా ఓటుచేసినదీకూడా పత్రికలలోకి ఎక్కింది; ప్రజల నోళ్ళలోపడింది. కాంగ్రెసు నాయకత్వంలో రెండువర్గాలు వుండటమూ, ఏ వర్గంలో ఏ ఏ వ్యక్తులు వున్నారో స్పష్టంగా దేశమంతటికీ తెలిసిపోయింది. ఇది ఏమి ప్రతిష్ఠ?

వర్గప్రయోజనాలూ, వ్యక్తి ప్రతిష్ఠలూ, వ్యక్తిద్వేషాలూ, జాతీయ రాజకీయాలలోనికి రాకూడదు. అన్నిపార్టీలకూ, అన్నివర్గాలకూ అతీతుడుగా, దేశక్షేమమే ప్రధానంగా పరిపాలన నడిపించవలసిన రాష్ట్రపతిని ఎన్నుకోవడంలో, అన్నివిధాలా సమర్థుడైన వ్యక్తినే ఎన్నుకున్నప్పటికీ, యీ ఎన్నికను జరిపిన పద్ధతిమాత్రం, వర్గద్వేషాలతోనూ, రాజకీయ కుట్రలతోను కూడుకుని వుందనేభావం ప్రజలలో కలగడం, చాలా చింతాకరమైన విషయం.



మీ ముఖ
సౌందర్యానికి



రెమి ®
టాల్కం పౌడర్









SARATH



# అపశృతి

నంది కమలకుమారి

"ప్రాంట మానదంతప్ప జీవితంలో మే  దండి. మన ట్టిల్లి పెద్దగాయనిగా
మిద్దరం యేమైనా చేయగలం. బహుమతుల్ని మీ కందిస్తుంది."
అలా నవ్వేయడం కాదు. చూస్తూ ఉం  ——తమ యిద్దరివైపూ చూర్చుని

చేతిలోని వెండికప్పును తన్మయత్వంతో చూస్తున్న కూతురితలను నిమురుతూ భర్తతో అంది శారద. నవ్వి, ఆ కప్పును తీసుకోబోయాడు రవిశంకర్. 'ఉహుఁ!' అని తల అడ్డంగా ఊపి, మాంత్రికుడి ప్రాణపు చిలుకని రాకుమారుడిలా గట్టిగా గుండెల కదుముకుని పట్టుకుంది చిన్నారి గీత. కారు ముందుకు దూసుకుపోయింది.

భవిష్యత్తుపై కలల బరువుతో అలసిపోయి, మర్నాడు చాలా ఆలస్యంగా నిద్రలేచింది శారద. ప్రక్కనే టేబుల్ మీద బెడ్‌కాఫీ చల్లారిపోయి నిరాశగా చూస్తోంది. నవ్వుకుని, బయటకు రాబోతూ, యెదురుగా వస్తున్న వంటమనిషిని,

"పాప కాఫీ త్రాగిందా?" అనడిగింది.

"లేదమ్మా – ఇంకా లేవలేదు."

"రాత్రి ఫంక్షన్‌తో అలిసిపోయింది" అనుకుంటూ గదిలోకి వెళ్ళి కూతురుని లేపబోయి ఉలిక్కిపడింది. గీత ఒళ్ళు కాలిపోతోంది. అదిరిపడి, రగ్గు జాగ్రత్తగా కప్పి, భర్తకు చెప్పి, డాక్టరుకు కబురుపంపించింది.

వంచినతల ఎత్తకుండా పది నిముషాలు పరీక్షించిన డాక్టరు చివరకు ప్రక్కనేఉన్న కుర్చీలో కూర్చుంటూ, "నిన్న బయట ఏమైనా తిందా?" – అని అడిగాడు. అంతవరకూ ఆదుర్దాతో నిలబడిపోయిన శారద, ఖంగారులో అతనేమడిగాడో అర్థంకాక, కొద్దిగా జ్ఞాపకం తెచ్చుకుంటూ, "ఆఁ! నిన్న ఫంక్షన్ నుంచి వచ్చేటప్పుడు హోటల్‌కువెళ్లాం" అంది.

"ఎందుకు వెళ్ళారు – ఊరంతా విష జ్వరం ఉంది. బయట ఏమీ తీసుకోవద్దని చెప్పానుగా – మీరన్నీ యిలాంటి పనులే చేస్తుంటారేం?" –

—కోపంగా విరుచుకుపడిన డాక్టరు "డాక్టరుగారూ!" అంటున్న శారద కంఠంలోని భయాన్ని గుర్తించి, తనను తాను సంబాళించుకుంటూ, "సరేలెండి – నేవెళ్ళి మందు పంపిస్తాను. జాగ్రత్తగా యిస్తుండండి–" అన్నాడు అనునయంగా.

డాక్టరు వెనకే భారంగా అడుగులు వేస్తూ వెళ్ళుతున్న భర్త వేపు అయోమయంగా చూస్తూ గీత ప్రక్కనే కూలబడిపోయింది శారద. గలగలమంటూ పరిగెత్తే ప్రవాహం పరిసరాలను ప్రభావితం చేసేటట్లు, ఎప్పుడూ అల్లరితో హడావుడిచేసే గీత అచేతనంగా పడి ఉంది. నోరువిప్పి మాట్లాడలేని ఆ పిల్ల కంటివెంట కారుతున్న నీరు అతి నిశ్శబ్దంగా తలకు రెండువేపులా తలగడ మీద చోటు చేసుకుంటోం... అన్ని సంవత్సరాల దాంపత్య జీవితంలో మామూలు విషయంలా అణచి పెట్టబ

దీన అవశ్యతిలాంటి అసంతృప్తి ఆ క్షణంలో కొండంతై, కూతురితల నిమురుతున్న శారద మనసు నాక్రమించుకుంది. ఏం జరగబోతోంది? ఉత్తర దక్షిణ ధ్రువాల కలయికవంటి తన దాంపత్య జీవితంలో చివరకు మిగలబోతున్న దేమిటి? కీడును శంకిస్తున్న శారద యెదురుగా ఉన్న వంశీమోహనుని చిత్రానికి అప్రయత్నంగా చేతులు జోడించింది. ఆమె చూపులు ఆ ప్రక్కనే ఉన్న ఫోటోపై నిలిచిపోయాయి. అది ఎనిమిది సంవత్సరాలక్రితం, మొదటి సారి మైక్‌ముందు నిలబడి పాడుతున్న శారద ఛాయాచిత్రం. ఆనాడు

"వన్స్‌మోర్! ప్లీజ్ వన్స్‌మోర్!!" కేకలు హాలంతా ప్రతిధ్వనిస్తున్నా తనకు కానట్టే, పమిటకొంగు భుజాల చుట్టూ లాక్కుంటూ వేదిక దిగిన శారద ఎదురుగా వస్తున్న లెక్చరర్‌ని చూసి ప్రశ్నార్థకంగా నిలబడింది.

"అమ్మా శారదా! లాభంలేదమ్మా- కనీసం యింకో పాటైనా పాడకపోతే వీళ్లు ఊరుకోరు. వెళ్ళి పాడు-తప్పదు- వాళ్ళు వినడంలేదు"- అన్నాడు అదుర్దాగా వెనక్కు తిరిగి చూస్తూ.

"సార్ - నేను -" కంగారుగా ఏదో చెప్పబోయింది శారద.

"ఉఁ హుఁ! - నువ్వు పాడకపోతే ఊరుకోరు - ప్లీజ్ - వెళ్లు -" అన్నాడాయన కొద్ది శాసనం ధ్వనిస్తున్న స్వరంతో. గత్యంతరం లేక వెనక్కు తిరిగింది శారద. ఆమె కనిపించగానే మొదలయిన కరతాళధ్వనులు పాట మొదలయ్యేవరకూ ఆగలేదు. "సావిరహే తవ దీనా కృష్ణా!"- గోపాలదేవుని మురళీ నాదంలా పాట సాగిపోతోంది. అంతవరకూ గొడవచేస్తున్న వారంతా మంత్రబద్ధుల్లా నిశ్శబ్దంగా ఉండిపోయారు. జయదేవుని, మధుర భక్తిభావం ఆమె కంఠంలో మరింత తీయదనాన్ని నింపుకుని వింటున్నవారిని తన్మయులనుచేసింది. శారద లోపలకు వెళ్ళిపోయేవరకూ కాని యెవరికీ పాట అయిపోయిందని తెలియలేదు. ఒక్కసారిగా హాలుని ముంచెత్తుతూ కరతాళ ధ్వనులు మిన్ను ముట్టాయి. వెనకాల నుంచి మళ్ళా ఎవరో అరిచారు "వన్స్‌మోర్" అని. శారదను వేదిక పైకి పంపిన లెక్చరర్ వచ్చి కార్యక్రమానికి అంతరాయం కలిగించవద్దని విజ్ఞప్తి చేశాడు.

ప్రేక్షకులలోకి వచ్చి కూర్చున్న శారదకు యిదంతా కలలో జరుగుతున్నట్లుగా ఉంది. ఆమె ప్రత్యేకించి సంగీతం నేర్చుకోలేదు. అయినా భగవంతుడిచ్చిన అమూల్యవరం ఆమె గాత్రం. బాల్యంనుంచి ప్రతి పనిలోనూ ప్రత్యేకత చూపించే పెద్దకూతురంటే అపేక్ష యెక్కువ రామనాధం మేష్టారికి. అయినా మగపిల్లలతోపాటు స్కూలుకు వెళ్ళే

కూతురు చదువు విషయమై పెద్ద ఆలో చనలేవీ లేవు ఆయనకు. ఆర్థికంగా ఇబ్బందుల్లో ఉన్న కుటుంబంలో ముగ్గురు ఆడపిల్లలూ గుండెలపై కుంపట్లు మాత్రమే. తమ బరువును దించుకోవా లనే ఆరాటమే తప్ప పిల్లల కళాభిని వే శాన్ని గుర్తించే సావకాశం వారికి లేదు. ఈ పరిస్థితుల్లో పక్కింటి స్నేహితు రాలు సరళ సంగీతం నేర్చుకోవడం చూసిన శారద సరదాపడి, రోజూ అక్కడికి వెళ్ళి కూర్చుంటూ ఉండేది. సహజసిద్ధమయిన శారదలోని సంగీత జ్ఞానం దీనితో వికసించ నారంభించింది. ఉత్సాహాన్ని ఆపలేక, సన్నగా కూని రాగం తీసే ఆమె సితికి జాలిపడిన సంగీతం మేస్టారు కొన్ని కీర్తనలూ, అష్టపదులు సరళతో పాటు ఆమెకీ నేర్పారు.

మానవుడి భవిష్యత్తు ఆతదూహించు కుని, మలచుకున్న మార్గంలోనే ప్రత్యక్ష మయితే "దైవనిర్ణయం" అనే పదం అంతగా జ్ఞాపకంరాదు. అయితే "అంతా వాడిదేభారం" అని చేతులు ముడుచుకు కూర్చోకుండా కూతురుపెళ్ళికై విశ్వ ప్రయత్నాలు చేస్తున్న రామనాధంగారి యింట్లో శారద స్కూలుకు ప్రథమంగా స్కూలు ఫైనలు పాస్ అవడం ఒక సమస్యన్నే తీసుకువచ్చింది. వంశంలో ఆమాత్రం చదివిన మొదటి ఆడపిల్ల శారద. నీసం సంబంధం కుదిరేవరకూ కాలేజీలో చదువుతానని రెండు రోజులు నిరశనవ్రతం చేసిన కూతురి కోరికకు తలఒగ్గారు రామనాధంగారు.

కళాశాల వాతావరణానికి అలవాటు పడడానికి పూర్వమే శారద సంగీత ప్రతిభను గురించి అందరికీ తెలిసి పోయింది. జీవితంలో మొదటిసారి వేదికయెక్కి మైక్ముందు నిలబడిన శారద ప్రేక్షకులను చూసి వణికి పోయింది. కాని పాట మొదలవగానే ఆవరించుకున్న నిశ్శబ్దం ఆమెకు ధైర్యా న్నిచ్చింది.

ఈవిధంగా మొదలయిన శారద పేరుప్రతిష్ఠలు అంతకంతకు ఎక్కువ కాసాగాయి. ఇప్పుడు విశ్వవిద్యా లయంలో ఎక్కడ ఏ ఉత్సవం జరిగినా అందులో శారదపాట తప్పనిసరిగా ఉంటోంది. ఎంత ముఖ్యమయిన క్లాసయినా సరే వదలి, పాడడానికి వెళ్ళా ల్సిన అవసరాలు వస్తున్నాయి.

హటాత్తుగా లభించిన యీ ప్రత్యే కత అప్పుడే వ్యక్తిత్వాన్ని సంతరించు కుంటున్న శారదను ఉక్కిరి బిక్కిరి చేయసాగింది. ఆయస్కాంతంలా ఆకర్షిస్తున్న కీర్తిసౌధాన్ని అధిరో హించాలనే ఆకాంక్ష చదువునుకూడా నిర్లక్ష్యం చేసేటంతగా ప్రలోభపెట్టింది. ఫలితంగా, అన్నింటి పరీక్షల్లో అన్నిటి లోనూ తక్కువ మార్కులు వచ్చాయి. వరాన్వేషణలో ఉన్న రామనాధం గారిని




యీ విషయం అంతగా బాధించక పోయినా శారదమాత్రం మానసికంగా కృంగిపోయింది. ఇకనుంచి చదువు విషయమై శ్రద్ధ వహించాలి అనుకుంది దృఢంగా.

రాత్రి తీసుకున్న నిర్ణయం యిచ్చిన మనశ్శాంతితో మరునాడు కాలేజీకి వెళ్ళింది. క్లాసు జరుగుతుండగా శారదకు ప్రిన్స్‌పాల్‌గారి దగ్గరనుండి పిలుపు వచ్చింది. క్లాసంతా ఆమెవైపు ప్రశ్నార్థకంగా చూసింది. మనస్సును అవ్యక్త భయమేదో ఆవరిస్తుండగా ప్రిన్స్‌పాల్ దగ్గరకు వెళ్ళింది. అక్కడ లెక్చరర్ భాస్కరరావుగారు, మరో యిద్దరు విద్యార్థులతో ప్రిన్సిపాల్ నవ్వుతూ మాట్లాడుతున్నారు. నెమ్మదిగా దగ్గరకు వెళ్ళి, నమస్కారంచేసి, "పిలిచారట?" అనడిగింది.

"అవునమ్మా - నీకు ఒక విషయం చెప్పాలి" అన్నారాయన ఖుటుతిరుగుతూ.

"ఏమిటండీ?"

"ఆదే వచ్చేనెలలో అంతర్విశ్వ విద్యాలయ పోటీలు మొదలవుతున్నాయిగా."

"అవునండీ - విన్నాను" అస్పష్టంగా అంది మనసులో ఏదో సందేహం పొగ లాగ ఆవరిస్తుండగా.

"అందులో లలిత సంగీతానికి మన విశ్వ విద్యాలయం నుండి నిన్ను పంపాలనుకుంటున్నాం. మన భాస్కరరావు గారు ఆ విషయాలన్నీ చూస్తున్నారు. నీకు కావల్సిన అరేంజ్‌మెంట్స్ ఆయనకు చెప్తే రిహార్సల్స్ మొదలు పెట్టవచ్చు."

"సార్ - సార్ -" మాటకు అడ్డు వచ్చాడో విద్యార్థి.

"ఏమిటోయ్?"

"అదేనండీ - నాటకంలో అనార్కలీ వేస్తున్న ఉషాదేవిగారికి పాడటం రాదని..."

"అవునవును - అసలు విషయం మరచేపోయాను. ఉషకి పాడటం రాదట. అందుకని, ఆ పాటలుకూడా నువ్వే పాడమ్మా" - అన్నారాయన ఏక బిగిన మాట్లాడేస్తూ.

అందరితోపాటు గదిలోనుండి బయటకు మౌనంగా వచ్చేసింది శారద. ఆమె మనసు ఎందుకో బరువుగా ఉంది. మొదటిసారి కాలేజీలో గాయనిగా గుర్తించబడినప్పుడు కలిగిన ఉత్సాహం సంతృప్తి ఆ క్షణంలో ఎందుకో జ్ఞాపకం రాలేదు. కాలేజీలో జేరిన ముఖ్యోశయం మరుగున పడిపోతున్నట్లనిపించ సాగింది. ముభావంగానే రెండురోజులు రిహార్సల్స్‌కు వెళ్ళింది. కాని అక్కడ లభ్యమౌతున్న ఆదరాభిమానాలు ఆమె నాకట్టుకో సాగాయి. క్రమంగా మనసు సంగీతంవల్ల రానున్న పేరు ప్రఖ్యాతుల వైపే మొగ్గసాగింది.

ఇంటిలో శారద పెళ్ళి ప్రయత్నాలు తీవ్రం అయ్యాయి. అందరూ ఎంత తొందర పడుతున్నారో, ఆ పెళ్ళి అంత దూరంగా జరుగుతోంది. తిరిగి తిరిగి ఒక సంబంధం దగ్గర ఆగారు రామనాధంగారు. కట్నం కానుకలు సరిపెట్టుకుంటున్నంతలో. స్కూలు ఫైనలు నాలుగుసార్లు తప్పి వ్యవసాయంలోకి దిగిన ఆ పెళ్ళికొడుక్కి, కాలేజీలో చదివే పిల్లతో పెళ్ళి "తగని పని"గా తోచింది. తిరిగిపోయిన ఆ సంబంధాన్ని కూడా చూస్తూ ఉడికిపోయిన రామనాధంగారిలో ఒకే ఒక భయంకరమయిన సందేహం మిగిలిపోయింది. అది "కూతురుకి పై చదువులు చెప్పించి పొరపాటు చేసానా?" అన్నది.

అంతర్విశ్వ విద్యాలయ సంగీత, నాటకపోటీలు దగ్గరకు వచ్చేసాయి. ఈమధ్య అనార్కలీ నాటకం రిహార్సల్స్‌కు శారద రోజూ వెడుతోంది. తిరిగి రావడం ఆలస్యమయినప్పుడు భాస్కరరావుగారు యింటివరకూ దిగబెడుతున్నారు. సాధారణంగా ఆయనతో ఒకరిద్దరు స్నేహితులుకూడా ఉంటుంటారు. అందులో ఎర్రగా, పొడుగ్గా, చిరునవ్వుతో, "ఇంకొకసారి చూడా లనిపించే" ఒక యువకుడు తప్పక వస్తుంటాడు. నటులకు సలహా లివ్వడంలో భాస్కరరావుగారు అతని సూచనలుకూడా పాటిస్తుంటారు. ఆరోజు శారద రాగానే భాస్కరరావుగారు ఆ యువకుని వేపు తిరిగి, "వీరే నేను చెప్పిన శారదగారు, ఈ సంవత్సరమే జేరారు. ఇక పాట సంగతి ఇప్పుడు నువ్వే వింటావుగా" అన్నారు.

చిరునవ్వుతో నమస్కారం చేసిన అతని పేరు రవిశంకరనీ, ఆ కాలేజీలోనే బి. ఎ. పాస్ ఇయరు బిజినెస్ చేస్తున్నాడనీ తెలిసింది శారదకు.

రిహార్సల్స్ మధ్యలో యాదృచ్ఛికంగా భాస్కరరావుగారివేపు చూసిన ఆమె, ఆయన ప్రక్కనుండి రెండు కళ్ళు అత్యంతాసక్తితో తననే పరిశీలిస్తుండడం గమనించి ఉలిక్కిపడింది. గుండెల్లోకి దూసుకుపోయి స్త్రీత్వాన్ని మేల్కొలుపుతున్నట్లున్న ఆ చూపుల్లో ఆశ్చర్యం, అన్వేషణ ఫలించిన సంతృప్తి, అభిమానంలాంటి భావాలెన్నో కలిసిపోయి. మొహం ఎర్రబడిపోగా శారద తలదించుకునేట్లు చేసాయి. తరువాత రిహార్సల్స్ అయిపోయేవరకూ అతడలాగే చూస్తున్నట్లు గ్రహించింది శారద.

మర్నాడు, రెండోరోజు, ఆమర్నాడు కూడా రిహార్సల్స్‌కు రవిశంకర్ వచ్చాడు. అతని ప్రవర్తన నలుగురి దృష్టి నాకర్షిస్తుందేమో అని భయపడిన శారదకు క్రమంగా, అతని ఈ స్వేచ్ఛకు భాస్కరరావుగారి ఆమోదం, ప్రోత్సాహం ఉంటున్నాయనే సందేహం కలుగసాగింది. బలవంతంగా మనసు నదుపులోకి తెచ్చుకుని పాడుతున్న ఆమెకు రవిశంకర్ అనే అందమైన యువకుడు, తదేక ధ్యానంతో వింటున్నాడనీ, ఆ చూపులలోని ఆకర్షణలాంటి దేదో తనను పరవశింప జేస్తోందనీ హటాత్తుగా గుర్తు వచ్చి ఒక్క క్షణం మైకం కమ్మినట్లయింది. తన సంగీతంలో లయ, గానంలో మాధుర్యం తన జీవన సర్వస్వం అయిన సలీమ్‌ని ఉద్దేశిస్తూ ప్రేమమయి అనార్కలీ పాడే ఆ గేయంలో శారద కీసారి కొత్త అర్థాలు, అందాలు కన్పించసాగాయి, పాటలోని మధుర భావం ఆమె నావేశించినట్లయి మనస్సును గిలిగింతలు పెట్టింది. ఎప్పటిలా ఈసారి అందులోని ప్రియాహ్వాన చరణాల్ని నిస్సంకోచంగా పాడలేకపోయింది.

అనుకున్నట్లే పోటీలలో శారదకు లలిత సంగీతంలో ప్రథమ బహుమతి రావడమే కాకుండా, అనార్కలీ పాటకు ప్రత్యేక బహుమతులు కూడా వచ్చాయి.

ఆరోజు క్లాసవగానే వచ్చేస్తున్న శారద భాస్కరరావుగారు పిలుస్తున్నారని తెలిసి స్టాఫ్‌రూముకు వెళ్ళింది. ఒక్కరే ఏదో చదువుకుంటున్నారాయన. నమస్కారంచేసింది.

"ఎలా చదువుతున్నావు?" అడిగారాయన పుస్తకం మూసేస్తూ.

"పర్వాలేదండీ – పిలిచారట?"

"అవునమ్మా – నీకో సంగతి చెప్పాలి."

"ఏమిటండీ?"

"నువ్వు అపార్థం చేసుకోకుండా విని,

సరిగా ఆలోచించుకుని సమాధానం చెప్పు."

"అలాగే – కాని ఏమిటది?"

"రవి – రవిశంకర్ అంటే నీకు చాలా అభిమానం కదూ?"

అసందర్భంగా ఉన్న ఆ ప్రశ్నకు శారద తెల్లబోయింది.

"హాస్యం కాదు సీరియస్‌గా అడుగుతున్నాను. నీ జవాబు కావాలి."

"ఎందుకండీ"– అప్రయత్నంగా అడిగింది.

"నీ కిష్టమయితే రవి నన్ను మీ నాన్నగారి దగ్గరకు రాయబారం పంపుతానంటున్నాడు."

ఆయన వేపే చూస్తున్న శారద కళ్లు సిగ్గుతో వాలిపోయాయి. ఎర్రబడిపోయిన మొహాన్ని వంచుకుంది.

"జీవితంలో డబ్బు తప్ప ఆప్యాయత నోచుకోని రవి సుఖపడాలంటే నీ చేతుల్లో ఉందమ్మా."

"అంటే?"

"చిన్నప్పుడే రైలు ప్రమాదంలో తల్లీ తండ్రీ పోయారు. ఇన్నాళ్ళూ ఆస్తి వ్యవహారాలు చూసిన తాతగారుకూడ ఈమధ్యనే పోయారు."

ఆయన చెప్తున్నది శారదకు వినిపించడంలేదు. తనలోని స్త్రీత్వాన్ని మేల్కొలుపుతున్న చూపులతో ఏదేక ధ్యానంతో పాటవినే రవిశంకర్ రూపమే మనసంతా ఆక్రమించుకుంది. అందని చందమామ హఠాత్తుగా అరచేతిలో ప్రత్యక్షమయిన సంతృప్తితో హృదయం నిండిపోగా, వినీ వినబడకుండా అంది– "ఇష్టం."

"బావుందమ్మా – మంచిరోజు చూసి మీ నాన్నగారితో మాట్లాడతాను."

తరువాత వారం రోజులకు ఏదో ఉత్సవంలో లలితసంగీతం పాడటానికి వెళ్ళి, ఒంటరిగా గ్రీన్ రూమ్‌లో తంబుర శ్రుతి చేస్తూ కూర్చున్న శారద గుమ్మం వేపు చూస్తూనే ఉలిక్కిపడింది. కుడిచేత్తో గుమ్మం పట్టుకుని నిలబడిఉన్నాడు రవిశంకర్. ఏదో పనిమీద గదిలోకిరాబోయి, హఠాత్తుగా ఆమెనుచూసి ఆగిపోయినట్టున్నాడు – కుడికాలు ముందుకు సాచివుంది. ఆసక్తితో నిండిన ఆకళ్ళల్లో యీసారి చిలిపితనం, అధికారం, ఆశించినది లభించిన సంతృప్తి మెరుస్తున్నాయి. తంబుర పక్కనపెట్టి, తొట్రుపడుతూలేచి నిలబడింది శారద. రెండు నిముషాలు అలాగే ఆమెకళ్ళల్లో ఏదో వెతుకుతున్నట్లు చూస్తూ నిలబడిపోయిన అతను, అంతలోనే మామూలుమనిషి అయిపోతూ చిరునవ్వుతో నమస్కారం చేశాడు. అప్రయత్నంగా ప్రతినమస్కారం చేసిన శారద అతను గుమ్మంలోంచి కదలి, తనకు దగ్గరగా రావడం గుర్తించనేలేదు. హఠాత్తుగా రెండుచేతులా ఆమెను దగ్గరకు లాక్కున్నాడు రవిశంకర్. తూలి గుండెలమీద పడిన



శారద మరుక్షణం మొహం ఎర్రబడగా, అతని ప్రణయ ప్రకటనకు వణికిపోయిన పెదవులను పళ్ళతో నొక్కిపెడుతూ అతని చేతుల విడిపించుకుని అక్కడి నుంచి పారిపోయింది.

ఆ వేసవిలోనే శారద వివాహం రవిశంకర్‌తో జరిగిపోయింది. జంటగా, "రవిమందిర్" అధికారిణిగా రెండంతస్తుల భవంతిలో అడుగుపెట్టిన ఆమె మనసు విచిత్రానుభూతులకి లోనయింది. ఆ భావాలేమిటో అర్థంకాలేదామెకు. కాని ఆ ఆడంబరం వెనుక ఆ ఆహ్వానాల చాటున ఆ ఆప్యాయతల నడుమ అర్థం కాని వెలితి, లోటు ఉన్నాయనిపిస్తోంది.

కాని ఆగింలా వీముల్లో ఏమిటో తెలియ లేదు ఆమెకు.

సాయంత్రం మొదలు... స్త్రీ పురుషుల జీవితాలని మధురంగా మార్చివేసే మొదటిరాత్రి శారద జీవితంలో కూడా వచ్చింది. ఆ మొదటిరాత్రికి ఆమె సాయత్త పరవశానికి ఘట్టింటివాళ్ళెవరూ వెంట లేరు. అలంకరింపబడ్డిన ప్రక్కంటి వాడిలో పుంభావంలాంటిది చూసింది శారద. అది ఎందుకో తెలియలేదు.

చేతిలో పాలగ్లాసుతో పాలనురుగు వంటి తెల్లచీరలో తలలో విచ్చుకుని పకపక నవ్వుకుంటున్న మల్లెలతో, మనసులో మధురోహలతో తలుపుదగ్గరే నిలబడిపోయిన శారదహస్తాన్ని తన చేతిలోకి తీసుకున్నాడు రవి. శారద మనస్సు, రెక్కలు విచ్చుకున్న గువ్వలా ఒక్కసారి ఆనంద లోకాలలోకి ఎగిరి పోయింది. అంతలోనే, టేబుల్‌పైన ఓపెన్ చేసిఉన్న నోట్‌బుక్ ఆమెకిచ్చాడు రవి. భర్తవేపు ఒకసారిచూసి ఆత్రంగా అది చదివింది శారద.

"గానకోకిలవైన నీయీ త్యాగానికి ప్రతిగా యేమివ్వగలను నేను. ఈ యైశ్వర్యంతోపాటు నన్ను నేనే నీకు అర్పించుకుంటున్నాను. ఇకనుంచి నా వాక్కువై నన్నూ యీ సర్వస్వాన్నీ శాసించి పాలించేఅధికారం నీది_" అని ఉంది. మొదట శారదకు దానిభావం అర్థం కాలేదు. అతి తొందరగా అయోమయంగా ఆమెచూపులు అక్షరాల వెంట పరు గెత్తాయి. దానిభావం అర్థం అయ్యేంతలోనే చరాచర ప్రపంచమంతా గిర్రున తిరుగుతున్నట్టూ, కాళ్ళక్రింద హిమనదాయి ప్రవహిస్తున్నట్టూ, "రవితో వివాహం" అన్నమాట విన్నప్పటినుంచి నిర్మించుకున్న భవ్యహర్మ్యం పునాదులతో కూలిపోయినట్టూ అయి _ మరునిముషంలో అచేతనంగా వాలిపోయింది శారద. పడిపోతున్న భార్యను కంగారుతో సొదివిపట్టుకుని తెలివి తెప్పించడానికి ప్రయత్నించసాగాడు రవి. ఒక పావుగంటకు తేరుకుని అయోమయంగా చైతన్యరహితంగా భావశూన్యంగా తన మొహంలోకే చూస్తున్న శారద చూపులు అతణ్ణి విచలితుణ్ణి చేశాయి. నెమ్మదిగా అక్కడనుంచి లేచి ప్రక్కనే పడిఉన్న నోట్‌బుక్‌తీసి ఏదో వ్రాసి ఆమెకిచ్చాడు.

"మాటరాని నా అశక్తత ముందే తెలిసికూడా యిలా క్రొత్తగా బాధ పడటంలో అర్థంలేదు_" అని ఉంది.

"నసకు ముందే తెలియడం" ? ?

ఈ మాటకే తెల్లబోతున్న శారదను _

"నువ్వు ఒప్పుకున్న తర్వాతనే..." అర్థోక్తిలో ఆగిపోయిన వాక్యం మరింత అయోమయానికి గురిచేసింది.

"అబద్ధం _ అంతా మోసం _ నాకు చెప్పకుండా దాచి, నా బ్రతుకు నాశనం చేసారు_" హటాత్తుగా అరచినట్టుగా అంది శారద. ఆమెలోని అణువణువూ




అసహ్యం, ద్వేషం, కోపం, నిస్పృహా యత. అవమానంతో నిండిపోయింది. భర్త నీడనుకూడా భరించలేనిదానిలా. నెమ్మదిగా గోడవేపు తిరిగి పడుకుంది. నిస్తబ్దుడై నిలబడిపోయిన రవి బరువుగా నిట్టూర్చి. కదిలి వెళ్ళి తన జీవితంలో వెలుగులా దీపం ఆర్పివేసి, హృదయాన్నావరించుకున్న మాంద్యతలాంటి బెడ్ లైట్ వెలుగులో నెమ్మదిగా వచ్చి. ఆమె ప్రక్కగా నిద్రపోవడానికి చోటు చేసుకు కళ్ళు మూసుకున్నాడు.

అటు తిరిగి పడుకుందే కాని మనసులో అగ్నిపర్వతాలు బ్రద్దలవడం అంటే ఏమిటో తెలియసాగింది శారదకు. అంత సౌమ్యుడిగా పరిచయమయిన రవిలో ఎదుటివ్యక్తి భవిష్యత్తుతో చెలగాట మాడగల కఠినత్వం ఎక్కడ దాగుందో అర్థంకాలేదామెకు. అయినా ఆ కఠోర సత్యంనుంచి తనను దూరంగా ఉంచలేదని అంటున్నాడు. ఇది నిజమా? కాక, అతని నాటకంలో భాగమేనా? ఎందుకనో శారద మనస్సు అదంతా వంచనగా అంగీకరించలేకపోతోంది. హఠాత్తుగా ఆమెకు భాస్కరరావుగారి సంభాషణ జ్ఞాపకం వచ్చింది. ఆ మాటల్లో ఎక్కడా యీ ప్రసక్తి రాలేదు. అంటే ఆయన ఉద్దేశ పూర్వకంగా చెప్పలేదా — లేక తనకు తెలుసనను కున్నారా? ఎవరి పొరపాటుకు ఫలితం యిది? హద్దులతో ఎదురయిన అదృష్టాన్ని అంగీకరించడం ఎలా? — వణుకుతున్న చేతులతో చరాలున మొహం కప్పుకుని దిండులో తలదాచుకుంది. ఆమె కళ్ళు వర్షిస్తున్నాయి.

సరికొత్తదయిన ఆ నిశ్శబ్ద వాతావరణంలో అరగంట గడిచింది. నెమ్మదిగా

తలత్రిప్పి భర్తను చూసింది. విచ్చిన్న రవి మొహం లజ్జాభిమానాలతో ముకుళించుకుపోయింది. తమ పరిచయమయిన తొలిదినాలు గుర్తుకువచ్చాయి. ఆ రోజులలో అతనంటే ప్రత్యేకాభిమానం ఏర్పడింది. అది ప్రేమో కాదో ఆలోచించలేదు యెప్పుడూ. కాని గాంభీర్యంతో మిళితమైన అతని సౌమ్య ప్రవర్తన తన నాకర్షించిన మాట నిజం. అంతలోనే ఒక విషయం జ్ఞాపకం వచ్చింది శారదకు. అది, అప్రయత్నంగా తను అతని సన్నిధిని కోరుకున్న రోజులలో ఎప్పుడూ నోరువిప్పి అతను ఒక్క మాటకూడా అనలేదని. అయినా తానా విషయమే గుర్తించలేదని ... కేవలం రవి సాన్నిధ్యమే తనను పరితృప్తను చేసిందా ? మరి, అతని లోపం తన కోరిక తీరిన శుభసమయంలో కలచివేస్తున్న దెందుకు ?

శారద మనస్సు క్రమంగా మబ్బు విడిన మేఘంలా నిర్మలం కాసాగింది. ఆలోచనల బరువుతో యెప్పుడు రవి గుండెలపై వాలిపోయిందో ఆమెకు తెలియదు కాని అతని చేతులు ఆకాంక్షతో చుట్టివేయగా మెరిసిపోతున్న ఆ కళ్ళలోకి చూడలేక సిగ్గుతో తలవాల్చింది.

*　　*　　*

ఆరోజు ఆదివారం. పుస్తకం చదువుకుంటూ కూర్చున్న శారద దగ్గరకు యిద్దరు స్నేహితులతో వచ్చాడు రవి. వారిలో ఒకరు ప్రఖ్యాత గాయకుడు మురళీధర్, రెండవవారు గేయరచయిత విజయసారధి. మాటల సందర్భంలో శారదకూడా గాయని అని విని వారు ఆమెను రేడియోలో పాడించమంటూ సలహా యిచ్చారు. సంభ్రమంతో తల ఊపుతున్న భర్త కళ్ళలో ఒక్క క్షణం తళుక్కుమన్న విచిత్రమైన మెరుపును గుర్తించి ఆశ్చర్యపడింది శారద. కాని సంగీతం పేరు చెబుతేనే గంతులువేసే ఆమె మనసు యీసారి మూగపోయి నట్లయింది. అంతగా ఉత్సాహం చూపని భార్యను తనకోసం గాంధారీ వ్రతం పట్టడం సమంజసం కాదని వాదించాడు రవి.

ఇప్పుడు ఆకాశవాణిలో తరచూ శారదపాటలు వస్తున్నాయి. గాయని శారదారవిగా నలుగురిలో గుర్తింపు కలుగుతోంది. ప్రేక్షకులలో మొదటి వరుసలో తప్పనిసరిగ రవి వుంటాడు. కాలేజీ రోజుల్లోలాగే నిత్యాలంకారం వంటి చిరునవ్వు అతని పెదిమలపై మెరుస్తుంటుంది. అయితే ఆ మెరుపులో యిప్పుడు పరిపూర్ణత్వం ఉంది.

తనను ప్రాణంగా చూసుకొనే భర్త లోపాన్ని శారద మరచిపోవడానికి ప్రయత్నిస్తున్నా, ఆమె పరిచయమౌతున్న ప్రపంచం సరికొత్త విషయంగా చర్చిస్తోంది. తన ఎదురుగానే గుసగుసలకు అర్థం తెలిసిన శారద



మనస్సు ఒక్క క్షణం ఉండేలు దెబ్బతిన్న పక్షిలా విలవిల లాడుతుంటుంది.

ఆరోజు రేడియో స్టేషనులో అప్పుడే రికార్డింగ్ పూర్తి చేసుకుని లాంజ్‌లో కూర్చోవడానికి వస్తున్నారు శారదా, రవి. అంతలోనే వెనకాలనుంచి – "ఆ వెళ్తున్నామె శ్రీమతి శారదారవి. మంచి గాయని. దేవుడు తెలివితక్కువ పనులు కూడా చేస్తుంటాడు. అంత మంచి గాయని భర్త మూగవాడు. ఎప్పుడూ సంతోషంగానే కనిపిస్తుంది కాని మనసులో ఎంత బాధపడుతుందో పాపం!"

—శారద అభిమాని యెవరో అంటున్నారు. ఉలిక్కిపడి, ప్రక్కనే ఉన్న భర్త మొహంలోకి కంగారుగా చూసింది శారద. కాని యేభావం ఆమెకు వ్యక్తంకాలేదు. భయంకరమైన మౌనం యిద్దరిమధ్యా విలయతాండవం చేస్తుండగా వెళ్ళి కారులో కూర్చున్నారు. తప్పుచేసిన దానిలా ఉండిపోయిన శారద

మధ్యదారిలో హటాత్తుగా తలయెత్తి భర్తవేపుచూస్తూ. "వాళ్ళు - వాళ్ళు అనుకున్నది అబద్ధం" అంది. కారు వింగ్ లోంచి దూరమైపోతున్న నౌబత్ పహాడ్ వేపే చూస్తున్న రవి నెమ్మదిగా యిటుతిరిగి చిరునవ్వు నవ్వాడు. ఆ నవ్వులో తన మనసు నర్థంచేసుకున్న విశాలత్వం కనిపించింది ఆమెకు.

జీవితంలో తనకు యెదురయినది అదృష్టమో దురదృష్టమో తెలియని అయోమయావస్థలో ఉండగానే, తన ప్రశ్నలకు జవాబుగా, "ఇదిమోసం, అన్యాయం" అంటూ ఉండీ ఉండి గగ్గోలుపెట్టే మనసుకు ఊరటగా శారద తను తల్లి కాబోతున్నట్లు తెలుసుకుంది.

ఆరోజు ఏదోపనిమీద వంటింట్లోకి వస్తున్న శారద లోపలినుంచి మాటలు విని ఆగిపోయింది. వంటమనిషి పని దానితో అంటోంది.

"నీదంతా మరీచోద్యం. మూగవాళ్ళ పిల్లలు మూగకాకుండా మామూలుగా ఉంటారా ఏం? ఇంతకీ శారదమ్మ అదృష్టం మంచిది కాదు. బంగారపు బొమ్మలాంటిపిల్ల. ఆ అమ్మ పాట విన్నప్పుడల్లా నా గుండె తరుక్కుపోతూంటుంది. ఎటువంటి పిల్లకు ఎలాంటి భర్తను రాసిపెట్టాడు దేవుడు."

ఆవిడ ధోరణి సాగిపోతోంది. అప్పటికే తూలిపోతున్న శారద ఇక నిలబడలేక తన గదిలోకి వచ్చేసింది. ఆమె మస్తిష్కం మొద్దుబారినట్లయిపోయింది. ఈ యింటి నావరించుకున్న భయంకర మూకాంధకారంలో ఎక్కడో దూరంగా మిణుకుమంటున్న తన ఆశాజ్యోతి, తన సర్వస్వం తన పాపకూడ, మాట్లాడకుండ సత్యాగ్రహం చేస్తుంది. తన చైతన్యాన్ని పణంగా తీసుకున్న ఈ భయంకర మూకత్వంతో, ఆప్యాయంగా ఎవరూ పలుకరించనైనా పలుకరించని ఈ నిశ్శబ్ద జీవితంలో చెవులార మన సంతా నిండిపోగా "తనవారి" - ఒక్క మాట వినడానికై చాతకపక్షిలా ఎదురు చూడాలి. ఈ అనంతమైన నిరీక్షణలోనే తన బ్రతుకు అంతమయిపోతుంది. శారదలో విశృంఖలంగా విజృంభించిన భావనలన్నీ వికృతరూపాలుదాల్చి బాహువులు చాచి ఆమెను చుట్టుముట్టినయి.

అప్పుడే లోపలకు వచ్చిన రవి గది చీకటిగా ఉండడానికి ఆశ్చర్యపడుతూ దీపం వెలిగించాడు. శ్రావణమేఘాన్ని శరశ్చంద్రికలా అంతటా చల్లనికాంతి ఆవరించుకుంది. తలత్రిప్పి చూసిన అతనికి తెలివి తప్పి కుర్చీలోపడివున్న శారద కనిపించింది.

ఒకొక్క మాసమే గడుస్తున్నకొద్దీ శారదలో పాపతోబాటు సందేహాస్పదమైపోయిన పాప భవిష్యత్తును గురించిన భయాందోళనలుకూడా పెరగసాగాయి. నవ్వుతూ మాట్లాడుతూనే హటాత్తుగా ఆగిపోయి తనమీదుగా ఎక్కడో శూన్యం



లోకిమాస్తూ ఆలోచనలలో పడిపోయే భార్య ప్రవర్తన అర్థంకాకుండా పోతోంది రవికి.

తన కలలపంట ఆడపిల్లగా తెలిసినప్పుడు శారద మనోభావాలు అనూహ్యం. మాతృత్వపు మమతను భయాందోళనలు పెనవేసుకుంటుండగా ప్రశాంతంగా సంతృప్తితో చిరునవ్వు నవ్వలేకపోయింది. పాలుత్రాగుతున్న పాపతలను మృదువుగా నిమిరే ఆమెచేయి హఠాత్తుగా వణికిపోయేది. ఒడిలో ఆడుకుంటున్న పాపను రెండుచేతులా నిలబెట్టి

"పాపా ఒక్కసారి నన్ను అమ్మా అను. నాతో ఒక్కసారి మాట్లాడు తల్లీ" అని అడగాలనిపించే ఉద్విగ్నతను నిగ్రహించుకోలేకపోయేది. కొన్ని తసతప

బాధిస్తూ ఎత్తుకోమని చేతులందించి బోసి నోటితో నవ్వే పాప భంగిమ మాటలాడ లేక పడుతున్న యాతనలా కనిపించి దగ్గరకు వెళ్ళడానికే భయపడిపోయేది. మొదటిసారి గీత "అమ్మా" అని పిలిచి నప్పుడు శారద కలగోంచి మేల్కొన్న దానిలా నిలబడిపోయింది. తను విన్నది నిజమేనని నమ్మకం కలగగానే అప్రయ త్నంగా,

"ఏమండీ మనగీత మాట్లాడుతోంది. హమ్మయ్య యిక ఫర్వాలేదు. నా భయం తీరిపోయింది" అని అరిచినట్టుగా అంది. సంభ్రమంగా కూతురివేపే చూస్తున్న రవి ఎదురుచూడని ఆ మాటలకు తెల్ల బోయాడు. అప్పటికి తానన్న దేమిటో తెలుసుకున్న శారద హఠాత్తుగా వణికి పోయి తలయెత్తి చూడలేక చేతులలో ముఖం దాచుకుని అక్కడనుంచి గబగబా వెళ్ళిపోయింది. ఇన్నాళ్ళుగా బోధపడ కుండా వేధిస్తున్న భార్యమూపుల భావం చటుక్కున స్ఫురించిన రవి మనసు జ్వాల సూనాలతో ముకుళించుకు పోయింది.

హఠాత్తుగా గతంనుండి ప్రస్తుతం లోకి వచ్చిన శారద "అమ్మా! గీతా!" అంటూ కూతురి భుజంపట్టి కుదుపబో యింది. గుమ్మంలో నిలబడి భార్య మొహంలో మధురగాయని శారదా రవి ఆశాశిఖరం ఒరిగిపోవడం చూస్తున్న రవి ఒక్కఉదుటున వచ్చి ఆమె నాపి వేశాడు. స్వప్నావశిష్టలా అతనివేపు తిరిగిన శారద కళ్ళనుండి సరస్వతీవీణ విషాదస్వరాలు పలికినట్టు రెండు నీటి బిందువులు రాలాయి.

తెల్లవారింది. కూర్చున్న చోటనే కునుకుపట్టిన శారదకు మెలకువ వచ్చింది. పడక్కుర్చీలో వాలి నిద్రపోతున్న భర్త కనిపించాడు. నెమ్మదిగా లేచి లైట్ ఆర్పడానికి టేబుల్ దగ్గరికి వచ్చింది. రవి డైరీ తెరిచిపెట్టి ఉంది క్కడ. ఏదో వ్రాస్తూ అలాగే ఉంచేసి నట్టున్నాడు, పెన్ పేజీల మధ్య ఉండి పోయింది. దానిని యథాస్థానంలో పెట్ట బోయిన శారద చేతులు అప్రయత్నంగా ఆపేజీ తిరగవేసాయి. ఒక్క క్షణం సందే హించినా ఏమి వ్రాసాడో చూసింది. అందులో రెండే వాక్యాలు ఉన్నాయి.

"ప్రేమని ప్రకటించి అపరాధం చేశాను నేను. నా ప్రేమను ఆరాధనగా మార్చుకొని ఉంటే నా ఆరాధ్య దేవత యింకెక్కడయినా సుఖపడి ఉండేది. భగవాన్! శారదను పెళ్ళి చేసుకోవ డంలో పొరపాటు చేసాను. నాదనుకున్న ఆ మనస్సులో కష్టానికి నాకు చోటు లేదని రాత్రి శారద కళ్ళు నాకు చెప్పాయి."

చదవడం పూర్తి అయ్యేసరికి శారద కళ్ళు వర్షిస్తున్నాయి. కళ్ళు తుడుచుకొని మళ్ళా డైరీలోకి దృష్టి సారించిన ఆమెకు ఆ వాక్యాలలో ఎనిమిది సంవత్సరాలనాడు గ్రీన్ రూమ్ గుమ్మంలో నిలబడి మంత్రముగ్ధుడిలా తన కళ్ళలోకి చూస్తున్న రవి కనిపిం

పాడు. వణికిపోయింది శారద. ఆమె మనస్సును చీల్చుకుంటూ వెలువడిన "లేదు లేదు" అన్న పదాలు నరనరాల్లోకి పరిగెత్తాయి. ఇక అక్కడ నిలబడలేక గబగబా గది బయటకు వచ్చేసింది.

డాక్టరు సలహా ప్రకారం ఆ రోజు ఉదయం పదిగంటల ప్రాంతంలో హైదరాబాదులోకల్లా పెద్దదయిన ఒక నర్సింగ్ హోమ్‌లో గీతకు గది యేర్పాటు చేయబడింది. బొంబాయి నుండి యిద్దరు నిపుణులుకూడా వచ్చారు. వారెందరు యెన్ని విధాల ప్రయత్నించినా, భర్తలా కూతురుకూడా మాట్లాడే అర్హత కోల్పోతే యేంచేయాలనే ప్రశ్నకైనా కనీసం తల్లికి మిగల్చకుండా అనంతప్రకృతిలో విశ్వలీనం కలిసి పోయింది గీత. చనిపోయే సమయంలో కూడా చిన్నారి గీత చేతిలోనే ఉన్న వెండికప్పు పట్టుతప్పి వెన్నెల కళలతో క్రిందపడి దొర్లుతూ వచ్చి మంచం ప్రక్కగా రవి ఒడిలో తలవాల్చి పడి ఉన్న శారద పాదాలను తగిలి ఆగి పోయింది.

గీత పోయిన పదిహేను రోజులకు పుట్టింటినుంచి వచ్చింది శారద. ఎప్పటిలా తన చేతిని ఆప్యాయంగా తీసుకునే మృదుహాస్యం యీరోజు లేదు. కూలిపోతున్న భార్యను పట్టుకొని నడిపిస్తూ నెమ్మదిగా లోపలికి తీసుకువచ్చాడు రవి. గది గుమ్మంలో అడుగుపెట్టిన శారదకు ఎదురుగా టేబుల్‌మీద గీత ఫోటో, ప్రక్కనే వెండికప్పు కనిపించాయి. భర్త చేయి విడిపించుకుని నెమ్మదిగా అక్కడకు వెళ్ళింది. అప్పటికే ఆమె కళ్ళల్లో నీరు సుళ్ళు తిరుగుతోంది. కన్నీటిపొరల మధ్య, మసకగా కనిపిస్తున్న కప్పు క్రింద ఒక కవరు ఉంది. కళ్ళు తుడుచుకుని వణుకుతున్న చేతులతో దానిని విప్పింది. చదువుతున్నకొద్దీ శారద మొహంలో కోపం, విచారం, భయం, అసహ్యం – అన్నీ కలిసిపోయిన ఒక భయంకర భావం కదలాడసాగి ఎదురుగా ఉన్న అద్దంలోనుంచి ఆమెనే చూస్తున్న రవిని కలవరపెట్టింది. చదవడం పూర్తిచేసి శారద ఆ చూపులే మరల్చి కవర్‌పై వెయిట్‌గా పెట్టబడిన వెండికప్పుని ఒక్కసారి చూసి మరుక్షణంలోనే కవర్ని ముక్కలుగా చింపి ఆ కప్పులో పోసేసింది. గబగబా కదలి వచ్చిన రవి అప్పటికే అచేతనంగా వాలిపోతున్న భార్యను పొదివిపట్టుకున్నాడు. ఆమెను మంచంపై పడుకోబెట్టి, నెమ్మదిగా ఆ కాగితం ముక్కల్ని ఏరి కూర్చి విషయం తెలుసుకోడానికి ప్రయత్నించాడు. అది రేడియో స్టేషన్ నుంచి శారదను పాట రికార్డింగ్‌కు ఆహ్వానిస్తూ వచ్చిన కాంట్రాక్టు ఫారం.

పావుగంట తర్వాత భర్త ఒడిలో కళ్ళు తెరిచింది శారద. భావశూన్యంగా తన మొహంలోకి చూస్తూ ఉండిపోయిన ఆమె కనుకొలకులు చెమర్చినట్లు అనిపించింది రవికి. అంతలో శారద అన్నది

"ఇక నేను పాడను!"

—అంటుండగా మధురమైన ఆమె గొంతు భయంకరంగా వణికింది.


నా నవల చదవడం నీకింత ఇబ్బంది కల్గిస్తుందనుకోలేదు క్షమించు బ్రదర్ !!


మీ నవల చాలా బావుంది - కాని అడివి బాపిరాజుగారి నవలను మార్చకుండా అలాగే రాసి ఉంటే ఇంకా బావుండేది!


మా వారు రాసిన ఈ నవలను ఏ పత్రికగాని, పబ్లిషర్‌గాని, సినిమావాళ్ళుగాని తీసుకోలేదు - చివరకు నాకిచ్చేశారు


మీ నవలకు ముగింపంటూ ఉందా! - లేక ఇలాగే రాస్తూనే ఉంటారా?




"ఏవండోయ్, ఈ వార్త విన్నారూ?" అంటూ వీధిలోంచే అరుస్తూ వస్తోంది అరుణ.

"ఏవిటి?" అంటూ పొయ్యిమీది పాల గిన్నెని భర్తకప్పగించి దారిలో గిన్నెని తన్నేసుకుంటూ ఇసింటా వచ్చింది కరుణ.

"ఆ సుందరమ్మగారి కొడుకులేడూ 'శ్రీని'ంటారు...వాడు ఎవరో నాయుళ్ల పిల్లని పెళ్ళాడతాట్ట!"

"నిజం? ... అవ్వ ... అవ్వ ... అంటూ బుగ్గలు నొక్కుకుంది కరుణ.

"ఎల్లమ్మ చెప్పిందండీ నిన్న రాత్రి. రాత్రంతా నిద్రపట్టలేదంటే నమ్మండి.

చెల్లారగానే ఇదిగో మీ చెవిని వేస్తే గానీ..."

"కాదుటండీ! మరి ఇంత ఘోరవా! బ్రాహ్మణ్యం మంట గలిపేస్తూంటే బాధ కడుటండీ. కలి! ఘోరకలి! కరువులూ, కాటకాలూ ముంచుకొస్తున్నాయంటే మండిపోవ్వా మరి! అయినా ఆ సుంద రమ్మ కొచ్చినన్నేళ్ళ ఎవరి కొచ్చేయి..." అంది కరుణ చేతులు తిప్పుతుంటూ.

"సుందరమ్మ తప్పేం లేదుటండీ. ఈ పెళ్ళి చేసుకునేమాటైతే ఈ ఇంట్లో నువ్వుండటానికి వీల్లేదని శాసించింది ఆవిడ! అయినా ఈ కాలం కుర్రవెధవ లున్నారు చూసేరూ - కిందామీదా ఉండకుండా రాలిపడిపోతున్నారు..."

"ఆఁ మీ వెర్రిగానీ...తల్చుకుంటే ఆ గుంటవెధవని శాసించలేదుటండీ ఆవిడ. లోకానికి జడిసి..."

ఇంతలో లోపల చంటాడి ఏడుపు తారస్థాయి నందుకోవడంతో అరుణదగ్గర శలవుపుచ్చుకుని వంటింట్లో కెళ్ళింది కరుణ.

"నాన్న గిల్లేడూ...ఊఁ..." అంటున్నాడు చంటాడు. అవునుమరి అతను ఆఫీసువేళకి తెములాలి!

* * *

ఇల్లంతా బోసిపోయినట్టుంది. ఆ బల్ల, కుర్చీ, పుస్తకాలు, ఇంకు సీసా ... పదే పదే శ్రీనుని గుర్తుతెస్తున్నాయి. శ్రీను ఇంట్లో లేకపోవడాన్ని అవి మాటిమాటికి జ్ఞాపకం చేస్తున్నాయి. శ్రీనుతో ఇక అన్ని బంధాలూ తెగుతాయన్న భయాన్ని అనుక్షణం వ్యక్తం చేస్తున్నాయి. సుందరమ్మ మనసులో సంక్షోభం. ఏదో వెలితి...వ్యధ! మమతకి, అహంకారానికి మధ్య సంఘర్షణ! మమతకీ, ధర్మానికీ పోరాటం జరుగుతోందనుకుంటోం దావిడ!

'వాడింక చచ్చినట్టే లెక్క. వాడికీ నాకూ సంబంధంలేదు,' అని పైకన్నా, కాలం వారంరోజులు వెనక్కి జరగాలని, శ్రీను మళ్ళీ నవ్వుతూ తన కళ్ళెదుట మసలాలని మనసులో కోరిక! అంతా ఒక పీడకలగా అంతమై...కళ్ళుతెరిచి, శ్రీనుకి వివరించి చెప్పి, 'ఇంత అసందర్భపు కల కన్నానురా' వాడు వెక్కిరిస్తుంటే...అన్న ఊహాగానాలు ... విషాదగీతికలు?...

కాలం వెనక్కి జరగదు. వాస్తవం ఎన్నటికీ కలకాదు. మిగిలింది వ్యధ! ఇంక జీవితమంతా...జీవితం ఇంకానా... శ్రీను లేకుండా ...?

తన అనురాగాన్ని, అనుబంధాన్ని ఇంతలోనే మర్చిపోయేదా? అంత సులువుగా తెంచేసుకోగలదా - ... తనకి సాధ్యం కాకపోతోందేం?

వాడికి తనమీదున్న భక్తి, ప్రేమ,




గౌరవం... అంతా నటనా? ఆ మాయి లాడి పిల్లలా బుట్టలో వేసుకుందా? 'అమ్మకంటే అప్పులెక్కువ'న్నట్టుందే శ్రీను- ఒక ఆడదానికోసం ... అమ్మనే కాదనడం... నమ్మడం కష్టం...

ఇంత చపలచిత్తుడైతే ఆ పిల్ల మాత్రం ఏం సుఖపడుతుంది? ఆ పిల్ల సంగతి కేంగాని... విడదీయలేని చిక్కు- తల్చుకున్నకొద్దీ అసహ్యం... ఆ ఒంటరితనం ఎక్కువసేపు కొనసాగితే పిచ్చెక్కిపోతుందేమోనని భయం!

* * *

"ఈ విడ్డూరం చూసేరా శాంతమ్మగారూ? సుందరమ్మ కొడుకు ఎవత్తెనో పైకులందాన్ని పెళ్ళాడుతుంటే - ఆ రిజిష్టరు మేరేజికి మన అరుణ మొగుడు సాక్షి సంతకం పెట్టేట్ట! ఎదురుపడితే మొహం మొట్టిస్తానని భయపడి నన్ను చూసి మొహం దమ్మిడీ అంత చేసుకుని ఇంట్లోకి దూరిపోయింది!" అంది కరుణ చేతులు తిప్పుకుంటూ - బుగ్గలు నొక్కుకుంటూ కళ్ళింత చేసుకుని.

"మా ఆయన రెండో సాక్షి సంతకం పెట్టేడు తల్లీ!" అంది శాంతమ్మ తాపీగా. కరుణ మొహం దమ్మిడీ అంత చేసుకుని. "మిమ్మల్ననలేదు. ఏదో తెలీక అనేసాను. మరేమనుకోకండి!" అంటూ వీధిలోకి జారుకుంది.

* * *

పోస్ట్‌వాడి కేకవిని ఉత్తరం అందుకుని సుందరమ్మగారికిచ్చింది ఎల్లమ్మ. ఆ ఉత్తరంమీద దస్తూరీ చూడగానే ఆమె



తత్వమామెది. అయినా ఆమెకి తెలియకుండానే ఆమెలోని ప్రేమ, అనురాగం జయించేయి.

సతీసమేతంగా వచ్చిన కొడుకుని ఆదరించకుండా ఉండలేకపోయింది— నలుగురూ ఏమనుకుంటారోనన్న భయం ఓపక్క మనసుని పీకుతున్నా !—

* * *

"ఇదుగో సుశీలా, ఈసారైనా కోడల్ని కనకపోయేవో...మా చంటాడు ఊరుకోడు సుమా?" అంటోంది కరుణ.

సుశీల సిగ్గుగా నవ్వింది.

"ఏవమ్మో! నా కూతురు పనికి రాదేం?...పోనీలే, నా కూతురు సుశీలకి కోడలౌతుంది..." అంటోంది కరుణ పగలబడి నవ్వుతూ.

సుశీల నాలుగేళ్ళ కొడుకు ప్రకాష్ బాబువేపు చూసి నవ్వింది. కరుణ శాంతమ్మగారుకూడా నవ్వుతున్నారు.

ఇదంతా చూస్తున్న సుందరమ్మగారికి గతం కొద్దిగా జ్ఞాపకంవచ్చి, 'ఇదేం లోకం!' అనుకుని ఆశ్చర్యపోయింది.


కొత్తచీర తెచ్చి మాఆవిడను ఏడ్పించావా ఎలా?
ఇంట్లోవున్న అద్దాలన్నీ దాచేశాను!!


శ్రోతలను మరీ అంత ఉత్సాహపరిచేట్లు ప్రసంగించవద్దని చెప్పానా?

# నేను దెయ్యాన్నయ్యాను



కన్నడమూలం: శ్రీ ఉప్పాడి
తెలుగు: యన్.యస్.రావు

బెంగుళూరులో జరిగిన ఒక కాన్ఫరెన్స్‌లో పాల్గొనుటకు వెళ్ళిన మేము, బెంగుళూరుకు తిరిగి వచ్చేటప్పుడు ఘోరమైన ప్రమాదంలో చిక్కుకున్నాము. బస్సు, లోయలో పదిహేను అడుగుల లోతైన కనుమలో పడి నుచ్చు నుచ్చయిపోయింది. నా తల, ఎముకలో ఏ భాగానికో గట్టిగా తగిలి, కన్నులు చీకట్లు కమ్మినై. చీకటి! జగమంతా ఒట్టి చీకటి.

మరుక్షణమే స్పృహవచ్చి బయటకువచ్చి నిలబడ్డాను. చాలామంది చచ్చిపోయారు. ఎక్కడో ఆరేడుమంది మాత్రం, ఆకారం పోగొట్టుకుని, ఆ బస్సులోనుండి ప్రాకుతూ, బయటకు రావడానికి ప్రయత్నిస్తున్నారు. అంతలో నా స్నేహితులొకరు - నారాయణరావు, నాదగ్గరకువచ్చి నిలబడ్డారు. ఆయన నాకు పరిచయమైనది బెంగుళూరులోనే. కేవలం మూడు రోజులలోనే మేము స్నేహితులమయ్యాము ఇంక ఇద్దరు అటువంటి స్నేహితులే అక్కడకు వచ్చి చేరారు

"ఇదేమిటి! మహానుభావా! మన మిప్పుడు ఏమయ్యాము!" అంటూ ప్రశ్నించారొకరు.

నారాయణరావుగారు తనను తానే చూచుకున్నాడు. బస్సుదగ్గరకుపోయి, లోపలకు తొంగిచూచి తిరిగివచ్చి చెప్పారు.

"మన మందరమూ, చచ్చి దెయ్యాల మయ్యాము." మాకందరకూ ఆశ్చర్య మైంది

"అవును, మనమందరమూ దెయ్యాల మయ్యాము. మన శరీరాలు బస్సులోనే నిశ్చేష్టితాలై పడివున్నాయి. మనము బయట నిలబడ్డాము. ప్రాణం వున్నవాళ్లు, మెలికలుతిరిగి పోతున్నారు. అయినా మనకు నొప్పిలేదు. మనం బాధపడటం లేదు."

అయితే మాకందరికీ ఏదో అవ్యక్త మైన బాధ వుండనేవుంది. అది అందరి ముఖాల్లోనూ కనిపిస్తూనేవుంది.

"ముందు మనగతి?" అడిగారొకరు.

"గతేముంది? మంచిదే అయింది. మనకిక బాధ, తాపత్రయం ఏమీ వుండవు." ఇంకొకరన్నారు. ఆయన ధైర్యవంతుడు అనుకున్నాను నేను.

"ఐతే మనమిప్పుడు ఎక్కడికి పోవాలి?" అని అడిగాను.

"నేనుమాత్రం ఇంటికి వెళ్ళాలి. అయితే ముందే చెప్పానుకదా! ఒకసారి మీరు మాయింటికి రావాలి" అన్నారు నారాయణరావు. మేమందరమూ బ్రతికి వుండగానే ఆయన మమ్మల్ని ఆహ్వా నించారు. ఇప్పుడు మళ్ళీ జ్ఞాపకం చేశారు.

ఇప్పుడు మాకెవరికీ వాహనాల అవసరంలేకుండా పోయింది. నారాయణ రావు సత్రమని పైకిఎగిరి మాయ మయ్యారు. ఆయన అదృశ్య మయ్యే వరకూ, మేముచూస్తూ నిలబడ్డాము.

"నా ఎనిమిది నెలల పాపకు ఒంట్లో బాగాలేదని టెలిగ్రాం వచ్చింది గదా, ఇప్పుడు ఎలా వున్నదో తెలియదు. నమస్కారం, నేనూ, ఇంటికే వెళ్తాను." అంటూ ఇంకొకరు వెళ్ళిపోయారు.

మాకిక అక్కడేంపని? మేమంద రమూ ఎవరికి ఇష్టంవచ్చినట్లు వారు వెళ్ళిపోయాము. ఒకరుమాత్రం ఇంకా ఆ బస్సుదగ్గరే తిరుగుతున్నారు. అతని కేమి వ్యామోహమో మరి! మంగుళూరులో నే నున్న అద్దెఇంటికి పోతున్నవాడి నల్లా వెంటనే దారి మార్చాను.

నాకిక అక్కడేంపని? నేను బెంగు ళూరుకు పోవడానికి రెండు రోజులముందు బావమరిది మంగుళూరుకు వచ్చాడు. అతను "గదగ్"లో పోస్టుమాస్టరు. ఆయన కొడుకుకు నామకరణం, అన్న ప్రాశన మహోత్సవానికి మమ్మల్ని ఆహ్వానించడానికి వచ్చాడు. నేను ఏదో గాదపిచెప్పి, నాభార్యనూ, కొడుకును పంపించాను తరువాత "గదగ్" నుండి నాభార్యను మావూరు పంపిస్తానని చెప్పి, తీసుకొని వెళ్ళాడు. ఇప్పుడు నాభార్య

మా వూరిలో వుంది. మా ఊరికి మంగుళూరుకు ఉత్తరంగా 60 మైళ్ళు. నేరుగా అక్కడికి వెళ్ళాను.

మాది పెద్ద సంసారం. అమ్మ, నాన్న, అన్న, అత్త, చెల్లెలూ, తమ్ముడూ అందరూ వున్నారు. ఇంటి వరండాలోకివచ్చి నిలబడ్డాను. ఇల్లంతా తిరిగివచ్చినా నా "లీ..." ఎక్కడా కనిపించలేదు. ఆఁ! మర్చిపోయాను. నాభార్యపేరు లీలావతి. ఆమెను నేను ఎప్పుడూ "లీ..." అని పిలుస్తుంటాను.

అంతలో ఇంటి వెనకవైపున బావి దగ్గర, వద్దని ఏడుస్తున్న రెండేళ్ళ కొడుకును, మాయ చేసి స్నానం చేయిస్తున్న నాభార్య కనపడింది. అక్కడికి వెళ్ళాను.

"సాయంత్రం నాన్నారు వస్తారు. నిన్ను సినిమాకు తీసుకెళ్తారు." ఎంత ఆశనిండివుంది ఆమె మాటల్లో. పసివాడు కూడ "సినిమా... నాన్నారు... పోదాము..." అంటూ వచ్చీరాని మాటలలో చెప్తున్నాడు.

విన్నాను. నా మనస్సు అంతులేని బాధకు గురైంది. నిజంగా ఆసాయంత్రం నేను సజీవంగా రావలసినది. కాని, దురదృష్టవంతుణ్ణి. శరీర విహీనుడనై ముందేవచ్చాను. ఆక్షణం, ఘోరమైన ఆపదలోమిగిలి, అపారమైన మరణ వేదన అనుభవించుచు ప్రాణంతోవున్న ఆనాలుగైదుమందే అదృష్టవంతులు అనుకున్నాను. నా మూగబాధ ఎవరికి అర్థంకాదు. భార్య,పిల్లవానిచుట్టూ, మందమైన గాలివలె తిరిగాను. పిల్లవాడు, స్నానం అయిన తరువాత, అన్నంతిని నన్నే తలచుకుంటూ పడుకున్నాడు.

సాయంత్రం మంగుళూరు ఆస్పత్రి నుండి టెలిగ్రాం వచ్చింది. టెలిగ్రాం విషయం తెలిసిన మరుక్షణం, ఇల్లు నిశ్శబ్దం అయింది. కొన్ని క్షణాలు రాయి వలె నిలబడ్డ నాభార్య స్పృహ తప్పి పడిపోయింది. అత్తయ్య అక్కడకు పరుగెత్తికెళ్ళింది. అమ్మ ఒకప్రక్క కూలబడిపోయింది. తండ్రి ఏమీ మాట్లాడకుండ మూగవేదన అనుభవిస్తున్నాడు. అన్నయ్య శిలయ్యాడు. కొంచెం సేపటికి నాన్న తేరుకొని, అన్నను పిలిచి, ఏదో చెప్పాడు. అన్నయ్య వంకెకు తగిలించి వున్న చొక్కాలాక్కొని వెళ్ళిపోయాడు. ఈదుస్థితి కలిగించిన దైవాన్ని మూగగానే శపించాను.

రాత్రి చాలా ప్రొద్దుపోయిన తరువాత టాక్సీ ఒకటి వచ్చి ఇంటిముందు ఆగింది. దాంట్లోనుంచి నా శవాన్ని క్రిందకు దించారు. తల ఎముక నుజ్జు, నుజ్జుగా నలిగి, రక్తంతో తడిసి గడ్డ కట్టింది. ఎడమకన్ను ఎముక విరిగి లోపలకు త్రోసుకుపోయి, ముఖం గుర్తు పట్టలేనంత వికారంగా వుంది. గొంతు సగం విరిగిపోయింది. కుడిచెయ్యి విరిగి వ్రేలాడుతున్నది. రక్తంలో తడిసిన

శరీరం చూడ్డానికి. నాకే అసహ్యం వేసింది.

దాన్ని చూచిన నా భార్య పరిస్థితి చూచేసరికి, నా గుండె· వూగిపోయింది కళ్ళు, నీళ్ళతో నిండిన్నై. ఆ సన్నివేశాన్ని చూసే ధైర్యం చాలక, అక్కడ్నుంచి పరిగెత్తాను. "ఎక్కడకు పోవాలి ?" కొంచెంసేపు ఆలోచించాను. ఛటుక్కున నారాయణరావు గుర్తొచ్చారు వెంటనే అక్కడకు పరిగెత్తాను అక్కడ ఎంత అవస్థో? నేనూ, ఆతనూ ఒకేవిధమైన దుఃఖజీవులం కనుక అతని స్నేహంతోనన్నా కొంచెం మనశ్శాంతి దొరుకుతుందేమో అని నా అభిప్రాయం.

కాని అక్కడ నేను చూసిన సన్నివేశం పూర్తి విరుద్ధం. నారాయణరావు భార్య దుఃఖం విపరీతంగావుంది. వాళ్ళ 12 సంవత్సరముల పిల్లకు ఆవేశం ఆవహించింది. ఏమేమో మాట్లాడుతున్నది. కొంచెంసేపటికి ఆవేశం తగ్గింది. ఆ పిల్ల శరీరంనుండి నారాయణరావు బయటకు వచ్చారు.

"ఏమిటి? ఈ పని ?" అని అడిగాను.

"అంటే, నేను మాట్లాడవద్దా !?. మన మిప్పుడు మాట్లాడాలంటే ఎవరిదన్నా శరీరం కావాలిగదా !" అన్నారు నారాయణరావు.

అవును. మాకు దేహంలేదు. అందువలన మాట్లాడలేము. పనులు చేయటము మావల్లకాదు. అయినా, ఏదైనా పనువుదంటే దాన్ని కష్టపడుతుందానే శబ్దం చేయగలము. నారాయణరావు ఇంట్లో వేరే మగవాళ్ళు లేరు. పిల్లద్వారా ఆయన ఏదేదో చెప్పిస్తుండాలి నాకేం మూ ఏడుస్తూ, ముందు జరగవలసిన పనులలో నిమగ్నులైనారు. నేనక్కడవున్న పదిహేను రోజులలో, ఎనిమిదిసార్లు ఆ పిల్లకు ఆవేశం వచ్చింది ప్రతిసారి ఆ పిల్ల అపారమైన వేదనను అనుభవించి నది నేను గమనించాను. నారాయణరావుకు చెప్పాను.

"పాపం! మీ కుమార్తె గదా, ఆపిల్ల! ఆమె ఆరోగ్య విషయం పట్టించుకోరే, మీరు. వేరే ఎవరూ దొరకలేదా మీకు?"

ఆయన వెంటనే సమాధానం చెప్పలేదు. కొంచెం ఆగి అడిగారు.

"మీరేమన్నా ఇతరులమీదకు పోవడానికి ప్రయత్నించారా ?"

"లేదు.

"అందుకే ఇలా అడుగుతున్నారు."

"ఎందుకు ?"

"ఇటువంటి అవకాశం అన్ని సమయాల్లోనూ దొరకదు, అందరిలోనూ దొరకదు సమయంకోసం చూస్తూ కూర్చోడానికి నాకు ఓపికలేదు."

వారి సమాధానం, నాకు తృప్తిని కలిగించలేదు. ఒకరిని ఆశ్రయిస్తే మనకు కలిగేదేముంటుంది? వారి దగ్గరనుండి




బాబూ! దయచేసి మీరు క్రింద సీటులో
పడుకోండి నేను పైన పడుకుంటాను

వీడ్కోలు తీసుకొని మంగుళూరులోని నా అద్దె ఇంటికి వచ్చాను. ఇంటికి తాళం వేసివుంది. దానివలన నా ప్రవేశానికి ఏమాత్రం అడ్డంకి కాదు. లోనికి ప్రవేశించాను. అక్కడవున్న ప్రతి వస్తువు, నాలోని ఆవేదనను ఎక్కువ చేసినై. భోజనంచేసే పళ్ళెం, వంటసామాన్లు, వ్రాసుకొనే మేజాబల్ల, పెళ్ళైన కొత్తలో తీయించుకున్న ఫొటో .... అయ్యో, లీ...! ఈ స్థితి వస్తుందని కల్లోకూడ అనుకున్నామా? పడకగది. ఇప్పుడు ధూళితో నిండిపోయుంది. ఇక్కడ ఎన్ని రాత్రులు, మనంత సుఖజీవులు ప్రపంచంలోనే వుండరని అనుకున్నాం! ఇప్పుడు మనం దుఃఖ జీవులం. చిర దుఃఖ జీవులం! పగలూ రాత్రి అక్కడే తిరగడం మొదలుపెట్టాను.

ఒకటి రెండు రోజుల్లోనే నా యింట్లో వాళ్ళు, ఇంటి యజమానిని పిల్చుకొని అక్కడకు వచ్చారు. తాళం తీశారు. సామాన్లన్నీ మూటకట్టారు.

"అద్దె బాకీవున్నదా?"

ఇంటి యజమాని మంచివాడు. ఒక నెల బాకీవున్నది. కాని లేదని చెప్పాడు. ఇల్లు ఖాళీఅయింది. రెండు రోజుల్లోనే ఇంట్లోకి క్రొత్తవారు వచ్చారు. భార్య, భర్త ఇద్దరే. చిన్న సంసారం. మేమూ ఇక్కడకు వచ్చినప్పుడు ఇద్దరమేకదా!

భర్త, సన్నగా, పుల్లలాగుంటాడు, బొర్త అలంకార ప్రియ. నా "లీ...." జ్ఞాపకంవచ్చింది. ఆమె ఇంత సోగ్గా, పౌడరు పూసుకునేది కాదు. ఎందుకో ఈమెమీద నాకు మంచి అభిప్రాయం ఏర్పడలేదు. నా "లీ..." పాదపు యోగ్యతకూడా ఈమెకు లేదనిపించింది. వెంటనే నా దౌర్భాగ్యం గుర్తుకువచ్చి నిట్టూర్చాను. సన్నగా, తెల్లగా మెరుపు తీగెలాగ వున్న ఆమె సామానంతటినీ చకచకా సర్దుతూ భర్తతో "ఇవ్వాళ భోజనం హోటలునుండి తీసుకురండి" అంది.

మాటలలో వినయంలేదు. అతను వెళ్ళిపోయాడు. ఆ రోజంతా ఆ యింట్లోనే ఆహ్వానంలేని అతిథిలాగా తిరిగాను. రెండవరోజు సాయంత్రం, ఆ యింటిముందు ఒక కారు వచ్చి నిలిచింది. దాంట్లోనుండి శ్రీమంతు డొకడు దిగాడు. అతనివెంట ఈమె భర్త దిగి, ఇద్దరూ ఇంట్లోకి వచ్చారు. ఇంటావిడ కాఫీతెచ్చిపెట్టి, చిలిపినవ్వు నవ్వి లోపలకు వెళ్ళింది.

"నచ్చిందా?" భర్త మాట.

ఆ ధనికుడు సమాధానం చెప్పకుండానే, పర్సులోనుంచి ఐదు పదిరూపాయల నోట్లు స్టూలుమీదుంచాడు. కారు వెళ్ళిపోయింది. రాత్రి పదిన్నరకు మళ్ళీ తిరిగివచ్చింది. అప్పుడే యింటావిడ సొగసుగా అలంకరించుకుంది. నా శరీరం పుడికిపోయింది. నా దేవత నాతో బ్రతికిన ఇల్లు ఇది. ఎటువంటి మృగాలు ఇక్కడకు చేరుకున్నాయి!! పడకగదిలోనికి వెళ్ళాను. అక్కడ నీలిదీపం తన వెలుగును చిమ్ముతూంది.

"మంచము". ఔను అదే స్థలంలో. అదే స్థలం. "లీ..." తన సర్వస్వం నాకర్పించింది. దేవత అనుగ్రహించిందనే నేను దాన్ని స్వీకరించాను. పరస్పర ఆత్మల సమర్పణ భావంతో పరిపూర్ణమైన దాంపత్యం, స్వర్గమైనచోటు అది. అదే స్థలం. మంచం మాత్రం మార్చబడింది.

ఆ మంచంమీద ధనికుడు కూర్చున్నాడు. ఆమె ఇస్తున్న తాంబూలం సేవిస్తున్నాడు. ఏమిచెయ్యాలా యని చేతులు పిసుక్కున్నాను. సాయంత్రం 50 రూపాయలు తీసుకొని, భార్యను ఈతనికి అమ్మిన ఆ వెధవ మొగుడు ఒంటరిగా వరండాలో పడుకున్నాడు.

ఆహా! ముద్దులు! ఇంతకుముందు ఎంతమంది పురుష మృగాల పాలబడిన ఈ చెంపలు, యింకా ఎంతమందికి అందించబడతాయో! ధనికునిది మోటు శరీరం. ఆమెది నునుపైన శరీరం. రెండు శరీరాల్లోనూ ఉంది రక్తమాంసాలే. ఇద్దరికీ బస్సు ఘోర ప్రమాదం సంభవిస్తే ... ఎముకలన్నీ విరిగిపోయి నల్లయితే ... లేకపోతే, ఆ ఆడదాని శరీర మాంసమంతా కుళ్ళిపోయి, చీము

టీపాయ్ మీదున్న పాలగ్లాసు ఎత్తి కొడుతూ శబ్దం చేయటం మొదలు పెట్టాను. మళ్ళీ యిద్దరూ గాభరాచెందారు. గ్లాసు ఉన్న చోటనే వుంది. శబ్దం మాత్రం వినబడుతూవుంది. ఆమె మూర్ఛపోయింది. అతను తలుపులు తీసి బయటకు పరిగెత్తాడు. అప్పట్నుంచి అది దెయ్యాల కొంప అయింది. ఎవరన్నా "గిరాకీ"లు వచ్చినప్పుడు మాత్రం నా ఆట చూపిస్తున్నాను. నాకు మాత్రం ఇది ఆట, తమాషా. అయితే పాపం ఆ దంపతులకు, ముఖ్యంగా ఆ ధైర్యంలేని మొగుడుకు ప్రాణసంకటం అయింది. ఇంటి యజమానికి చెప్పి, భూతవైద్యుణ్ణి తీసుకొనివచ్చి, తతంగాలు జరిపారు. కాని, అవి నామీద ఎటువంటి పరిణామాన్ని కలిగించలేకపోయినై. ఆ దంపతులు ఆ యింటినే విడిచి వెళ్ళిపోయారు.

కొన్ని రోజులు అదే ఖాళీయింటిలో తిరిగి, విసుగుపుట్టింది. తిరిగి మా వూరికి వచ్చాను. అప్పటికైనా, నా భార్య దుఃఖాన్ని మరచిపోయిందేమోనని భావించాను. నా భావన నిజంకాదు. ఆమె పిచ్చిది, శల్యమైపోయింది. ఓదార్చడానికి కూడ నేనిప్పుడు అశక్తుడను. నారాయణరావు చేసిన వుపాయాన్ని అనుసరించడం నా కిష్టంలేదు. కొంతకాలం యిలా నిరాశతోనే జరిగిపోయింది. ఉన్నదాంట్లోనే కొంచెం తృప్తి ఏమంటే భార్య, పిల్లల దగ్గరేవుండి తిరగటం. వాళ్ళు నన్ను తలుచుకున్నప్పుడల్లా నాకు దుఃఖం ఆగేదికాదు.

ఒకసారి మా దూరపు బంధువొకాయన మా యింటికి వచ్చారు. మా వూరికి సమీపంలోనే కొంత పొలాన్ని కొనే నిమిత్తం ఆయన వచ్చాడు. చావిట్లో చేతిసంచిని పెట్టి కూర్చుని మాట్లాడుతున్నారు. స్నానానికి పోయే ముందు బట్టలు విడవడానికి మేడ మీదకు వచ్చాడు. జేబులో వున్న యాభై నూరు రూపాయల నోట్లను చేతిగుడ్డలో చుట్టి, మేడ వరండా ఖాళీ గుంజమీద పెట్టి, స్నానానికి వెళ్ళాడు. మధ్యాహ్నం భోంచేసి, కొంచెంసేపు నిద్రపోయాడు. సాయంత్రం వెళ్ళేటప్పుడు, తన చేతిసంచిలో డబ్బుకోసం వెదికాడు. సంచి తిరగేసి చూశాడు; డబ్బులేదు. వొళ్ళు చెమట్లుపోసినై. ఎక్కడెక్కడ వెతికినా డబ్బు కనపడలేదు. చివరకు డబ్బుపోయిన సంగతి అందరికీ చెప్పాడు.

"చేతిసంచిలో పెట్టి, స్నానం చేయడానికి వెళ్ళాను. ఇప్పుడు చూస్తే లేదు."

అందరికీ గాభరా; నాకు నవ్వు. కాదు, ఎక్కడ పెట్టానా అనే జ్ఞాపకం వుండొద్దూ మనిషికి?! అందరూ వెతకడం మొదలుపెట్టారు. ఎవ్వరికీ చిక్కలేదు. చివరికి ఆయనకు, మా యింటిలోనివారిమీద అనుమానం కావచ్చు.

"ఒకటీ, రెండు కాదు. ఐదువేలు! బయటకుఎక్కడికి పోయివుంటయ్?..." ఇంకా ఏమో చెప్పబోతున్నాడు.

ఇంకా సతాయించటం వుచితంగాదని తలచాను కాని, డబ్బు ఫలానాచోట వుందని ఎలాతెల్పటం? ఆ క్షణంలో ఒక వుపాయంతోచింది. మేడ మెట్ల దగ్గర నేలమీద కర్రతోకొట్టినట్లు శబ్దం చేశాను. అందరూ ఏమిటాఅని చూడ్డానికి అక్కడకు వచ్చారు. అక్కడ్నించి ఆశబ్దం మెల్లెక్కుకుంటూ పైకివెళ్ళింది. అందరూ అనుసరించివచ్చారు. నోట్లకట్ట వున్న స్థంభాన్నికొట్టి, శబ్దం చేశాను. అప్పుడు ఆకట్ట అందరికీ కనపడింది. అందరికీ ఆశ్చర్యం అయింది. ఇది ఎటువంటిశక్తి అనేది ఎవ్వరికీ అర్థం గాలేదు. అయినా అనుమానం వచ్చి యుండవచ్చు. నేను ఆయింట్లో తిరుగు తున్నాను అనేదానికి యిప్పుడు మొట్ట మొదటిగుర్తు చూపించవలసి వచ్చింది.

ఒకరోజు ఒకపుస్తకం నాకు కన బడింది. అప్పుడు నా ఆనందానికి అంతు లేదు. "విద్యార్థుల విజ్ఞానమంజరి" అది. దాంట్లో టెలిగ్రాఫ్ తంతి గురించి పాఠము, మోర్సన్ తంతి సంకేతముల పట్టీవున్నవి. నేను చూచినప్పుడు, ఆపేజీయేతెరుచుకొనివుంది. నేనుమిక్కలి ఆసక్తితో దానిని అభ్యాసంచేసి, కొద్ది రోజులలోనే "కట్ - కడా" శబ్దంచేస్తూ నాకు నేనే మాట్లాడుకోవడం మొదలు పెట్టాను. అయితే దీన్నిఅర్థం చేసుకొనే వారు మాయింట్లో ఎవరూలేరు. నా మూగబాధ, మూగబాధగానే మిగిలి పోయింది. అయినా ఒకసారి నాఆశ నెరవేరేరోజు వచ్చింది.

ఆరోజు, నా బావమరిది "గదగ్" నుండి మాయింటికి వచ్చాడు. ఎందుకో, ఒకనెల సెలవుపెట్టాడట. చెల్లెల్ని చూసి పోవడానికి వచ్చాడు. నాభార్య తన అన్ననుచూసి, తన దౌర్భాగ్యాన్ని చెప్పుకొని, కన్నీళ్ళు పెట్టుకుంది. అక్కడ వాళ్ళిద్దరూ తప్ప ఎవ్వరూలేరు. దగ్గరలో ఒక కట్టెపుల్ల పడివుంది.

"కట్, కట్, కట్, కట్, కడా — కట్, కట్, కట్, కట్, కడా —" ఆపుల్ల సహాయంతో "శ్రీధర్" అని సంకేత ములతోనే పిలిచాను. మొదట వాళ్ళు గమ నించలేదు. అయితే మళ్ళీమళ్ళీ పిలిచే సరికి తిరిగిచూశారు. పుల్ల శబ్దంలో, తన పేరులోని సంకేత శబ్దాల్ని విని, ఆశ్చర్య పోయి చెల్లెలివంక చూశాడు. ఆమెకేమి తెలుసు? మళ్ళీ, సంకేతాలతో నేనే పిలిచాను.

"బావా! గాభరాపడవద్దు. నావల్ల ఎవరికీ ఏ అపాయంరాదు. ఇప్పుడు మీనుండి ఒక వుపకారం కావలసివుంది."

"ఏమిటది?" సంకేతాలతోనే జవాబు చెప్పాడు.

"మీ చెల్లెలికి ఈ సంకేతాల పరిచయం

చేసిపెట్టండి. వాటిని అభ్యాసం చేయమని చెప్పండి."

"ఎందుకు ?"

"ఆమె బాధాపూరితమైన హృదయం, నాతో మాట్లాడి అయినా కొంచెం శాంతిం చవచ్చు. నాయటువంటి నిర్భాగ్యునికికూడ దీనినుండి కొంచెం మనశ్శాంతి దొరుకు తుంది."

ఈ మూగ సంభాషణలను, నా భార్య ఆశ్చర్యంతో చూస్తున్నది.

"ఆమెకు విషయాన్ని విదానంగా తెలియజేయండి. ఈ విషయం ఆమెకు మాత్రమే తెలియనివ్వండి. వేరే ఎవ్వరికీ ఈ ప్రసంగం వద్దు."

బావ, ఆరోజునే చెల్లెలికి అంతా చెప్పాడు. ఆమెకు ఒక ప్రక్క దుఃఖమూ, ఇంకొక ప్రక్క నాతో మాట్లాడేయోగం దొరికిందిగదాయని సంతోషం. అత్యాసక్తితో సంకేతాక్షరాల పరిచయంలో కృతార్థురాలైంది. ఒకరోజు రాత్రి ఆమె పడుకున్న చోటునుంచి, "కట్-కడా" శబ్దం వినబడింది. అక్కడకు పరిగెత్తాను. నాకూ ఆశ్చర్యమైంది. ఆమె శబ్దం చేస్తున్నది.

"కట్ - కడా, కట్ - కట్ - కడా - కట్, కడా - కడా, కట్ - కడా."

ఆహా ! ఇన్ని రోజుల తరువాత ఇప్పుడు ఈ శబ్దం. "రాజా !" ఆ మోటు సంకేతాల్లో దాగివున్న ఈ శబ్దం, ఆ క్షణంలో, అనంతవిశ్వంలో, అతి మధురంగా కనపడింది. ఉత్సాహంతో నే జవాబు చెప్పాను.

"కట్, కడా, కట్ - కట్, కడా - కడా, కట్, కడా - కట్ కట్."

అప్పట్నుంచి మా సంభాషణ ప్రారంభమైంది. మా జీవితాలకూ, ఒక అర్థం కనపడింది. ఎన్నెన్నో మాటలు. అప్పుడప్పుడు దుఃఖం. నానుండి సముదాయింపు మాటలు. పిల్లవాని భవిష్యత్ జీవితచింతనం.

కొన్ని సంవత్సరాలే గడచియుండ వచ్చు. ఈ అవధిలో - నేను యిష్టపడితే, ఇతరులను అవహించుకొనే అవకాశం చాలసార్లు నాకు కలిసివచ్చింది. అయితే నేనా విధంగా ప్రవర్తించలేదు. కాని, కొన్నిసార్లు అకస్మాత్తుగా, కొన్ని అలౌకిక సంఘటనలకు అవకాశమిచ్చాను.

ఒకరాత్రి రెండుగంటల సమయంలో వంటగది పొయ్యిలోని నిప్పు కట్టెల దొంతరవైపు వ్యాపిస్తూ వస్తూంది. అందరూ నిద్రపోతున్నారు. "లీ..." అని సంకేతాలమూలంగా ఆమె చెవివద్ద పిలిచాను. ఆమెకు మెలకువ వచ్చింది. విషయం చెప్పాను. తలుపులు తెరుచుకొని బయటకువచ్చింది. అంతలో అందరికీ మెలకువ వచ్చింది. అప్పుడే ఎండిన కట్టెలరాశికి నిప్పు అంటుకుంటూవుంది. అందరూ కలసి దాన్ని ఆర్పివేశారు. "లీలావతి లేచిరాకపోతే, ఇల్లు కాలిపో




యేది" అని మా అమ్మ అంది. ఇంకో పారి పక్కింటి పిల్లవాడు బావిలోపడిన విషయాన్ని "లీ..." ద్వారా తెలిపాను. ఇటువంటి సంఘటనలవలన అందరూ, నా భార్యలో ఏదో విశేషమైన శక్తి వుందని భావించడం మొదలు పెట్టారు.

ఒక రోజు, ఒకదొంగ, కిటికీ చువ్వల్ని వంచి, ఇంట్లోకి చొరాడు. అందరూ నిద్రపోతున్నారు. నేను గమనించిన వెంటనే నాభార్యదగ్గరకు పరిగెత్తి, "లీ" అని పిలిచాను. ఆమెనులేపి, చెప్పాను. ఆమెలేచి, ఇంట్లోవారి నందరినీ లేపే లోపల దొంగ, బంగారునగలను దోచుకొని, పారిపోయాడు. నేను వాడివెంట పడ్డాను. స్మశానం ఆవరణలో పారిపోవ టప్పుడు చెట్టు కొమ్మను వూపాను. వాడికెదురుగా భయంకరమైన ఆకారం ఒకటి నిలిచినట్లు భ్రమింపజేసి బెదిరించాను. అతడు నగలను అక్కడే పారవేసి పారిపోయాడు. నేను నేరుగా ఇంటికి వచ్చాను.

ఇంటిదగ్గర గోలగావున్నది. నగలే గాక ఇంకా ఏవో పోయినవని వెదుకుతున్నారు. చుట్టుప్రక్కల ఇళ్ళ వాళ్ళందరూ చేరారు. కొంతమంది, నాభార్యలో విశేషశక్తివుందని నమ్మినవారు ఆమెను చుట్టుముట్టి ఏమో అడుతుగున్నారు. నేను దగ్గరకుపోయి, అక్కడేవున్న ఒక

గ్లాసునహాయంతో కట్ - కడా" సంకేతాలతో పిలిచాను. "లీ" నా పిలుపును గమనించి దగ్గరకువచ్చింది.

"చెప్పు. దొంగ, స్మశాన ఆవరణపు దారిలో నగలను పడవేసి పారిపోయాడు. ఆ రావిచెట్టుకు 4 గజాల దూరంలో దక్షిణంగా అవి పడిఉన్నై. వాళ్ళందరకూ తెలియజెప్పు."

ఆమెచెప్పింది. లైటు తీసుకువెళ్ళి, నగలు తీసుకువచ్చారు. ఈ సంఘటనతో యింట్లో వారందరికీ ఆశ్చర్యం హద్దు మీరింది. అదీగాక, యింతకుముందే "లీ" చేసిన విచిత్ర సంకేతాలను అందరూ విచారించారు. చివరకు చెప్ప వలసివచ్చింది. అయితే దాని పరిణామం మాత్రం హితమైనదికాదు. ఇంట్లోవారందరూ కలసి, నాకు విముక్తి కలిగించి, మోక్షమార్గాన్ని కలిగించాలని సంకల్పించారు. ఆరోజురాత్రి ఈ సంగతిని "లీ" ఏడుస్తూ చెప్పింది.

"ఉపకారం చేసినదానికి ఫలం ఇది. నా అదృష్టంమీద నేనే పెద్దరాయిని పడవేసుకున్నాను" అంటూ ఏడ్చింది.

"ఏడ్వవద్దు లీ వారు నా మంచికే చేస్తున్నారు. నేను ఇట్లావుంటే వారికి లాభమే అవుతుందికదా. అయినా ఎందుకు ఈఏర్పాటుచేస్తున్నారు అనే విషయాన్ని ఆలోచించుతూడు."

"నాగతి?"

"నీవే ఆలోచించు. ఆలోచించిచెప్పు. నన్ను విడిచి వుండటం నీవల్లకాదు అనే టట్లయితే వాళ్ళు చేసే ఏకర్మకుకూడ చిక్కకుండ వుండగలను."

"అలాగే చెయ్యండి. నేను చచ్చే వరకూ మిమ్మల్ని విడిచిపెట్టలేను?"

"పిచ్చిపిల్ల! అది నీకు సాధ్యమా? ఒకవేళ నేనే వెళ్ళిపోతే?"

"నేనూవస్తాను."

"ఎలావస్తావు?"

"విషంత్రాగి."

అదిరిపడ్డాను. చటుక్కున లేచి కూర్చున్నాను. చీకటి! నేను పక్కమీదే కూర్చున్నాను. వెంటనే లేచి దీపంవేశాను. తెల్లవారుఝామున నాలుగున్నర గంటలైంది. నావొళ్ళు, చేతులు ముట్టుకుని చూసుకున్నాను. చుట్టూ చూశాను. అదేయిల్లు. మంగుళూరులోని అద్దెఇల్లు. పక్కలో చూశాను ఏగొడవాలేకుండ నిశ్చింతగా పడుకొని నిద్రపోతున్నది నాభార్య. మధ్య రెండుసంవత్సరాల ముద్దులొలికే కొడుకు నిద్రలోనే ముసిముసి నవ్వులు నవ్వుకుంటున్నాడు.

దీపం ఆర్పివేసి పక్కలో కూర్చున్నాను. మళ్ళీ నిద్రరాలేదు.




సేట్ గోవిందలాల్ మిఠా[illegible] రోజూ [illegible] తీపిపదార్థాలను విందుభోజనం చేసూ శరీ[illegible] సులో అంతటా మాధుర్యాన్ని [illegible] ఓ చిన్నారి [illegible]గ [illegible] అందమైన కళ్లను రెపరెపలాడిస్తూ పైకి చూ[illegible] తనకి [illegible] పరి[illegible] ఆ గదిలో రెండుగోడలు కలిసే మూల పైభాగంలో కనపడిన ఒక [illegible] పురుగుని చూసి అక్కడే నిల[illegible] ఆ అందాల బరిణ. సేట్ గోవిందలాల్ యొక్క ఏకైక పుత్రిక సునీత ధరించే వలువలకన్న సుకు

మారంగా, అందంగా, కళాత్మకంగా ఉన్న ఆపవిత్రనాన్ని చూసి అచ్చెరువొందింది. అంత గొప్ప కళాఖండాన్ని సృష్టించిన ఆపరబ్రహ్మ ఎవరా అని ఆలోచిస్తూ నిలబడింది.

ఏదో ఒక బలీయమైన శక్తి ప్రభావం వల్ల దానివైపు ఆకర్షితురాలై పోతోంది ఆచిన్నారియాగ. మత్తుగా మందంగా ఒక్కొక్క అడుగేస్తూ దాని సమీపించింది. దగ్గరకు వస్తున్నకొలదీ దాని అందాలు మరింత స్పష్టంగా, దివ్యంగా వెలిగిపోతూ ఆమెను సమ్మోహితురాలిని చేస్తున్నయ్.

అల్లంతదూరంలో నిలబడి అంత వరకు ఆమె కదలికలను గమనిస్తూన్న ఓ మూనూగు మీసాల యాగ వడివడిగా దానివైపుకు వెళ్ళింది.

ఒక విచిత్రమైన సమ్మోహనావస్థలో పడిపోయిన ఆడయాగ పరిసరాలనుకూడా గమనించకుండా మెల్లగా అందులోకి ప్రవేశించింది. కాలికి మెత్తగా, సున్నితంగా తగిలిన దారపుపోగుల స్పర్శకు ఉలికిపడి కళ్ళు తెరిచింది. తనచుట్టూ అల్లిబిల్లిగా అల్లుకుపోయిన దారాలను అమాయకంగా, ఆశ్చర్యంగా చూసింది మరుక్షణమే ఆమెకు తన కాళ్ళక్రింది భూమి ప్రచండవేగంతో కదలిపోతున్నట్లు, చెలియలికట్టను దాటి సముద్రాలు పొంగి పొరలుతున్నట్లు అనుభూతి కలిగింది. ఆమె కళ్ళు బైర్లు కమ్మినయ్. ఆమె చెవులు హోరుమంటున్నయ్. తన అంగాలను బంధించివేసిన ఆదారపు పోగులు మృత్యుశృంఖలా లని గుర్తించటానికి ఎంతోసేపు పట్టలేదామెకు.

ఇదంతా చూసి ఆమెను రక్షించటానికి ఆత్రంగా పరుగుపెడ్తూ వచ్చింది మగయాగ. వికృతంగా నవ్వుతూ తన కబంధహస్తాలను చాచి వస్తున్న సాలెపురుగును చూస్తూనే కెవ్వున కేకవేసి సాలెగూడులోకి ఉరికింది మగయాగ. మరునిమిషంలోనే ఆరెండుయాగలూ సాలెపురుగు ఆకలికి ఆహుతి అయిపోయినయ్.

* * *

సేఠ్ గోవిందలాల్ దుకాణానికి ఎదురుగా ఉన్న ఆఫీసులోకి ఆరోజే ప్రవేశించింది సునంద. కాలేజీ చదువు ముగించుకుని ఉద్యోగంలోకి చేరటం ఆమె కదే మొదటిసారి. ఉద్యోగం, ఆఫీసు వాతావరణం, అక్కడి మనుష్యులు, మన స్తత్వాలూ అన్నీ కొత్త సునందకు.

బెరుగ్గా వచ్చి కుర్చీలో కూర్చుంది. మొదట ఎడమచేతికున్న స్క్వేర్‌వాచీలో టైము చూసుకుంది. పదిగంటల పైన పన్నెండు నిమిషాలయింది టైము.

తలెత్తి ఆగదిలో తనతోపాటు కూర్చున్నవారందరినీ ఓమారు చూసింది. ఎబ్బై దాటిన హెడ్‌గుమాస్తా, ముప్పైలోకి ప్రవేశించినట్లున్న మరిద్దరు

గుమాస్తాలు, పాతికేళ్ళ మరోగుమాస్తా, అదే వయసులో ఉన్న టైపిస్టు-అందరి కళ్లు తననే గుచ్చిగుచ్చి చూడటం గమనించి యిబ్బందిగా తల దించుకుంది సునంద.

కాసేపు నిరాదుగా కూర్చుని చేతి వేళ్ళకొనలను పరిశీలనగా చూసుకుంది. తరువాత తను కట్టుకున్న వాయిల్ చీర మీద ఉన్న ప్రింటును నిశితంగా చూసింది కొంత సేపు. తరువాత తన ఎదురుగా ఉన్న టేబుల్ మీద వేసిన దుమ్ముకొట్టుకుపోయిన ఆకుపచ్చని ఆయిల్ క్లాత్ మీది డిజైన్ వంక, బల్లమీద అటూయిటూ ఉన్న ఫైళ్ళవంక చూసిన ఆమె కళ్లు కొంచెం పైకిపోయి మళ్ళీ రెండుమూడు జతల కళ్లు తనవైపుకే చూడటం గమనించి విసుగ్గా క్రిందికి వాలినయ్. ఇబ్బందిగా కుర్చీలో అటూయిటూ కదిలింది సునంద. అప్పుడే తనువచ్చి అరగంటయింది!

అమాంతం వచ్చిపడుతున్న ఆవలింతను బలవంతాన అణచుకుంది సునంద. తనలా చేయటం ఎవరైనా చూసేరేమోనని చుట్టూ కలయజూసింది మరోమారు. ఏ ఒకరిద్దరో తప్ప అంతా ఎవరికివారు తమ పనుల్లో మునిగిపోయి ఉన్నారు. ఆ ఒకరిద్దరుకూడా తనవంక చూడటం లేదు. "అమ్మయ్య!" అనుకుంది మనసులోనే.

అలా అనుకుందో లేదో వెంటనే మరో ఆవలింత భూతంలా ఆవరించింది. అలా నాలుగైదుసార్లు ఆయేసరికి ఆమెకి కళ్ళవెంబటి నీళ్ళు వచ్చినయ్. "ఛీ! ఏం పని లేకపోతే యిలాగే తగలడుతుంది," అనుకుంది మనసులో విసుగ్గా.

తన ఎదురుగా ఉన్న ఫైళ్ళను ఓసారి బయటకు తీసింది తను చేరింది బడ్జట్ సెక్షన్ లో. తనకసలే లెక్కలంటే భయం ఎలాగో బాబూ అనుకుంది. ఒక్కొక్కటి ఆ రేడు అంకెల పరిమాణంలో ఉండి చిన్న సౌక్యాలంత పొడుగున ఉన్న ఆ సంఖ్యలను చూస్తూనే గుండెలో దడ బయల్దేరిందామెకు.

"మిగతావాళ్ళంతా ఎలా చేస్తున్నారో చకచకా! ఖర్మకాలి ఈ ఉద్యోగంలో చేరేను" అనుకుంది.

ఎలాగో ఇంటర్వెల్ టైమయింది. అందరూ గట్టిగా నవ్వుకుంటూ, మాట్లాడుకుంటూ లేచేరు. అందరి కళ్ళూ ఓసారి సునంద వంక నిశితంగా చూసినయ్. తరువాత వాళ్ళు బయటకు వెళ్ళిపోయేరు.

గదిలో తనొక్కతే ఒంటరిగా మిగిలింది. హాయిగా, స్వేచ్ఛగా ఓసారి వళ్ళు విరుచుకుంది. తరువాత లేచి నిలబడింది.

గుమ్మందగ్గర ఎవరిదో నీడ కదిలినట్లనిపించి చటుక్కున కుర్చీలో కూర్చుంది

పొందికగా. గంభీరంగా ముఖంపెట్టి అటు చూసింది.

ప్యూన్!

తేలికగా ఊపిరి పీల్చుకుంది సునంద.

"చాయ్ తెమ్మంటారా అమ్మా?" గుబురు మీసాల వెనుక అస్పష్టంగా నవ్వుతూ అడిగాడు యాదయ్య.

"తీసుకురా!" గంభీరంగా ఆజ్ఞాపించింది.

అతను వెళ్ళిపోగానే టేబుల్ మీద వాలి రెండు నిమిషాలపాటు స్వేచ్ఛగా పడుకుంది. తరువాత లేచి ముంగురులు సర్దుకుని ముఖాన్ని పౌడరు పూర్తిగా చెరగనంత సున్నితంగా జేబురుమాలుతో తుడుచుకుంది. మరో రెండు నిమిషాల్లో యాదయ్య టీకప్పుతో ప్రవేశించేడు. ఆమె టీ తాగుతున్నంత సేపూ కొద్ది దూరంలో నిలబడి ఆమెని పరిశీలనగా చూస్తున్న యాదయ్య ఆమెను గురించి ఓ అభిప్రాయాన్ని ఏర్పరుచుకోవటానికి ప్రయత్నిస్తున్నాడు.

"ఈ ఆఫీసులో ప్యూన్ నుండి సూపర్నెంటు దాకా అందరికీ క్యూరియాసిటీయే ఆడదంటే!" టీ తాగుతూ అతని వంక చూడకుండానే అతను తనని పరిశీలనగా చూస్తున్నట్టు గ్రహించగలిగిన సునంద అనుకుంది చిరాగ్గా.

టీ తాగటం అయినాక ప్లేటులో పదిహేను పైసలు వేసి అతనికిచ్చింది. యాదయ్య వెళ్ళిపోయేడు.

ఆమె ఒంటరిగా మిగిలింది. వేడి టీ తాగేసరికి కొంచెం చురుకుదనం వచ్చిందామెలో.

ఈసారి కొంచెం రిలాక్స్డుగా కూర్చుంది సునంద. అప్పటికి ఆఫీసు కొంత పాతబడినట్లనిపించింది. రెండయేసరికి అంతా మళ్ళీ ఆఫీసులోకి వచ్చేరు

వాళ్ళు విసురుకుంటున్న జోక్సు, విసుర్లు, వ్యాఖ్యానాలు, నవ్వులు అన్నీ శ్రద్ధగా వింటూ తలవంచుకుని ఫైల్లోకి చూస్తూ కూర్చుంది. కొంతసేపయిన తరువాత సూపర్నెంటు పిలిపించేడామెను ప్యూనుతో. ఆమె తన సీట్లోంచి లేచి సూపర్నెంటు దగ్గరకు వెళ్తున్నంత సేపూ అందరూ ఆమె వంకే పరిశీలనగా చూడసాగేరు. అదేం గమనించనట్లే ఠీవిగా నడచి వెళ్ళింది సునంద.

ఆమె చేయవలసిన పనేమిటో వివరించసాగాడు సూపర్నెంటు కనీసం ఆమెను కూర్చోమనైనా అనకుండా. రెండు నిమిషాలు ఆమె నిలబడి వింది కాని అలా నిల్చోవటం నామోషీ అనిపించి గభాల్న పక్కనేఉన్న కుర్చీని దగ్గరకు లాక్కుని కూర్చుంది.

ఆమె ధోరణికి అదిరిపడ్డాడు సూపర్నెంటు. కాని తన పదిహేడేళ్ళ సర్వీసులోనూ రకరకాల మనస్తత్వాలను చూడటానికి అలవాటు పడినందువల్ల ఏం జరగనట్లే మొహం పెట్టాడు. తరువాత



తన సీట్లోకి వచ్చి ఐదు గంటలవరకు ఏదో పని చేసి ఇంటికి వెళ్తుంటే ఉద్యోగం లోకి ప్రవేశించడంవల్ల తనచదువుకు సార్థకత కలిగినట్లు, తనలో ప్రత్యేక మైన వ్యక్తిత్వం కలిగినట్లు అనుభూతి కలిగిందామెకు.

అది ఉద్యోగంలో చేరిన మొదటి రోజు అనుభవం... నెలరోజులు గడచి నయ్. సునంద ఓ నెలజీతంకూడా అందుకుంది. ఈ జీవితం గులాబీల పాన్పులా ఉందనుకుంది సునంద. ఇది వరకటిలా ఉదయంలేచిన దగ్గరనుండి రాత్రి పడుకునేవరకు చదువునిగూర్చిన బెంగ, పరీక్షపేపర్లు పాడుచేయటం, ఏడవటం, ఆరోగ్యం పాడుచేసుకో వటం, తోటి విద్యార్థులతో పోటీలు పడటం, నెగ్గకపోతే అవమానం పడటం లాంటి బెడదలన్నీ తప్పినందుకు ఆమె ప్రాణానికి హాయిగా ఉంది.

ఆఫీసులో ఉన్నంతసేపు చేత నైనంత పనిచెయ్యటం, ఐదుగంట లవగానే ఇంటికి నిశ్చింతగా వెళ్ళటం, సాయంత్రాలు ఏ బాధ్యతాలేకుండా అక్క చెల్లెళ్ళతో, స్నేహితురాండ్రతో సినిమా

లకి, షికార్లకి వెళ్ళటం, తనివిదీరా నిద్రపోయి తెల్లగా తెల్లవారిన తరువాత తీరికగా లేవటం ఆమెకెంతో ఉల్లాసాన్ని కలిగిస్తున్నాయ్. రాత్రింబవళ్ళు పుస్తకాలు ముందేసుకుని కూర్చునే స్టూడెంట్సుని చూస్తూంటే ఆమె కిప్పుడెంతో జాలి కలుగుతుంది.

ఆఫీసులోకూడా అందరూ ఆమెతో మంచిగానే వ్యవహరిస్తారు. ఆమెకిప్పుడు వారిదగ్గర సంకోచం, భయం — ఏమీలేవు. అరమరికల్లేకుండా మాట్లాడుతుంది వాళ్ళతో. వాళ్ళుకూడా ఆమెమీద ఎంతో అభిమానం కనపరుస్తూ మాట్లాడేవాళ్ళు. సునంద వాళ్ళనుగూర్చి ఉద్యోగ విషయాలు, కొంతవరకు యింటి వ్యవహారాల సంగతికూడా తరచుగావాళ్ళ సంభాషణలు వింటుండటం వల్లను, వాళ్ళే స్వయంగా తనకి చెప్పటంవల్లను కూడా తెలుసుకుంది. సూపర్నెంటు పేరు నరసింహం. అతనికి ఐదుగురు పిల్లలు. తనక్రింది ఉద్యోగస్తులను పురుగుల్లా చూస్తూండేవాడు. ఏదోరకంగా ఎవరినో ఒకరిని రోజుకు నాలుగుసార్లన్నా చివాట్లు పెట్టందే నిద్రపట్టదతనికి. మిగతావాళ్ళెవరూ సూపర్నెంటుతో కలసేవాళ్ళు కాదు. ఆఫీసుకు సంబంధించిన పని ఉన్నపుడు అతని దగ్గరకువెళ్ళి నిల్చునే ఆపని చక్కబెట్టుకుని యివతలకు వచ్చేవారు.

జగన్నాధం, రంగారావు యూడీసీలు. వాళ్ళకు చెరోముగ్గురు పిల్లలు ఉన్నారు. ఎల్డీసీ మూర్తికి, టైపిస్టు బలరాంకి యింకా పెళ్ళికాలేదు. సునంద జగన్నాధం, రంగారావులతో త్వరగానే కలసిపోయింది కాని కుర్రకారైన మూర్తి, బలరాంలతో చనువుగా మాట్లాడటానికి మొదటకొంచెం సంకోచపడింది. కాని వాళ్ళే కలగజేసుకుని మాట్లాడించటం వల్లను, వాళ్ళ ప్రవర్తనలో ఏమాత్రం అసభ్యతకాని, వెకిలితనంకాని లేకపోవటంవల్లనూ ఆమె వాళ్ళతో కూడా నిర్మొహమాటంగా సంచరించ సాగింది.

లంచ్ టైముతో అందరూకలసే కాంటీన్‌కి వెళ్ళేవారు. మిగతాసమయాల్లో కూడా టీ తెప్పించుకుని అందరూ కబుర్లాడుకుంటూ త్రాగేవారు. నెలాఖరు రోజుల్లో ఒకరిదగ్గర ఒకరు రెండు, మూడు రూపాయలు చేబదుళ్ళుకూడా తీసుకునేవారు. ముఖ్యంగా పిల్లలుగలవాళ్ళవటంవల్ల జగన్నాధానికి, రంగారావుకి డబ్బు అవసరం ఎక్కువగా ఉంటుండేది. ఒకటి రెండుసార్లు సునందని అడిగి కూడా తీసుకునేవారు.

మరోనెల ఎలాటి ఒడిదుడుకులూ లేకుండా గడించింది. ఓరోజు ఆఫీసులోకి ప్రవేస్తూనే అందరూ ఏదో ఆందోళనగా ఉన్నట్లు పసిగట్టింది సునంద.

ఆమెను చూడగానే "రంగారావు గారికి నిజామాబాద్ ట్రాన్స్ఫరయిందండీ!" అన్నాడు జగన్నాధం.




"అరె! ఎప్పుడు తెలిసింది?" అన్నది ఆత్రంగా సునంద.

"ఇప్పుడే ఆర్డర్సు వచ్చినాయండీ!" విచారంగా నవ్వుతూ సమాధాన మిచ్చేడు రంగారావు. "ఏడేళ్ళనుండి యీ ఊళ్ళోనే యిదే ఆఫీసులో పనిచేస్తున్నాను. ఇప్పుడు కొత్తఊరికి పోవాలంటే బెరుకుగా ఉందండీ!" అన్నాడు.

"ఫరవాలేదులెండి. ఎందుకంత బెంగ సడిపోతారు, అత్తగారింటికి వెళ్ళబోయే ఆడపిల్లలా? ఎంత కొత్త ఊరైనా కొన్నాళ్ళుండేసరికి పాతబడిపోతుంది కదండీ!" అంది సునంద కొంచెం హాస్యంగా అతని భయాందోళనలను మర్చిపోయేట్లు చెయ్యాలనే ఉద్దేశ్యంతో.

అందరూ నవ్వేరు.

"మీరు వెళ్తే మరి మీ స్థానంలో ఎవరొస్తారో!" అంది సునంద.

"విజయవాడనుండి ఎవరో గోపాలకృష్ణ అనే ఆయన వస్తారని అనుకుంటున్నారు."

ఆ సాయంత్రం రంగారావుకు వీడ్కోలిస్తూ ఘనంగా పార్టీ చేసేరు అతని తోటి ఉద్యోగస్తులు నలుగురూను.

రంగారావు వెళ్ళిన మూడోరోజున గోపాలకృష్ణ వచ్చి ప్రవేశించేడు అతని స్థానంలో.

కృష్ణ ఆఫీసులోకి ప్రవేశిస్తూనే తనని తాను ఎంతోచనువుగా పరిచయం చేసుకున్నాడు అందరితోను.

కృష్ణ ఆఫీసులోచేరిన నెలరోజుల

తరువాత జరిగిన సంఘటన శరాఘాతంలా తగిలింది సునందకు.

ఆరోజెందుకో బస్సు త్వరగా అందటంవల్ల రోజూకన్నా ఇరవై నిమిషాలు ముందే ఆఫీసుకి వచ్చింది సునంద.

ఆఫీసు లోపలికి అడుగుపెట్టబోతూ పెద్దగా గదిగోడలను దద్దరిల్లజేస్తున్న నవ్వులమధ్య తన పేరు వినపడటంచేత ఏదో అనుమానంవచ్చి చటుక్కున గుమ్మందగ్గరనే ఆగిపోయిందామె.

''అది వస్తుందేమో! కొత్త నెస్మదిగా మాట్లాడు.'' అది జగన్నాధం కంఠం.

"అప్పుడే రాదులే. ఇంకా చాలా టైముంది పదికి.'' బలరాం అంటున్నాడు.

"ఆఁ. ఇంతకీ రంగారావు ఉత్తరంలో ఏం వ్రాసేడో పూర్తిగా చెప్పనేలేదూ!" మూర్తి అడుగుతున్నాడు.

''అక్కడ ఆఫీసు చాలా 'డల్'గా ఉందిట. లేడీసెవరూ లేరట. నిన్నమొన్నటిదాకా ఒక క్రిష్టియన్ అమ్మాయి ఉండేదటగాని వీడు వెళ్ళేముందే ఆమె కూడా ట్రాన్స్ఫరై వెళ్ళిపోయిందిట మరో ఊరు.''

''చొ చ్చొ చ్చొ! పూర్ ఫెలో! రంగారావుకి మంచి కష్టమే వచ్చింది."

"ఔను. మరి, యిక్కడ పంచదార చిలకలాంటి సునందను చూట్టం మరిగేక_''

''అన్నట్టు వీడెవడు_కొత్తగావచ్చిన వాడి పేరు _ గోపాలకృష్ణ _ వాడు చూసేవా సునందకు పోజులుకొడ్తున్నాడు అప్పుడే.''

"వాడు కొట్టటమేం, ఖర్మ! అదే వాడికి పోజులుకొడ్తోంది.''

"దావిబొంద. అది వాడికొక్కడి కేమిటి? అందరికీ కొడ్తుంది.'' అది బలరాం కంఠం.

"అంతే నీకు పోజువేస్తోందనా నీ అర్ధం!" మూర్తి.

"లేకపోతే బోడి నీ పర్సనాలిటీ చూసి మూర్ఛపోతుందనుకున్నావా?''

"సర్లే. మీరూరుకోండి. ఇప్పుడు మళ్ళీ దెబ్బలాడుకోకండి. ఎ థింగాఫ్ బ్యూటీ యీజె జోయ్ ఫరెవర్!'' జగన్నాధం సర్దిచెప్పేడు.

అందరూ గట్టిగా నవ్వేరు.

ఇంతలో ''గుడ్ మార్నింగ్ మిస్ సునందా! ఇక్కడ నిలుచున్నారేమిటి?" అన్న కంఠం విని ఉలికిపడింది సునంద.

"గుడ్ మార్నింగ్ మిస్టర్ గోపాల్!" అంటూ తడబడే అడుగులతో లోపలికి నడిచింది సునంద. కృష్ణ ఆమె ననుసరించేడు.

వాళ్ళిద్దరూ కలిసిరావడం చూసి అక్కడున్న ముగ్గురూ ఒకరి ముఖాలొకరు అర్ధవంతంగా చూసుకున్నారు.

"వీళ్ళప్పుడే మంచి ఫ్రెండ్సయినట్లున్నారే!''

''వీడు చూస్తే అసాధ్యుళ్ళా ఉన్నాడు!''




"పిట్టను చేజిక్కించుకునేటట్టే ఉన్నాడు!"

"ఈ రోజుల్లో ఆడదాన్ని లొంగ దీసుకోవటం ఎంతసేపోయ్. ధైర్యం చెయ్యాలేగాని మగవాడు."

"హుష్! సూపర్నెంటు...'

"గుడ్‌మార్నింగ్ సార్!" అందరూ నిలుచుని ఏకకంఠంతో అన్నారు.

తన సీట్లోకి వెళ్ళబోతూ వాళ్ళ ముగ్గురి సంభాషణలలో అక్కడక్కడ కొంతభాగాన్ని విన్న కృష్ణ విషయాన్ని కొంతవరకు అర్ధంచేసికోగలిగేడు.

సునంద వాళ్ళ సంభాషణని వివరంగా వినకపోయినా, అది ఏ ధోరణిలో ఉంటుందో ఊహించుకోగలిగింది.

సునంద కారోజు ఏపనీ చెయ్యబుద్ధి కాలేదు ఉన్నత శిఖరాగ్రాన నిలబడిన వ్యక్తిని అమాంతం అగాధమైన లోయల లోకి త్రోసివేసినట్లుంది ఇప్పుడామె స్థితి.

స్త్రీ ఎలాటి అవమానాన్నైనా భరించ

గలదు కాని తను ఎంతో పవిత్రంగా, కాపాడుకుంటూ వస్తున్న శీలాన్ని స్త్రీత్వాన్ని మరో పురుషుడు తేలికపరిస్తే ఏమాత్రం సహించలేదు. ఇంతవరకు తననెంతో గౌరవిస్తున్నారని, అభిమానిస్తున్నారని భావిస్తున్న తోటి ఉద్యోగస్తులు తనని కేవలం ఒక భోగవస్తువుగా మాత్రమే చూస్తున్నారని, వారి అభిప్రాయంలో స్త్రీ అనే వ్యక్తి పురుషుడి ఆనందంకోసం ఏర్పడిన ఒక విలాస వస్తువనీ, అంతకు మించిన పూజ్యభావం వారిలో లేదని చెవులారా విన్నాక ఆమె మనసు కలతపడసాగింది.

మూర్తి, బలరాం అంటే కుర్రవాళ్లు, పెళ్ళికానివారు కనుక స్త్రీని గూర్చి ఏమీ తెలియక పోవచ్చు. కాని ముగ్గురు పిల్లల తండ్రియైన ఆ జగన్నాధానికి కూడా అదేం జబ్బు? ఆఖరికి రంగారావు కూడా ఉత్తరంలో ఎంత వెకిలి భావాలను తెలిపేడు! ఏమిటి వీళ్ళంతా? ఈ రకమైన మనస్తత్వం వీళ్ళలోనేనా, లేక సమస్త పురుష జాతిలోనూ ఉంటుందా? పైకి ఎంతో డాబుగా, ఠీవిగా కనపడే యీ విద్యావంతుల మనసులో యింతటి కుళ్ళు భావాలకు ప్రవేశం ఎలాకలిగింది?

అలా ఆలోచిస్తూ మనసును ఆఫీసు పనిమీద ఏమాత్రం కేంద్రీకరించలేక పోయింది సునంద. మూర్తి, బలరాం, జగన్నాధం ఎంతో మర్యాద ఒలకబోస్తు ఆమెను ఆప్యాయంగా పలకరించేరు ఎప్పటిలానే. వాళ్ళ నటనను చూస్తుంటే వళ్ళు భగ్గున మండింది సునందకు. "మేకవన్నె పులి అంటే అర్ధం పాఠాల్లో చదువుకున్నాను. ఇప్పుడు కళ్ళారా చూస్తున్నాను" అనుకుంది కసిగా.

మధ్యాహ్నం ఏదో పనిమీద కృష్ణ పలకరిస్తే కటువుగా సమాధానమిచ్చింది — పురుషజాతిమీద అసహ్యాన్ని పెంచుకున్న సునంద.

కృష్ణ తెల్లబోయేడు. వెంటనే తల వంచుకుని అవతలకు వెళ్ళిపోయేడు.

అతనలా వెళ్ళిపోతుంటే సునంద నొచ్చుకుంది. "అనవసరంగా అతని మనసును గాయపర్చలేదుకదా?" అనుకుంది. వెంటనే "వీడుమాత్రం మగవాడుకాడూ? కాస్త తేడాతో మగవాళ్ళందరివీ ఒకే రకం బుద్ధులు" అనుకుంది. సాయంత్రం ఆఫీసయినాక యింటికి వెళ్ళటానికి బస్సుస్టాపులో నిల్చుంది సునంద. ఆమెకు పదిగజాల దూరంలో నిల్చున్న కృష్ణ ఆమెనుచూస్తూనే దగ్గరకు వచ్చేడు.

అతనిని చూసి తలవంచుకుంది సునంద.

"మీరేమీ అనుకోనంటే మిమ్మల్నొకటి అడుగుతాను చెప్తారా?" అనడిగాడు కృష్ణ.

"అడగండి" అంది సునంద.

"మీరివాళల్లా ఎందుకంత ముభావంగా ఉన్నారు? నేను పలకరించినప్పు

దుకూడా విసుక్కున్నారు. ఏమయింది మీకు?"

అతనలా అడిగేసరికి సునందకి ఉదయం తను విన్న సంభాషణ జ్ఞప్తికి వచ్చి ముఖం జేవురించింది.

"నాకు యేమీ కాలేదు. ఈరోజు ఒక అసహ్యాకరమైన నిజాన్ని తెలుసుకున్నాను. అందుకే నాకు చాలా కోపంగా, బాధగా ఉంది" అన్నది ఉద్రేకంగా సునంద.

"ఏమిటా నిజం? ... క్షమించండి ...వ్యక్తిగతమైన విషయం కాకపోతేనే చెప్పండి".

"ఇది వ్యక్తిగతమైన విషయం అని నేననుకోను. గడపదాటి బయటకు వచ్చి, చదువుకుని ఉద్యోగాలు చేస్తున్న ప్రతి భారత స్త్రీకి సంబంధించిన సమస్యే యిది. తమతోపాటు కలిసి పనిచేస్తున్న ఒక స్త్రీని స్త్రీగా తప్ప ఒక వ్యక్తిగా తోటి ఉద్యోగస్తురాలిగా చూడలేని పురుషుల సంకుచిత మనస్తత్వాన్ని యీరోజే అర్థంచేసుకున్నాను. ఈ రోజు మన ఆఫీసులోని వాళ్ళు మాట్లాడుకుంటున్న విషయాలను, ఆ ధోరణిని వింటే అభిమానవతి అయిన ఏ స్త్రీ అయినా సిగ్గుతో తల బ్రద్దలు కొట్టుకుని చావాలని కోరుకుంటుంది" అంటూ చూచాయగా తను విన్నది చెప్పింది సునంద.

కొంచెంసేపు కృష్ణ మాట్లాడలేదు. తరువాత మెల్లగా అన్నాడు. "ఔను సునందా దేవీ! ఈ విషయం ఒక వ్యక్తికీ, ఒక సంస్థకీ సంబంధించినది మాత్రమేకాదు. ప్రతి కార్యాలయంలోను, కంపెనీలలోనూ అలాటి మనస్తత్వంగల పురుషులు కనీసం నూటికి దెబ్బైమందయినా ఉంటారు. కొంతవరకు ఆయా స్త్రీలవేషధారణ, ప్రవర్తనకూడా కారణం కావచ్చు. కాని చెదురు మదురుగా ఉండే ఆ కొద్దిమంది స్త్రీల కారణంగా ఉద్యోగినులందరూ అవమానాల పాలవటం నిజంగా అన్యాయం" అన్నాడు కృష్ణ. ఇంతలో తను వెళ్ళవలసిన బస్సు రావటంవల్ల సునంద వెళ్ళిపోయింది.

అప్పటినుండి కృష్ణ, సునంద తరచు బస్సుస్టాండులో నిలబడి ఆరోజు ఆఫీసులో జరిగిన విశేషాలను చెప్పుకుంటూండే వారు.

ఒకరోజున కృష్ణ అన్నాడు. "ఈ మధ్య మీరు వాళ్ళతో మాట్లాడటం మానివేసేరుకదా. అందువల్ల వాళ్ళకు మీమీద చాలా కోపంగాఉంది. ఇప్పుడు నాముందుకూడా మీగురించి నిరసనగా మాట్లాడు కుంటున్నారు."

సునంద నవ్వి ఊరుకుంది. కాని మనసుకి మాత్రం ముల్లు గుచ్చుకున్నట్టుగా అనిపించిందామెకు.

మరోరోజు సునంద లేని సమయంలో మూర్తి "ఏమండి కృష్ణగారూ! ఏమిటి విశేషాలు?" అనడిగాడు భావగర్భితంగా నవ్వుతూ.

"ఏమున్నయ్! అన్నీ మా మూలు విషయాలే!" అని జవాబిచ్చేడు కృష్ణ.

"కథ ఎంతవరకు వచ్చిందేమిటి?" సిగరెట్ పొగను విలాసంగా పైకి వదుల్తూ అడిగేడు బలరాం.

కృష్ణ ముఖం ఎఱ్ఱబారింది. "డొంక తిరుగుడుగా మాట్లాడటం నాకు చేత కాదు. మీ ఉదేశ్య మేమిటో మీరడగవల సిందేమిటో స్పష్టంగా చెప్పండి. అప్పుడు సమాధానమిస్తాను నేను." కటువుగా అన్నాడు.

ఎదురుచూడని అతని ధోరణికి విస్తు పోయేరు వాళ్ళు ముగ్గురూ అప్పటికి అంతకంటె ముందుకుపోయే ధైర్యం లేకపోయింది వాళ్ళకు.

"ఇప్పు డేమన్నామండీ అంతకోపం తెచ్చుకుంటారు ..." జగన్నాధం ధోరణి మార్చేడు.

"... గుమ్మడికాయ దొంగెవరు అంటే బుజాలు తడుముకున్నట్లు ..." వాక్యం పూర్తి చేసేడు బలరాం.

అది ఆఫీసని, అసభ్య ప్రవర్తనకు తావుండకూడదని గుర్తుకు తెచ్చుకుని కృష్ణ తనని తాను విగ్రహించుకున్నాడు కాని నిజానికి ఆ సమయంలో వాళ్ళని నిలువునా కాల్చి చంపేయాలన్నంత కోపం వచ్చిందతనికి.

రోజులు గడచి పోతున్నయ్. క్రమంగా సునంద, కృష్ణ సన్నిహితులు కాసాగేరు. దానికి ఒకరినొకరు అర్థం చేసుకుని, యిష్టపడి ఏర్పరచుకున్న గౌరవాభిమానాలు ముఖ్యకారణ మైనప్పటికీ ఆఫీసులోని మిగతా ముగ్గురి సంకుచిత మనస్తత్వానికి నిరసన, విముఖత్వం తెలపటంలో యిద్దరూ భాగస్తులు కావటంకూడా ఒక కారణమే. జీవితాన్నిగూర్చి, ప్రపంచాన్ని గురించి, నైతిక సూత్రాలనుగురించి ఏకాభిప్రాయం గల యిద్దరు వ్యక్తులు గాఢ స్నేహితులు కావటానికి ఎంతోకాలం పట్టదు. అందునా ఆయిద్దరు స్త్రీ పురుషులు, అవివాహితులు అయినప్పుడు ఆ స్నేహం ప్రణయంగా మారి వారు జీవిత భాగస్వాములు కావాలని కోరుకోవటం అతి సహజం. కృష్ణ, సునందల మనసులు ఒకరిని విడిచి మరొకరు బ్రతకలేరన్నంతగా పెన వైచుకు పోయినయ్.

ఒక చల్లని సాయంత్రంవేళ కృష్ణ తన ప్రణయదేవతముందు ఆత్మనివేదన చేసుకోవటంకూడా జరిగింది.

ఐతే జీవితం అందరికీ పూలపాన్పు కాలేదు. అందునా సుందర కావ్యాలలో వలె వాస్తవిక జీవితంలోని యువతీ యువకుల ప్రణయం సాఫీగా, నిరంతరాయంగా జరిగిపోతుందనుకోవటంకూడా పొరపాటే!

సునంద, కృష్ణలు మానసికంగా, ఆధ్యాత్మికంగా పెనవైచుకు పోతున్న కొలదీ ఈర్ష్యాళువులైన తోటి ఉద్యోగస్తులు కళ్ళల్లో నిప్పులు పోసుకో




సాగేరు. వ్యక్తిగతంగా తనకేమాత్రం సంబంధంలేని ఒక స్త్రీ మరో పురుషుడితో చనువుగా తిరుగుతుంటే చూసి అసూయతో క్రుగ్గిపోయే విచిత్ర మనస్తత్వం ఒక్క భారతీయ పురుషులకేఉంది. సునంద కృష్ణతో అంత సన్నిహితంగా ఉండటం చూసి తమ సొత్తునేదో అతను అపహరించుకు పోతున్నట్లు బాధపడ సాగేరు ఆముగ్గురూను. ఏదో రకంగా వాళ్ళను వేరుచెయ్యటమే తమ కర్తవ్యమని భావించేరు.

ఒకరోజున కృష్ణని మళ్ళీ కదిలించేరు "ఏం గురూ ! ఎంతవరకు నడిచిందేమిటి కథ ?" అనడిగాడు జగన్నాథం.

"ఇంకా మెల్లగా అడుగుతావేంటి ? పాకం ముదిరినట్లే ఉంది." వెకిలిగా నవ్వేడు బలరాం.

"మరీ ముదిరితే ప్రమాదం బ్రదర్ ! గట్టిగా వంటికి పట్టుకుని వేళ్ళాతుంది." జోక్ వేసాడు మూర్తి.

అందరూ ఆజోక్‌కి గట్టిగా నవ్వేరు– ఒక్క కృష్ణతప్ప.

"ఇంతకీ మీరు అడగదల్చుకున్నది సునంద విషయమేనా ?" తీక్షణంగా అడిగేడు కృష్ణ.

"చల్లకొచ్చి ముంతదాయటం మాకు సరిపడదు."

"సరే. ఐతే నేనుచెప్తాను వినండి. సునందా, నేను కొద్దిరోజులలోనే వివాహం చేసుకోబోతున్నాం. ఇక తీరిందా మీసందేహం."

అతనలా గంటాడని ముందేతెలుసు వాళ్ళకు. అందువల్ల ఆశ్చర్యపోలేదు. ఐనా పైకి ముగ్గురూ షాక్ తిన్నట్లు ముఖంపెట్టి "ఏమిటి ! మీరు సునందను–

పెళ్ళి చేసుకోబోతున్నారా ?" విస్మయంగా అన్నారు ఏక కంఠంతో.

"ఏం ? ఎందుకంత ఆశ్చర్య పోతున్నారు : మేమిద్దరం కులాంతరులం కదా, మా పెళ్ళి ఎలా సాధ్యమౌతుందని అనుమాన పడుతున్నారా - నాకూ, సునందకీ యిద్దరికీ అలాటి పట్టింపులేవీ లేవు. భారతీయులు యింకా అజ్ఞానంలో, మూర్ఖత్వంలో పడి క్రుళ్ళిపోతున్నా రనటానికి ఒకగొప్ప నిదర్శనం... యీ కులమత భావాలతో కూడిన సమాజ వ్యవస్థ. పరస్పరానురాగంతో పెనవేసుకు పోయిన రెండు సున్నిత హృదయాలను విడదీయగలశక్తి మానవ కల్పితమైన వర్గభేదాలకు ఏమాత్రంలేదు.

మా పెద్దవాళ్ళతోచెప్పి వాళ్ళను మా పెళ్ళికి ఒప్పించటమో, లేక వాళ్ళు ఒప్పు కోని పక్షంలో వాళ్ళనుండి విడిపోయి మాఅంతట మేమే వివాహం చేసుకో వటమో చేస్తాం. ఏమైనా కొద్దిరోజులలో మావివాహం జరిగి తీరటం తథ్యం" నిశ్చయంగా, దృఢంగా అన్నాడు కృష్ణ.

ఒక్కక్షణం నిశ్శబ్దం. వెంటనే ఒక పొడిదగ్గుదగ్గి చిన్నగా గొంతు సవరించు కుంటూ అన్నాడు జగన్నాధం. "అహం. అదికాదు కృష్ణగారూ! మాఉద్దేశ్యం అది కాదు. కులమతాలంటే మాకుమాత్రం పట్టింపులూ పాడూ ఉన్నాయి? ఏదో పెద్దవాళ్ళ మనసు కష్టపెట్టటం యిష్టం లేక కులమింటి పిల్లనే చేసుకుందా మను కుంటాంకాని నిజానికి మాకుమాత్రం తెలియదా కులంకన్నా ఎక్కువ గుణం ప్రధానమనీ..."

"ఔను. సునంద గుణాన్నిచూసే నేనామెను ప్రేమించేను." కృష్ణ అన్నాడు.

"అద్దో... అక్కడే కాస్త ముందూ వెనకా ఆలోచించాలంటున్నాను."

"అంటే మీ ఉద్దేశ్యం?" కనుబొమ లెత్తి సూటిగా జగన్నాధం కళ్ళలోకి చూసేడు కృష్ణ.

"వేరే విడమర్చి చెప్పాలా అండీ గోపాలకృష్ణగారూ! ఐనా యీ రోజుల్లో చదువుకున్న ఆడదాన్ని...అందునా పెద్ద వాళ్ళతో ప్రమేయంలేకుండా పెళ్ళి చేసు కుంటే ఎన్నో విషయాలు ఆలోచించ వలసి ఉంటుంది. మీరు రాకముందు సునంద మాతో ఎలా ప్రవర్తించిందో మాకు తెలుసు." బలరాం అన్నాడు.

"ఏమిటి మీరనేది? సునంద ... మీతో...నా! ఎలా ప్రవర్తించిందేమిటి?" పిడికిళ్ళు బిగించేడు కృష్ణ.

"ముందు మాకు టోపీ వెయ్యాలని చూసింది. మాతో లాభంలేదనుకునేసరికి మీ వెంటపడింది." మూర్తి క్రాపును సుతా రంగా పైకి తోసుకుంటూ అన్నాడు.

"టోపీ వెయ్యటమా? అంటే మీ ఉద్దేశ్యం?" పళ్లు కొరుకుతూ రెండడు గులు ముందుకు వేసేడు కృష్ణ.

"ఈరోజుల్లో చదువుకున్న ఆడ



దానికి మొగుడెట్లా దొరుకుతాడండీ! వేలకువేలు కట్నాలయిపోయ్యిందే వరుళ్లు దొరుకుతారా? అందువల్ల చాలామంది అమ్మాయిలు ఒక కొత్తమార్గం కని పెట్టేరు. కనపడ్డ మగవాణ్ణల్లా 'కార్నర్' చెయ్యటం, చివరకు ఎవడో మీలాంటి అమాయకుడు ఆదర్శంపేరిట ఆత్మను చంపుకుని వీళ్ళ వలలో పడటం సర్వసాధారణమైపోయింది. లేకపోతే దాని మొహం ఆ సునంద నెవడు చేసుకుంటాడండీ! దున్నపోతులా పాతికేళ్లపై బడ్డదాన్ని..." జగన్నాధం వివరించేడు.

"పాపం మీరుచూస్తే యేమీ అనుభవంలేనివాళ్ళలా ఉన్నారు. బాగానే మోసంచేసింది మిమ్మల్ని." సానుభూతి వలకబోసేడు మూర్తి.

"ఇప్పటికైనా కళ్లుతెరిచి మీదారిన మీరు పొండి. చేతులు కాలేక ఆకులు పట్టుకుని ఏం ప్రయోజనంలేదు" బలరాం సలహా ఇచ్చేడు.

"ఇంక ఆపండి!" గర్జించేడు కృష్ణ...ఆఫీసు గోడలు ఊడిపడేలా. "ఇంక సునందని గురించి మరోమాట అన్నారో మీ రక్తం కళ్ళజూస్తా. జాగ్రత్త! ఆమెకు నేను తాళిగట్టక పోయినా, లోకందృష్టిలో ఇంకా మేము భార్యాభర్తలం కాకపోయినా సునంద నా అర్ధాంగి. ఆమెనుగురించి అసభ్యంగా ఎలాంటి మాట అనటానికీ మీకు హక్కు లేదు తెలిసిందా? ఛీ! మీరూ మనుషులేనా? మీతో కలసి పనిచేస్తున్న ఒక స్త్రీనిగురించి ఇంత నీచంగా ఆలోచించ

టానికి, అన్ని కథలల్లడానికి మీకు మన సెలా ఒప్పింది? మీరు చదివిన చదువుకు సార్థకత యిదేనా? మీ సంస్కారం యొక్క అవధులు యివేనా - మీతో యేమాత్రం సంబంధంలేని స్త్రీనిగూర్చి అన్ని అపవాదులు సృష్టిస్తే మీకు లభించే ఆనందం యేమిటి? రెండు ప్రణయపూరిత హృదయాలను విడదీయటంద్వారా మీరు పొందే సంతృప్తి ఎలాటిది? సునందనుగురించి, అంగాంగ వర్ణనలుచేస్తూ మీరంతా ఎంత అసభ్యంగా మాట్లాడుకున్నదీ నేను చెవులారా విన్నాను. ఆమెముందు ఎంతో మర్యాదగా ప్రవర్తిస్తూ ఆమె అటు వీపుతిప్పగానే ఆమెవంక వెకిలిగా, లాలసగా, చులకనగా మీరు చూడటం కళ్ళారా చూసేను నేను. ఐనా మీ మీదగల అసహ్యాన్ని, ద్వేషాన్ని దిగమ్రింగుకుని ఊరుకున్నాను- గత్యంతరంలేక. ఆమెను పూర్తిగా అర్థం చేసుకుని, ఆమె ఎలాటి విషవలయంలో చిక్కుకున్నదో గ్రహించి, అన్నివిధాలా ఆలోచించే ఆమెను వివాహమాడటానికి నిశ్చయించుకున్నాను నా యీ నిశ్చయాన్ని మీరు కాదుగదా మిమ్మల్ని పుట్టించిన ఆ బ్రహ్మదేవుడు కూడా సడలించలేడు

ఇదే ఆఖరి వార్నింగ్‌గా చెప్తున్నాను. మరోసారి ఎప్పుడైనా సునందని గురించి నా ముందు అసభ్యంగా మాట్లాడేరో మీరు నాలోని పశుబలాన్ని రుచి చూడవలసివస్తుంది జాగ్రత్త!" అని ఒక్కక్షణంకూడా అక్కడ నిలబడక చకచకా నడిచి వెళ్ళిపోయేడు కృష్ణ.

కళ్ళతో చూడకపోయినా తనమాటలని విన్నేసిన తరువాత వాళ్ళ ముగ్గురి ముఖాలు వెల్లవేసిన గోడల్లా ఎలా మారిపోయిందీ ఊహించుకోగలిగేడు కృష్ణ. కాని అంతవరకు తమ సంభాషణని పక్కగదిలో ఉండి సునంద వింటూన్నదని అతనికి తెలియదు.

అతను బస్సుస్టాపుకి వెళ్ళేసరికి సునంద అక్కడలేదు. ఆలస్యం అవటం వల్ల తనకోసం ఉండకుండా ఆమె యింటికి వెళ్ళిపోయిందనుకున్నాడు కృష్ణ. మర్నాడు ఉదయమే ఆమెతో సంప్రదించి ఆమె తల్లిదండ్రులకు తమ వివాహాన్నిగూర్చి చెప్పాలనుకున్నాడు.

మర్నాడు ఉదయం రోజు కన్న త్వరగా ఆఫీసుకువెళ్ళేడు కృష్ణ ఆరోజు అతని మనసు ఎంతో కలవరంగా, ఉత్సాహంగా, ఉద్వేగ పూరితంగా ఉంది. ఇన్నాళ్ళూ తనకి సునందమీదగల ప్రేమ చాలావరకు మానసికమైనది. కాని త్వరలోనే ఆమె తన జీవిత భాగస్వామి కాబోతోందనీ, తన మనశ్శరీరాలని పునీతం చేస్తుందనీ అనుకుంటుంటే అతనికెంతో 'థ్రిల్లింగ్' గా ఉందా ఆలోచన.

ఆఫీసు గడియారం పదికొట్టేవరకు నిమిష నిమిషానికీ టైము చూసుకుంటూ,



గుమ్మంవైపు దృష్టి నిల్పి చూసేడు కృష్ణ. పది అయినా సునంద రాకపోయేసరికి అతనికి గాభరా వేసింది.

పది దాటిన తరువాత ఒక్క నిముషం లేటు వచ్చినా సూపరెంటు ఊరుకోడు. అందువల్ల ఏ కారణంచేతనైనా లేటయినా అతనిచేత మాటలు పడటం యిష్టంలేక కాజువల్ లీవ్ పెట్టేస్తారు ఎవరైనాను. అందునా అసలే అభిమానవతియైన సునంద ఎన్నడూ ఒక్క నిమిషంకూడా లేటుగా రాదు. ఐతే కృష్ణకి ఆశ్చర్యం కలిగించిన విషయమేమిటంటే ఈరోజు సునంద ఆఫీసుకు రాకపోగా లీవ్ పెడ్తున్నట్లు ఉత్తరంకూడా వ్రాసి పంపలేదు. రేపు ఆఫీసుకు వస్తే సూపరెంటు ఆమె బాధ్యతారహిత ప్రవర్తనను ఎత్తిచూపి చీవాట్లు పెట్టేది ఊహించుకుని మరింత కంగారు పడసాగేడు కృష్ణ

ఎలాగో ఆఫీసు పని అయిందనిపించి సాయంత్రం యింటికి చేరుకున్నాడు కృష్ణ. నీరసంగా గదితాళం తీసి లోపలికి ప్రవేశించిన అతను కాలికి తగిలిన కవరును చూసి, ఆత్రంగా చింపి, ఉత్తరం చదివేడు.

"కృష్ణా!

నిన్ను యిలా పిలవటం యిదే మొదటిసారి. ఆఖరిసారికూడాను. మన స్నేహం చనువుగా మారకముందే, మన ప్రేమ ప్రణయ శృంగార లీలలోకి

రూపాంతరం చెందకముందే మన ఈ బంధం తెగిపోతుందని నేనూహించుకో లేదు. కాని విధి బలీయం కృష్ణా!

సాయంత్రం ఆఫీసులో మీకూ, జగన్నాథం వాళ్ళకూ మధ్య జరిగిన సంభాషణసంతా విన్నాను. ఇంటికి వచ్చాక మూడుగంటలసేపు తీవ్రంగా ఆలోచించి నేనీ నిర్ణయానికి వచ్చాను. మన వివాహం అసంభవం కృష్ణా! ఒకవేళ మన మిద్దరం తెగించి పెళ్ళిచేసుకున్నా ప్రశాంతియుతంగా జీవించగలమన్న నమ్మక మైతే నాకులేదు. తెలిసో, తెలియకో ఒక విషవలయంలోకి చిక్కుకున్నాను నేను. దీనినుండి బయటపడటం నాసాధ్యంకాదు. నేను దీనికి బలి అయి పోవలసిందే! తప్పదు.

నువ్వు నన్ను ఎంతగా ప్రేమిస్తున్నదీ నాకుతెలుసు. నేను లేనిదే నువ్వు బ్రతకలేని స్థితిలో ఉన్నావనికూడా నాకు తెలుసు. ఆమాత్రం ఆనందం, గర్వం నాకుచాలు యీ జీవితానికి. నువ్వు యీ సమయంలో వాళ్ళమాటలను లెక్క చెయ్యకుండా నామీద ప్రేమాతిశయం కొద్దీ నన్ను పెళ్ళాడతావు. కాని వీళ్ళు మాత్రం మనల్ని యింతటితో వదలి పెడ్తారనుకోవటం పొరపాటు కృష్ణా! మనం బ్రతికి ఉన్నంతకాలం మనమీద దుష్ప్రచారాలుచేస్తూ మనని ఏదోరకంగా హింసిస్తూనే ఉంటారు. మన మనసులు వెయ్యి ముక్కలై మనసంసారం భగ్గున మండేదాకా వీళ్ళు మనల్ని బాధపెడ్తూనే ఉంటారు. అట్టిస్థితిని ఎదుర్కోనకుండా ముందుగానే సర్వమూ సమాప్తం చెయ్యటమే మంచిమార్గమని తోస్తోంది నాకు. వీళ్ళకు మనం చేసిన అన్యాయ మేమిటో, వీళ్ళు ఎందుకింతగా మనమీద కక్షకట్టేరో నాకైతే అర్థం కావటంలేదు. ఐనా నాపిచ్చికాని ద్వేషంకి ఆయా మనుష్యులను వారి స్వభావాన్ని బట్టి ఆశ్రయిస్తుంది కాని దానికి కారణాలతో నిమిత్తం లేదన్నసంగతి నాకుమాత్రం తెలియదా! ఒక ప్రఖ్యాతరచయిత అన్నట్లు యీలోకంలో ఎన్నో ఘన విజయాలనన్నా సాధించవచ్చు ఒక వ్యక్తిని సంహరించి, దేశాన్నే జయించ వచ్చు. కాని అకారణ ద్వేషాన్నిమాత్రం జయించలేము. ఇది ముమ్మాటికీ నిజం!

ఆధునిక సమాజవ్యవస్థ ఒక సాలెగూడు లాంటిది కృష్ణా! దూరం నుండిచూస్తే ఎంతో అందంగా, ఆద్భుతంగా కనిపిస్తుంది. కాని దానిలోపలికి ప్రవేశిస్తేకాని ఎంతో సున్నితంగా, సుందరంగా కనపడే ఆ దారపుపోగులు విషపుతోరణాలన్న సత్యం అర్థంకాదు. చెక్కు చెదరని సూట్లవెనుక ఎంత వికలితవం ఉన్నదో, ఘుమఘుమ లాడే సెంట్లమాటున ఎన్ని కుళ్ళుభావాలు కదలాడుతున్నాయో తెలిసికోగల అవసరం, అవకాశం ప్రతిమనిషి జీవితం లోనూ ఎప్పుడో ఒకప్పుడు సంభవించక మానదు.




ముఖ్యంగా మన భారతీయుల స్థితి అధ్వాన్నంగా ఉంది. అటు సనాతన భారత సంస్కృతిలోని ఉదాత్తతను, యిటు ఆధునిక పాశ్చాత్య సంస్కృతిలోని విశాల దృక్పథాన్నీ రెంటినీకూడా జీర్ణించుకోలేకపోతోంది నేటి యువతరం. ముఖ్యంగా ప్రగతి పథంలో పయనిస్తున్న ఆధునిక స్త్రీ అనేక విమర్శలకు, అవమానాలకు గురికావలసిన దుస్థితి యేర్పడింది. స్త్రీని శక్తి స్వరూపిణిగా భావించే యీ పవిత్ర భారత దేశంలో స్త్రీని గూర్చి ఉన్నన్ని 'స్కాండల్సు', స్త్రీ పడుతున్న అగచాట్లు మరే యితరదేశంలోనూ సంభవించటంలేదు. దీనికి స్త్రీనిగురించి, జీవితాన్ని గురించి యువకులలో ఏర్పడిపోయిన తప్పు అభిప్రాయాలే ముఖ్య కారణం. ఈ జుగుప్సాకరమైన స్థి అంతమవ్వాలంటే భారత యువతీయువకులం రిలోనూ ఒక నైతిక విప్లవం బయ రాలి. స్త్రీకి గౌరవం లేకపోవటం దే పతనానికి మొదటమెట్టు అన్న సంగ అందరూ గుర్తించాలి. మన సమాజ అంతవరకు ఎదగటానికి యింకా ఎన్ని శతాబ్దాలు పడుతుందో!

కృష్ణా! ఇదంతా చదివి నువ్వు యేమనుకుంటున్నావో నాకు తెలుసు ఇన్ని విషయాలు తెలుసుకుని, ఇన్ని కబుర్లు చెప్పగలిగిన నేను ఒక సాధారణమైన 'బేబి' వలె ఆత్మహత్య ఎలా చేసికోగలిగేనా అన్న సందేహం నీక వస్తోందికదూ?

ఇన్ని విషయాలు తెలుసుకనుకనే పరిస్థితులను పూర్తిగా అర్ధంచేసుక

న్నాను కనుకనే నేను ఆత్మహత్యకి సిద్ధమయ్యేను. నువ్వు నన్ను ఎంతగా ప్రేమించినప్పటికీ నువ్వు సాధారణ మానవుడివన్న సత్యాన్ని నేను ఎలా మర్చిపోగలను? సగటు మానవత్వపు విలువలే మంటగలసిపోతున్న యీరోజుల్లో మనిషిని దేవుడిగా ఊహించుకోగల విశాల హృదయం, ఆశాదృష్టి ఏర్పరచుకోవటం నాకు చేతకాదు. తొలిప్రేమ తాలూకు వేడిలో నువ్వు నన్ను పెళ్ళాడినప్పటికీ ఆతరువాతకూడా వీళ్ళ విమర్శలను, సలహాలను లెక్కచేయవనీ, కనీసం బాధపడకుండానైనా ఉండగలవనీ నేననుకోను. చితికిపోయే సున్నిత హృదయాలు, నలిగిపోయే కోమల భావాలు దాంపత్య జీవితాన్ని ఎన్నటికీ సుఖవంతం చేయలేవు. పరీక్షలకు, త్యాగాలకు తట్టుకుని మొద్దుబారిపోయిన ప్రేమమీద నాకు మోజులేదు. అప్పుడే విచ్చుకున్న మల్లెపువ్వులాటి మధుర సౌరభాలతో గూడిన ప్రేమ కావాలి నాకు—దాని ఉనికి కాలం ఎంత పరిమితమైనదైనా సరే... అందుకే నేనీ లోకంనుండి నిష్క్రమించ దల్చుకున్నాను.

ద్వేషానికి, దౌర్జన్యానికి, అక్రమాలకు, అన్యాయాలకు తావులేని మరో లోకంలో మన ప్రేమ సాఫల్యంకోసం నిరీక్షిస్తూంటాను.

జన్మజన్మలకీ నీ దాసనైన,
సునంద.''

ఉత్తరం చదవటం అవగానే కృష్ణ కుప్పకూలిపోయేడు. "అయ్యో! సునందా! ఎంతపని చేసేవు సునందా! నన్ను అర్థంచేసుకున్నది యింతేనా? నా ప్రేమను గురించి నీకు తెలిసిందిదేనా? నువ్వు పోనితరువాత నాయీ దేహంలోని అర్థభాగం ఎలా యీ లోకంలో ఉండగల దనుకున్నావు? నేనిప్పుడు సగం మనిషిని సునందా, సగం మనిషిని. ఆ సంగతి నీకెలా తెలిపేది?" అంటూ రోదించసాగేడు.

జీవితాన్నిగూర్చి ఎన్నో అభిప్రాయాలేర్పరచుకుని, భవిష్యత్తును గురించి ఎన్నో బంగారుకలలు కంటున్న ఆ యువకుడికి తగిలిన గాయంతాలూకు బాధనుండి విముక్తుడవటానికి ఒక్కటే మార్గం కనిపించింది. వెంటనే లేచి, మందులషాపుకు వెళ్ళి నిద్రమాత్రల సీసా కొనుక్కొచ్చేడు. రాత్రయాక వాటన్నిటినీ మింగి నిశ్చింతగా మంచంమీద వాలేడు. కొన్ని గంటలలోనే అతని ఆత్మ భౌతిక దేహాన్ని వదలి తన ప్రేయసిని చేరుకుంది.

# ప్రియబాంధవి

## ప్రబోధకుమార్ సన్యాల్

చలికాలం. సూర్యాస్తమయసమయం. అన్నివైపులా మంచుతోపాటు పొగ కూడా కలియడంతో, కలకత్తా నగరాన్ని అప్పుడే బాగా చీకటి అలము కుంటున్నది. నగరంలో కొన్నిచోట్ల దీపాలు వెలిగాయి. దూరంగా ఏవో ఇంజన్ల మోతలు వినిపిస్తున్నాయి.

నగరంలోని ఒక పెద్ద ఇంటికి ముందుభాగాన వున్న ఓ చిన్నగది. ఆ గదికి ఒకే గుమ్మం. ఒకే కిటికీ. కిటికీ తలుపులు తెరిచివున్నాయి. వాటికి ఎదురుగా తలపెట్టి జహర్ పడుకుని వున్నాడు. చీకటి గదిని క్రమంగా ఆక్రమణ చేస్తున్నది. ఎక్కడా గాలి కదులాడిన సూచనలేదు. దోమలు బాగా చెలరేగాయి.

జహర్ కళ్ళు తెరవకుండానే పక్కమీద అటూయిటూ మసిలాడు. దోమలు నిద్ర పోనిచ్చేలా లేవు. విసుక్కుంటూ లేచి కూర్చున్నాడు. చలికి కాళ్ళూ, చేతులూ కొంకర్లు పోతున్నాయి. ఈసారి గచ్చుగోడకు చేరగిలబడి కళ్ళు మూసుకున్నాడు. కునుకు పట్టింది. కాసేపటితరువాత కళ్ళు తెరుస్తూనే, తానీవేళంతా ఉపవాసం వున్న సంగతి అతడు గుర్తు తెచ్చుకున్నాడు.

మాసికలేసి కుట్టించుకున్న చొక్కా జేబుల్లో వెతికి జహర్ పగంకాల్చి ఆర్పేసి దాచుకున్న సిగరెట్ బైటికి తీశాడు. మరోసారి జేబులు వెతికి అగ్గిపెట్టె బైటికి లాగాడు. దాన్ని కదిలించిచూస్తే ఒకే అగ్గిపుల్ల వున్నది. ఆ ఒక్క పుల్లనూ ఖర్చుచేసి సిగరెట్ కాల్చే ధైర్యం అతడికి కలగలేదు. అతడు లేచి నిలబడ్డాడు. అంతవరకూ గదిలో వీరవిహారం చేస్తున్న ఎలుక తూములోంచి బయిటికి పరిగెత్తింది.

గది కొంచెం విశాలంగా వున్నట్టయితే జహర్ కాస్త అటూయిటూ పచార్లు చేసేందుకు వీలుగా వుండేది. కాని అదిబాగా ఇరుకుగది. అందుకనే అతడు రోజులో చాలా భాగాన్ని రోడ్లవెంట తిరుగుతూ గడిపేయటం అలవాటు చేసుకున్నాడు.

గదిలో ఎక్కడో ఒక చిన్న మైనపు వత్తి వుండాలి, అన్న సంగతి జహార్‌కు గుర్తుకొచ్చింది. దానికోసం చీకట్లో అక్కడా యిక్కడా తడివి చూశాడు. కాని కనిపించలేదు. దానికోసం అగ్గిపుల్ల గీయటం వృధా. అది కనిపించకముందే అగ్గి పుల్ల ఆరిపోవచ్చు. రెండందాలా చెడటం అవుతుంది. అతడి కాలికి ఏదో తగిలి చిన్న చప్పుడుతో కిందపడింది. ఏమిటా ఆ వస్తువు అనుకుంటూ జహార్ కూడ్చుని చేత్తో తడిమి చూశాడు. అతడి చేతికి రెండురోజుల క్రితం కొనితెచ్చుకున్న మర మరాల పొట్లం తగిలింది.

ఆహాఁ, అనుకున్నాడు జహార్. ఈ రాత్రికి వీటిని తిని, యిన్ని నీళ్లు తాగి హాయిగా పడుకోవచ్చుననుకున్నాడు. ఆ పొట్లం మరమరాలూ జేబులో పోసుకుని అతడు గదినుంచి బయటికి వచ్చాడు. వీధిలో వున్న దీప స్తంభం తాలూకు దీపం రెపరెప కొట్టుకుంటూ వున్నది. దూరంగా మహోత్సవాల కాంతితో ధగధగ మెరిసి పోతున్న కలకత్తా నగరం. జహార్ మనసులో ఏదో వెగటు పుట్టుకొచ్చింది. ఆహారం లేక ఎండిపోయి, నకనకలాడుతూ చుట్టముట్టుకు పడుకుని, అప్పుడప్పుడూ తలెత్తి చూసే కొండచిలువలా అతడికి కలకత్తా నగరం కనిపించింది. జేబు లోంచి యిన్ని మరమరాలు తీసి నోట్లో పోసుకుని, నవులుతూ అతడు కదలా మెదలక వుండిపోయాడు.

"ఇదేవిఁటి జహార్‌బాబూ, యిక్కడ నించున్నారు? మీకోసమే చూస్తున్నాను. నేనింట్లో వున్నప్పుడు మీరుండరు. ఉద్యోగం సద్యోగం లాటి దేమన్నా దొరి కేలా వుందా?" అంటూ ఇంటి యజమాని జహార్ ముందుకువచ్చి నిలబడ్డాడు.

జహార్ నవ్వుతూ, "అందుకోసం యింకా ప్రయత్నం ఏం ప్రారంభించలేదు," అన్నాడు.

"ప్రయత్నమే చేయలేదా? ఏవిఁటీ మీ ఉద్దేశం. కాస్త ఆగండి. మీతో మాట్లా డాలి. ఇప్పుడే వస్తాను," అంటూ ఇంటి యజమాని లోపలికి వెళ్లాడు.

అతడు వస్తాడేమో అని జహార్ కాసేపుచూసి, గదికి తాళం వేసి గబగబా వీధిలోకి వచ్చేశాడు. ఇంటి యజమాని చేతిలో పడకుండా తాను తప్పించుకోవాలి. కొంతకాలంగా యింటి అద్దె యివ్వకపోవటంవల్ల, జహార్ ఇంటి యజమానికి కనపడకుండా యిలాగే తప్పించుకు తిరుగుతున్నాడు.

మరమరాలు బాగాలేవు. మెత్తబడి పళ్లకింద తోళ్ళలా సాగటమేగాక, వట్టి కంపు కొడుతున్నాయి. ఇంకా తింటే డోకు వచ్చేలా వుంది. జేబులోంచి వాటినితీసి రోడ్డుమీద పారబోశాడు, జహార్. నిజంగా రుచికల వస్తువు తినేందుకు పనికి




రాకుండా పోయినప్పుడు కలిగే బాధ వుండే- ఒక నరక బాధ! కాని, ఉపవాసాలతో ఎలా గడపటం? ఎన్నాళ్లని గడపటం?

జహార్ ముందుకు నడవసాగాడు. ఒక కిళ్లీకొట్టు ముందునుంచి వెళుతూంటే అతడికి తన ముఖం అద్దంలో కనిపించింది. ముఖాన్ని చేత్తో సవరించుకుని చూసుకున్నాడు. గడ్డం బాగా పెరిగిపోయింది. ముఖంమీద సన్నని ముడతలు పడుతున్నాయి. చెంపలు బాగా పీక్కుపోయాయి.

హఠాత్తుగా వెనకనుంచి అతడి భుజంమీద ఓ చేయిపడింది. జహార్ వెనక్కి తిరిగిచూసి నవ్వాడు.

"ఎక్కడికి వెళుతున్నావ్?" అని ప్రశ్నించాడా వ్యక్తి.

"మీ దగ్గిరికే. ఇవాళ ఆటలేదా ఏం?" అన్నాడు జహార్.

ఆ వ్యక్తి అటూయిటూ బిత్తర చూపులుచూసి, "ఉష్, మెల్లిగా మాట్లాడు. పోలీసులు తిరుగుతున్నారు. ఆట మొదలెట్టి చాలా సేపయింది. ఐనా నీకింకా..."

"ఆ విషా యింకా వదల్లేదు. నా బుద్ధి ఎందుకనో పాడుపనులమీదకే పోతూ వుంటుంది... పద," అంటూ కదిలాడు జహార్.

ఇద్దరూ చీకటి సందుగొందులన్నీ తిరిగి ఒక చిన్న గుడిసెముందుకు వచ్చారు. దానిముందు ఒక ముసలి బిచ్చగత్తె కూర్చుని వున్నది. దానికి నెల కో రూపాయి యిచ్చేట్టు ఆ గుడిసెలో చీట్లపేక ఆడేవాళ్లు ఒప్పందం కుదుర్చుకున్నారు. గుడిసె లోపల చిన్న కిరసనాయిల్ బుడ్డిముందు కొందరు కూర్చుని చీట్లపేక ఆడు

తున్నారు. బీడీ, గంజాయిల పొగతో, కిరసనాయిల్ దీపపుపొగతో గుడిసె అంతా గవులుకంపు కొడుతున్నది.

జహర్ లోపలికి రాగానే, "ఏం జహర్‌బాబూ! డబ్బాడుబ్బా తెచ్చావా?" అని అడిగాడు రోషిద్‌మైత్రా.

జహర్ కూర్చుంటూ, "దౌర్భాగ్యం తెచ్చానుకాని, డబ్బు తేలేదోయ్," అన్నాడు నవ్వుతూ.

"అలాగా, సర్దుకుకూర్చో," అన్నాడు కానాతుమిస్త్రీ.

"జేబులో డబ్బులేదు; బతికిపోయాను," అన్నాడు జహర్.

"ఫర్వాలేదు, చేబదులు పుచ్చుకునిఆడు" అన్నాడు కానాతు.

ఆట ప్రారంభమైంది. ఓ పావుగంట గడిచేసరికల్లా జహర్‌కు కడుపులో ఆకలి మంట సాగింది. ఆటడు రెండుసార్లు ఓడిపోయి మూడోసారి రెండణాలు గెలుచుకున్నాడు. ఆ వెంటనే ఆతడు ఆక్కడ్నుంచిలేచి బయలుదేరాడు.

రాత్రి అంతగా గడిచినట్టులేదు. జహర్ సందుగొందులు దాటుతూ పెద్ద బజారు కేసి నడకసాగించాడు. జేబులోవున్న పలకల రెండణాలబిళ్ళ అతడికి క్షణ క్షణానికీ గుర్తుకొచ్చి, మనసును ఆనందంతో ముంచెత్తుతున్నది. రెండు రోజులపాటు ఫర్వాలేదు, సుఖంగా గడిచిపోతుంది అనుకున్నాదతను.

గోపాల్ సర్కార్ హోటల్ గుర్తుకొచ్చి జహర్‌కు నోరూరటం మొదలుపెట్టింది. అక్కడ ఏవేవితినాలో ఆలోచిస్తూ అతడు చకచకా నడుస్తున్నాడు. రోడ్డుమీద నడుస్తూన్న జనం, పోతూన్న టాంగాలూ అతడికి తనచుట్టూ నృత్యం చేస్తున్నట్టుగా తోచింది.

తీరా హోటల్ దగ్గిరకి వెళ్ళింతరవాత జహర్‌కు ఒకసమస్య వచ్చిపడింది. అన్నం తినటమా? రొట్టె తినటమా. అన్నం కూరా రుచిగావుంటాయిగాని, అవి త్వరలోనే జీర్ణమైపోతాయి. వెంటనే మళ్ళీ ఆకలవుతుంది. ఇలా ఆలోచించి, అతడు మరికాస్త ముందుకుపోయి. ఒక చౌకపాటు హోటల్లో జొరబడ్డాడు.

ఆహోటల్లో జహర్ అతి జాగ్రత్తగా లెక్కచూసి అణాకానీ బిల్లు అయేలా పదార్థాలుతిని, చేయికడుక్కుని మేనేజర్‌వున్న టేబిల్ దగ్గిరకువచ్చి, దానిమీద జేబులోని బేడబిళ్ళ పెట్టాడు.

మేనేజర్ దాన్ని అటూయిటూ తిప్పిచూసి, "ఈబేడ చెల్లదండీ." అన్నాడు.

జహర్ ఉలిక్కిపడ్డాడు. ఆ బేడబిళ్ళను తీసుకుని తిరగాబోర్లావేసి చూసి, "ఇది చెల్లదా? ఇదొక్కటే జేబులో వేసుకొచ్చానే!" అన్నాడు.

"ఎంతయిందీ మీబిల్లు?" అని అడిగాడు మేనేజర్.

"అణాకానీ." అన్నాడు జహర్.

"ఇక్కడ ఎవరికీ అప్పుపెట్టం. అయినా జ్ఞాపకంవుంచుకుని రేపు ఇవ్వండి," అన్నాడు మేనేజరు.

జహర్ హోటల్లోంచి బయిటకి వచ్చాడు. బేడబిళ్ళను ఆప్యాయంగా అటూ యిటూ తిప్పిచూసి, అది తనుతాను అమ్ముకోకుండా తనకడుపు నింపినందుకు చాలా సంతోషపడ్డాడు.

అరగంట తరవాత జహర్ తను అద్దెకుంటున్న ఇంటిముందుకు రాగానే, ఇంటి వసారాలోనుంచి పెద్దగా మాటలు వినిపించినై. వసారాలో లాంతరు వెలిగించుకుని యిద్దరు కూర్చుని వున్నారు. ఇంటియజమానీ, మరొకతనూ.

"ఒట్టి అబద్ధాలకోరు, పైగా జూదరి!" అంటున్నాడు ఇంటి యజమాని.

"అసలు నువ్వలాంటివాణ్ణి అగదిలో ఎలా వుండనిచ్చావ్, యజ్ఞేశ్వర్! నాలుగు నెల్ల అద్దె బాకీయా? ఈ కలకత్తాలో... ఎంత ఖర్చు నీకు," అంటున్నాడు యజమాని స్నేహితుడు.

జహర్ పిట్టగోడమీదనుంచి తొంగిచూస్తూ, అలా నిలబడిపోయాడు.

"ఇవాళ ఏదోఒకటి తేల్చిపారెయ్, యజ్ఞేశ్వర్. చెంబూ తప్పేలాకూడా లేనివాడి దగ్గిర్నుంచి అద్దె ఎలా వసూలవుతుందోయ్! పిల్లామేకతో సంసారం..."

జహర్ యింక వాళ్ళమాటలు వినదలచలేదు. ప్రస్తుతానికి తాను గదికి పోక పోవటమే క్షేమం. అతడు వెనక్కుతిరిగి రోడ్డుమీదికి వచ్చేశాడు. కాని, ఆరాత్రి ఎక్కడ గడవాలో అతడికి పాలుపోలేదు. లోగడ ఒకసారి పార్కులో బెంచీమీద పడుకుంటే పోలీసులు పట్టుకున్నారు. ప్రవర్తన మంచిదికాదని కేసుకూడా పెట్టారు.

ఉత్తరపు వైపున ఎక్కడో ఒకపెద్ద దేవాలయం కడుతున్నట్టు జహర్‌కు గుర్తు వచ్చింది. అక్కడ పడుకుని యీరాత్రి గడిపేయవచ్చని అతడు సందుగొందులవెంట అటుకేసి బయిలుదేరాడు. కొంతదూరం పోయాక వెనకనుంచి గస్తీ పోలీసుల బూట్ల చప్పుడు వినిపించింది. జహర్ చప్పున ఓగుడిసెతాలూకు తడిదాకి దాని చాటున దాక్కున్నాడు. గస్తీ పోలీసులు ముందుకు వెళ్ళిపోగానే అతడు తిరిగి రోడ్డుమీదికి వచ్చాడు.

చలికాలపు రాత్రికావటంతో పన్నెండు గంటలయినా కాకముందే బజార్లలో జనసంచారం తగ్గిపోయింది. రోడ్డువారగా దిక్కులు చూసుకుంటూ నడుస్తున్న జహర్ దృష్టిని ఒకఇంటిముందు నిలబడివున్న స్త్రీమూర్తి ఆకర్షించింది. గాలికి

రెపరెపలాడే ఆమె చీరమీద వీధిలైటు వెలుగు పడినప్పుడల్లా, చీర తళతళ్ళా-మంటున్నది

జహర్ ఆమెకేసి ఓక్షణంచూసి ముందుకు పోతూన్నంతలో, వెనకనుంచి ఆ స్త్రీ, "ఇంతకుముందే యిటుగాపోయావు, తిరిగివచ్చావేం?" అని ప్రశ్నించింది.

జహర్ ఆగి, "ఎవరూ? వీధిలో నుంచున్నావెందుకు? దారితప్పాను, అందుకే మళ్ళీ యిటుకేసి పోతున్నాను," అన్నాడు.

"అలాగా, ఒక్కమాట, నువు వెళ్ళేదెక్కడికి?" అని అడిగింది స్త్రీ.

"దేవాలయానికి"

"ఓహో, అయితే నువ్వు జూదరివన్నమాట!" అంటూ ఆమె అతణ్ణి సమీపించి, "దయవుంచి నాకో ఉపకారం చేసిపెడతావ్?" అని అడిగింది.

జహర్ చిన్నగా నవ్వి, "చిన్నప్పుడు ఆడవాళ్ళకు ఉపకారం చేస్తుండేవాణ్ణి. కాని, ఇప్పుడు చేయాలనిపించటంలేదు. పోన్లే, నువ్వు చెప్పేదేదో వినే వెళతా, చెప్పు," అన్నాడు.

"అలాగే చెపుతా. కాస్త ముందుకుపద, అది యిప్పుడే వచ్చిపడుతుందేమో," అంటూ ఆమె ఇంటి గుమ్మంకేసి ఓమారు చూసింది.

ఆవిడ అలా కంగారుపడటం చూసి జహర్ ఆశ్చర్యపోతూ, "అదెవరు?" అని అడిగాడు.

"మా అత్తారింట్లో దాసీది. దాని ఉద్దేశం మంచిదిగా కనబడటంలేదు."

"అసలు సంగతేమిటి?"

"అదంతా చాలా కథ వుందిలే. ఆ రామాయణమంతా చెప్పేందుకు టైంలేదు. ముందు యిక్కణ్ణించి పోవాలి. గబగబా నడువు. నువ్వు రాకపోయినా నేను వెళ్ళి పోవల్సిందే. తప్పదు," అన్నదామె.

"నువ్వు ఎక్కడికి వెళ్ళేదావివేవిఁటి?" అని అడిగాడు జహర్.

"ఎక్కడికో ... సరేకాని, నీకు రాయ్‌బాగాన్‌కి దారి తెలుసా?"

"తెలుసు. ఎందుకో చెప్పు?"

"ఆడవాళ్ళ బోర్డింగ్ హౌస్ ఒకటక్కడుంది. గుర్తుందా?"

"లోగడ అన్నీ గుర్తుండేవి కాని, యిప్పుడు ... గడ్డం పెరిగాక అన్నీ ఒక్కొక్కటే మర్చిపోయాను."

"వేళాకోళాలకు పోకు. ఆపదలోవున్న ఆడాళ్ళతో వేళాకోళాలాడే వాళ్ళెవరో తెలుసా? పశువులకన్న అధములు," అన్నదామె కాస్త కఠినంగా.




జహర్ మాట్లాడకుండా వూరుకున్నాడు. కొంతదూరం నడిచి యిద్దరూ ఒక సందులో ప్రవేశించారు. జహర్ ఆమెకేసి తలతిప్పి, "...ఇటువంటి పనులు నావల్ల కావు. ఆడవాళ్ళకు ఉపకారం చేయబోవటం అనే పనినుంచి ఎప్పుడూ తప్పించుకు తిరగటం మంచిది. లోకంలో ఎందరో వుండగా నువ్వు నన్నే ఎన్నుకుని ఎందుకు వెంటపడి వస్తున్నావో నా కర్థం కావటంలేదు. నేనసలు చాలా కాలంగా మంచివాణ్ణి కాను," అన్నాడు.

"నాకు తెలుసాసంగతి," అన్నదామె.

"తెలుసా? ఏంతెలుసు?"

"నువ్వు వేడి వేడి పెనంమీదినుంచి నిప్పులో జారిపడ్డావు."

"పెనంమీదినుంచి జారిపడ్డమాట నిజమే కాని, ఆ పడింది నిప్పుల్లోకాదు, బూడిదలో," అన్నాడు జహర్.

అంత దుఃఖంలో వున్న ఆమెకు జహర్ మాటలు నవ్వు తెప్పించినై. ఆమె కాసేపాగి, "నేనెందుకు ఇల్లొదిలి పారిపోయి వచ్చానో చెపుతాను, వింటావా?" అన్నది.

"ఉహూఁ, వినను, నేనేం ప్రణయగాథల మాసపత్రికను కాను," అన్నాడు జహర్.

ఆమె ఏదో చెప్పబోయింది. దూరంగా గస్తీ పోలీసుల బూట్లచప్పుడు వినిపించింది. జహర్ చిన్న గొంతుతో, "పెద్దగా మాట్టాడకు, గస్తీ పోలీసులు తిరుగుతున్నారు," అన్నాడు.

"సరే, ఎక్కడయినా ఓ ధర్మశాలవుంటే, చూపించు. ఈరాత్రికి అక్కడే పడివుంటాను," అన్నదామె.

"ఇంత రాత్రివేళ నీకోసం ధర్మశాల ఎక్కడ వెతకను? కలకత్తాలో ధర్మమూ, శాలా - ఈ రెండూ చాలా తక్కువ," అన్నాడు జహర్.

ఆమె యీసారి జాలిగా, "నీతో యింత సేపట్నుంచీ పరిచయంవున్నా, నన్ను నమ్మలేకపోతున్నావుగదా? నా కోసం ఈపాటికి బహుశా వాళ్లు వెతకటం మొదలు పెట్టివుంటారు," అన్నది.

"ఎందుకు వెదకరు? ఆడవాళ్లు తప్పిపోతే వెదకకూడదా?" అన్నాడు జహర్.

"ఆఁ వెతకొచ్చు. ఆ దాసీదాని కొంపకి రావటమే పొరపాటయింది, నాది."

"మరెందుకెళ్ళావ్ అక్కడికి?"

"ఇందులో రహస్యం ఏముంది? చెబుతున్నాగా - భర్తేమో అత్యాచారీ, తాగుబోతూ ..."

జహర్ ఆమె మాటకు అడ్డొచ్చి, "ఇందుకే యీ దేశంలో ఆడాళ్ళకి చదువులు చెప్పించవద్దది. ఆడవాళ్ళకు అభిరుచులూ, ఆత్మగౌరవం పుట్టుకొచ్చాయంటే, ప్రతియింట హాహాకారాలు బయలుదేరక తప్పదు. సరే, ఇల్లువదిలి వచ్చినదానివి యిప్పుడేం చేస్తావ్?" అన్నాడు.

"స్వతంత్ర జీవనం."

"అది చాలా పాతమాట."

"చాల్లే వూరుకో నేను మా దాసీదానితో వచ్చిందెందుకో తెలుసా? దర్జీ పాడాలోని దారపుమిల్లులో ఏదైనా పని కుదిర్చిపెడతానని చెప్పింది. ఆపని చేసుకుంటూ కొన్నాళ్ళపాటు దానింటో వుందామనుకున్నాను. కాని, అట్టే చూడగా దాని ఉద్దేశం ఇంకోవిధంగా వున్నట్టు కనిపించింది. ఐతే, నీవుండేదెక్కడ?" అన్నదామె.

"ఏమనుకుంటున్నావో మరి, నేను కలుపు మొక్కనుకాని, కలువపువ్వునుకాను ఇల్లయితే వుంది. కాని నేనక్కడ వుండటంలేదు. అక్కడికి వెళ్ళటం ప్రస్తుతం నిషిద్ధం," అన్నాడు జహర్.

"ఎందుకని?" అన్నదామె ఆశ్చర్యంగా.

"ఇంటి యజమానికి అద్దె బాకీ చెల్లించలేకపోయాను."



"ఐతే ఎలా మరి?"

ఇద్దరూ మౌనంగా నడుస్తూ జహర్ వుండే ఇంటిదాకా వచ్చేశారు. జహర్ ఆమెను వీధిలోని దీపస్తంభం నీడలో నుంచోమని చెప్పి, గదిగుమ్మం ముందుకు వచ్చాడు. ఇంటివాళ్ళు హాయిగా నిద్రపోతున్నారు. జహర్ ఆమెకు సైగచేసి నిశ్శబ్దంగా గదితలుపు తెరిచాడు. ఇద్దరూ చీకటి గదిలోకి వెళ్ళారు. "ఇప్పటిదాకా చెప్పటం మరిచిపోయాను. నా పేరు సుఖలత," అన్నదామె.

"ఆడవాళ్ళకు లేనిపేర్లేమున్నాయిలే" అంటూ జహర్ కొవ్వత్తికోసం చీకట్లో కాసేపు వెతికి, అది దొరకగానే వున్న ఒక్క అగ్గిపుల్లా జాగ్రత్తగా గీసి దాన్ని వెలిగించాడు.

సుఖలత ఆ వెలుగులో గది నాలుగుమూలలూ కలయచూసింది. గదిలో ఏమూల చూసినా సాలిగూళ్ళే. గోడవారగా ఒకచోట కొన్ని పత్రికలు పడివున్నాయి. వాటి పక్కనే పక్కపరిచివుంది. దాన్ని చూస్తే ఎవరో శ్మశానంలో వదిలిపెట్టి పోయిన దాన్ని, మళ్ళీ భద్రంగా తెచ్చి దాచుకున్నారా అనిపిస్తుంది.

సుఖలత భయం భయంగా ఆ పక్కకేసి చూస్తూ, "ఈ గదిలో వుండేవాళ్ళెంతటి పాపాలనయినా తేలిగ్గా చేసేయగలరు," అన్నది.

"ఇది గదికాదు, ఏదో రవంత ఆశ్రయం," అన్నాడు జహర్.

"ఐతే యిన్నాళ్ళనుంచీ నువ్వుంటున్నది యిక్కడేనన్నమాట."

"ఉండటమేముంది, వచ్చి దాక్కుంటూ టాను, ఇవాళ నువు దాక్కోటానికి వచ్చినట్టు."

"భయంవేసి దాక్కోటానికి యిక్కడికి రాలేదు రాత్రి అని వచ్చాను," అన్నది సుఖలత.

జహర్ కాసేపు మెదలకుండా వూరుకుని రేపు పొద్దున్నే లేవడ తోనే వెళ్ళిపోతావుగ ." అని అడిగాడు

"ఆఁ, బాగా చీకటివుండగానే . ఇంటివాళ్ళకూడా లేవకముందే."

జహర్ నవ్వుతూ, "అవును, ఇల్లు వదిలిపెట్టి పోవటానికి అదే మంచి సమయం," అన్నాడు.

సుఖలత నోటికి పమిటచెంగు అడ్డంపెట్టుకుని నవ్వింది. "నిజమే. అత్తవారి యిల్లుకూడా అలాంటి చీకటి సమయంలోనే వదిలిపెట్టి వచ్చాను," అంటూ ఆమె చటుక్కున తెలివితెచ్చుకుని. "నాకు కాస్తకూడా సిగ్గనేదిలేదు. రెండుగంటల్లోనే. రెండునెల్ల పరిచయం వున్నట్టు నీతో మాట్లాడుతున్నాము," అన్నది.

జహర్ మెల్లిగా పక్కదులిపాడు. ఎలుకలు తిరిగే దారి వదిలి గోడకుదగ్గిరగా సుఖలత పడుకునేందుకు ఏర్పాటయింది. ఒక మనిషికయినా సరిగా చలి ఆపలేని ఆపక్కగుడ్డల్ని యిద్దరూ చెరిసగం తీసుకున్నారు. కొవ్వొత్తి యింకాస్సేపు మాత్రం వెలుగుతుంది. జహర్ తలుపు గడియవేసి వచ్చి. "రేపు వెళ్ళేప్పుడు నా దుప్పటి అలాగే కప్పుకుని వెళ్ళిపోకేం!" అన్నాడు.

తుచ్ఛమైన యీ మాటకు ఆమె ఆరికాలిమంట నెత్తికెక్కి, "నేనంత నీచురాల్ని అనుకుంటున్నావా?" అన్నది.

"అహాఁహాఁ, అదేంకాదు. ఏదో పొరపాటున అలాగే వెళ్ళిపోయావంటే మళ్ళీ అది నాకు దక్కదు," అన్నాడు జహర్.

సుఖలత కాసేపు మెదలకుండా వూరుకుని, "నాకు గత్యంతరం లేకపోవటం చేత నువు చేసిన యీ అవమానాన్ని సహించాల్సివచ్చింది. ఒకవేళ నేను దుప్పటితో తలుపు తీసుకుని పారిపోతేమాత్రం నువు అడ్డగించగలవా?" అన్నది.

"ఏం, ఎందు కడ్డగించను, అడ్డగిస్తాను. కాని, నిన్ను తాకాల్సివస్తుంది కనక అడ్డగించను."

"అంటే దాని అర్థం?"

"చేసుకున్న భర్తను తాగుబోతని వదిలేసిన ఆడదాన్ని నేను తాకను "

"తాగుబోతని వదిలెయ్యని ఆడదాన్నయితే, తాకుతావన్నమాట!" అంటూ సుఖలత నవ్వి, "అయితే నువ్వు నా భర్తకన్నా హీనుడివిలా కనబడుతున్నావ్ నువ్వింకా పెళ్ళి చేసుకోలేదల్లే వుంది!" అన్నది

"చేసుకున్నట్టయితే బావుండేది. పరాయి ఆడదానిముందు...పెళ్ళి చేసుకోనందుకు సంజాయిషీ యివ్వాల్సిన అవసరం అయినా తప్పేది." అన్నాడు జహర్.

"...తాగుబోతని వదిలెయ్యలేదు, నేను దుశ్చరిత్రుడని వదిలేశాను." తనకు తాను సమాధానం చెప్పుకున్నట్టు సుఖలత గొణిగింది

అంతలో గుమ్మందగ్గర ఇంటియజమాని గొంతు వినబడింది ఇద్దరూ గుట్టు చప్పుడుకాకుండా వూరుకున్నారు ఒకటిరెండు క్షణాలల్లో అతడు అక్కడినుంచి కదిలి వెళ్ళిపోయిన సూచనరాగానే, సుఖలత మెల్లిగా, మనం యిలావుండగా ఆయన యిక్కడికి వచ్చివుంటే ఏం సమాధానం చెప్పేవాడివి?" అని అడిగింది.

"సమాధానం చెప్పవలసిన అవసరమే వుండేదికాదు." అన్నాడు జహర్.

"ఒకవేళ ఆయన నన్నవమానం చేస్తే?"

"అవమానంచేస్తే! బాగానేవుంది. నేను నీ తరపున అతగాడితో పోట్లాడతాననుకున్నావేమిటి?" అన్నాడు జహర్

కొంచెంసేపయ్యాక జహర్. "ఏ ఆడవాళ్ళతోనన్నా రాత్రిపూట ఒకే గదిలో పడుకోవాల్సివస్తే, ఒళ్ళంతా కంపరమెత్తినట్టుంటుంది నాకు." అన్నాడు.

సుఖలత జవాబేమి చెప్పలేదు. నిద్ర తూగుతున్నందువల్ల ఆమె కనురెప్పలు బరువెక్కాయి.

## 2

తలుపుమీద దబదబా కొట్టేచప్పుడుకు జహర్, సుఖలతలకు హఠాత్తుగా మెలకువ వచ్చింది. ఈలోపుగా ఎప్పుడో తెల్లారిపోయింది. ఇద్దరూ ఒకరిమొహం లొకరు ఆశ్చర్యంతో కొయ్యబారిపోయి చూసుకున్నారు. బయటినుంచి ఇంటి యజమాని పెద్దగొంతుతో అరుస్తున్నాడు.

జహర్, సుఖలతకు మాట్లాడకుండా వూరుకో అన్నట్టు సైగచేశాడు. బయట తలుపు మరీగట్టిగా కొడుతూ, "చెవుడా ఏం? వినిపించటంలేదూ?" అని కేక పెట్టాడు ఇంటి యజమాని. అతని పక్కన మరికొంద రున్నట్టుంది. గొడవగా మాట్లాడుతున్నారు.

భయంతో సుఖలత మొహం పాలిపోయింది "వాళ్ళడిగితే ఏమని చెపుతావ్ ? తల వాల్చుకునేట్టు చేస్తావా," అన్నది మెల్లిగా గొంతు బిగబట్టుకుని.

జహర్ నీరసంగా జాలిపుట్టించే గొంతుతో, "ఎవరండీ తలుపు కొట్టేది ?" అని అడిగాడు.

"తలుపు తెరువు ముందు—ఊం తొరగా."

జహర్ సుఖలతతో, "ఆ కిటికీ తెరిచినా కనపడకుండా వుండేట్టు ఆ మూలకు పోయి దాక్కో." అన్నాడు. సుఖలత గదిమూలకుపోయి దాక్కున్నది.

జహర్ గొంతు పెద్దదిచేసి, "జ్వరం వచ్చిపడింది. లేవలేకండా వున్నాను. వారెవరో కాస్త కిటికీదగ్గరకు రండి " అన్నాడు.

నలుగురైదుగురు మనుషులు కిటికీదగ్గిరకు వచ్చి నిలబడ్డారు. ఇంటి యజమాని పక్కనున్నవాళ్ళల్లో ఒకడు రౌద్రంగా, "జ్వరంరానీ ఏమైనారానీ ! సంపాదన లేనప్పుడు గది ఎందుకు అద్దెకు తీసుకున్నావ్ ?" అన్నాడు.

జహర్ ఆ మాటకు సమాధానం చెప్పకుండా కుడిచేయి ముందుకు చాస్తూ, "మీలో ఎవరైనా చేయి చూస్తారా ?" అని ఆయాసపడటం మొదలెట్టాడు.

అతడిచేయి ఎవరూ ముట్టుకోలేదు. "జ్వరం తగ్గనీ తగ్గకపోనీ—రెండు గంటలు టైం యిస్తున్నాను. అప్పటికీ వెళ్ళకపోయావంటే, మెడపట్టుకుని—" అంటూ ఇంటి యజమానీ, అతడి వెంటవున్నవాళ్ళూ వెళ్ళిపోయారు.

సుఖలత యింకా ఆ మూల అలాగే నక్కి. నవ్వాపుకునేందుకు పైటచెంగు నోటిలో కుక్కుకుంటున్నది.

"ఊరుకో, వాళ్ళకి వినబడుతుంది," అన్నాడు జహర్.

ఏం మాట్లాడకండా ఒకరిమొహా లొకరు చూసుకుంటూ యిద్దరూ చాలాసేపు కూచున్నారు. రాత్రిపూట చూసిన సుఖలతనే పగటివెల్తురులో చూస్తూంటే జహర్‌కి ఆనందం కలిగింది. చదువుకున్న ఆడవాళ్ళనుగురించి అతడి కంత సదుద్దేశంలేదు. అర్థంలేని విలాసాలూ, అనవసరమైన పైపై మెరుగులూ చేస్తూంటారని అతడి మనసులో గాఢంగా వుంది. ప్రతి విషయంలోనూ ఆ మొహాల్లో నటనే బైటపడు తూంటుంది. మామూలుమాటలే అయినప్పటికీ, తమ చాతుర్యమంతా వొలక పోస్తూ, వాళ్ళు అతితెలివిగా మాట్లాడబోతారు ... ఈమె చూపులుమాత్రం సహజ మైనచూపులే. అందులో ఏమాత్రం కటాక్షవీక్షణాలు లేవు. ఈమె మాటల్లోకాని, చేతల్లోగాని, సైగలూ, సూచనలూ ఇటువంటివేవీ కనిపించలేదు. విర్దిష్టత,




విర్లిప్తత బైటపడుతూవుంది. పైగా ఈమెది ఆరోగ్యవంతమైన శరీరం. నిసర్గత సుందర సౌందర్యం.

కావలసినంత చురుకుదనం ఈమెలో వుంది. కళ్ళను మిరుమిట్లుగొలిపే ఈ సౌందర్యం ఆకర్షిస్తుందిగాని, వ్యామోహపరచదు ఆడవాళ్ళలో సహజంగా వుండవలసిన సరళత్వం, సుకుమారత్వం ఈమెలో మేళవించుకుపోయింది. ఆ హృదయంలో కపటత్వమనేది ఏమాత్రం లేదు. తనతో చాలా కొద్దిగంటల పరిచయమే అయినప్పటికీ, పిలవకపోయినా తన వెంటవచ్చి, ఈ రాత్రంతా ఏవిధంగా గడపగలిగిందో, ఇప్పటికి జహర్ అర్థంచేసుకుని ఆనందించగలిగాడు.

“మూగవాడిలా అలా చూస్తూ కూచుంటావేం? అభిమానమనేది లేదూ?” అన్నది సుఖలత.

జహర్ ఊహల్లోంచి తేరుకుని ఆమెకేసి చూసి, “నిన్ను ప్రశంసించాలా వద్దా, అని ఆలోచిస్తున్నా.” అన్నాడు.

సుఖలత రుసరుసలాడుతూ, “ఔను, ప్రశంసించేందుకు యిదేసమయం! చాలా బావుంది...ఒక్క వాల్మీకిమహర్షికే వున్నదీ, ఇతరుల కెవ్వరికీలేనిదీ ఏమిటో తెలుసా?'' అన్నది.

“ఏమిటి?'' అన్నాడు జహర్.

"ఎప్పుడేం మాట్లాడాలో, ఏం చేయాలో ఆయనకే తెలుసు. దాన్నే సందర్భశుద్ధి అంటారు ''

జహర్ నవ్వి, ''ఆడవాళ్లు ఒక్క విషయంలోమాత్రం అధికులు. ఎప్పు డెలా నవ్వాలో, ఏడవాలో వాళ్ళకే తెలుసు. దాన్నే సమయస్ఫూర్తి అంటారు," అన్నాడు

సుఖలత మెల్లిగా నవ్వింది. జహర్ లేచి తలుపుదగ్గిరకువెళ్ళి బయట ఎవరైనా వున్నారేమో అని కాసేపు జాగ్రత్తగా చెవిఒగ్గి విని, సుఖలతతో. "ఆ దుప్పటి కప్పుకుని నిశ్శబ్దంగా బయటికిపోయి, ఆ వీధి మలుపున నించో. నేను వస్తాను," అన్నాడు

సుఖలత దుప్పటి కప్పుకుని తలుపు తెరుచుకుని గబగబా వెళ్ళిపోయింది. ఓ క్షణం తరవాత జహర్ గదినుంచి బయిటికివచ్చి, పిల్లిలా నడుచుకుంటూ వీధి లోకి వెళ్ళాడు. సందుచివర సుఖలత నిలుచునివుంది. అతను దగ్గిరకురాగానే, "నించోమన్నావు దేనికి ? నువ్వెటువేపు వెళతావేం ?" అని అడిగింది.

"ఎటువేపని చెప్పను ? ఇంటి యజమాని ఎటుగానివేపు ఏదైనాసరే ... మరి నువ్వెక్కడికి వెళతావ్ ?'' అని అడిగాడు జహర్.

"ఇటు దక్షిణవేపుగా వెళతాను. మా అత్తారిల్లూ, పుట్టిల్లూ యిటు ఉత్తరపు వేపుగా వున్నాయి. నేను వెళ్ళేది భవానీపూర్‌లో మా అమ్మ పినతల్లికూతురి అత్త గారింటికి," అన్నది సుఖలత.

"సరే...ఒక్కరాత్రి ఏర్పడ్డ పరిచయంలోని యీ మనిషినిమాత్రం గుర్తుంచుకో. బహుశా, యిక మనం కలుసుకోవటం పడదేమో। పోనీగాని, నీ విషయ లో నేనేదైనా ఒకవేళ అన్యాయంగా ప్రవర్తించివుంటే ..'' అంటూ అతను ముందుకు నడిచాడు.

సుఖలత స్నిగ్ధంగా నవ్వి. "నువ్వేదో నాటకంలోని పాత్రలాగా వెళ్ళిపోతు న్నావ్. కాని, యిప్పు డెక్కడికి వెళ్తావ్, ఏం చేస్తావ్ ?'' అని అడిగింది.

"ఏదన్నా ఒక పత్రిక తాలూకు ఆఫీసు మేడమెట్లవద్ద నిలుచుని, ఆ పత్రిక ప్రకటనల పేజీ చూస్తుంటాను " అన్నాడు జహర్.

అతడు రెండడుగులు ముందుకు వెయ్యటంతోనే సుఖలత నవ్వుతూ, "నువ్విలా సెలవుతీసుకుని నాటకంలోని వేషంలా తలవంచుకుని వెళ్ళిపోవటం ఏమీ బావో లేదు. ఏదో ... హా ! హతవిధీ ! భగవాన్ ! అనుకుంటూనైనా వెళ్ళు," అని వెనక్కి తిరిగి నడవసాగింది.

జహార్ గబగబా ఆమెను సమీపించి, "భవానీపూర్ అంటే ఏదో నాలుగు కొంపలున్న జాగాకాదు ఆ వీధిపేరేమిటో, ఆ ఇంటి నెంబరెంతో తెలుసుకుని మరీ వెళ్ళాలి," అన్నాడు.

"ఆ అడ్రస్ నాకు జ్ఞాపకముంది," అన్నది సుఖలత.

జహార్ విర్లిప్తుడిలా వెనక్కు తిరిగి వెళ్ళబోదా మనుకుంటుండగా, సుఖలత ఎడమచేయి చాచి, "ఈ చేతిగాజులు కాస్త అమ్మిపెడతావ్?" అని అడిగింది

ఊహూం. నావల్లకాదు. చేతిలో ఏమీ లేనప్పుడే హాయి. ఈ గాజులు నాదగ్గిరుండగా పట్టుకున్నారంటే, తప్పించుకునే వీలుండదు," అన్నాడు జహార్.

"ఎవరు పట్టుకుంటారు?"

"చినిగిపోయిన బట్టలతోవున్న నాదగ్గిర బంగారుగాజు లుండటం మంచిదికాదు ఇవి నావని ఎవరూనమ్మరు. చేతులకు పోలీసులు సంకెళ్ళు తొడుగుతారు," అన్నాడు జహార్.

ఇద్దరూ దక్షిణంగా కొంచెందూరం వెళ్ళారు. "ఆడవాళ్ళు నిర్భయంగా వుండేందుకి దేశంలో ఆశ్రయ మెక్కడాలేదు," అన్నాడు జహార్.

"ఐతేమరి, ఇన్ని ఆశ్రమాలూ, మహిళా సేవామందిరాలూ వున్నాయిగా! ఇవన్నీ ఎవరికని కట్టారుమరి?"

"అలాంటి చోట్లకూడా డబ్బుంటేనే ఆశ్రయం దొరుకుతుంది. ఇకపోతే డబ్బవసరంలేనిచోట్ల, కనీసం వయస్సైనా-అందమైనా ఆడవాళ్ళకుండాలి."

"అంటే అర్థం?"

"అర్థమా? ప్రపంచంలో ధర్మరాజులసంఖ్య చాలా తక్కువ," అన్నాడు జహార్.

ఇద్దరూ ఒకరిపక్కనే ఒకరు నడుస్తున్నారు. అప్పటికి కొంచెం పొద్దెక్కటంతో చలిఅంతా పోయింది. వాళ్ళు ఆ సమీపంలోవున్న గోల్‌దీఘిలోకి వచ్చారు ఎదురుగా రాతిమెట్లు. దిగువున స్వచ్ఛమైన నీళ్లు మిలమిల లాడుతూ కనిపించినై ఇద్దరూ మెట్లుదిగి నీళ్ళతో మొహాలు కడుక్కుంటూ కూచున్నారు.

"నేనుమాత్రం ఉపవాసం వుండలేను బాబూ ఎలాగోలా ... చివరికి ఒక్క గాజైనా అమ్మవలసిందే, నీదగ్గిరేం డబ్బులేదుగా?" అన్నది సుఖలత.

జహార్ జేబులోంచి చెల్లని బేడకాసు పైకితీసి, "ఇది ఎక్కడికివెళ్ళినా చలనం లేనిది. కేవలం నాదగ్గిర యీ బేడమాత్రం వుంది," అన్నాడు.

సుఖలత నవ్వుతూ, "పద, కంసాలిదుకాణం ఎక్కడవున్నా వుందేమోచూద్దాం. నేనుకూడా వుంటాగా నీవెంట." అన్నది.

కంసాలి దుకాణంకోసం వెతుక్కుంటూ యిద్దరూ బయలుదేరారు. కొంచెందూరం వెళ్ళాక కుడిచేతివేపున్న ఓ బొందిలీ మిఠాయిదుకాణం చూసి ఆగి, "ఆబేశ యిలా యియ్యి. చెల్లుతుందోలేదో చూస్తా నువ్వుపోయి ఆ ఎలక్ట్రిక్ స్తంభందగ్గిర నుంచో." అన్నది సుఖలత.

ఆకలేస్తూంటే దాన్నణచుకునే తత్వంకాదు సుఖలతది. అప్పటికే ఆమెముఖం బాగా వాడిపోయింది. ఆమె మిఠాయిదుకాణం ముందుకువెళ్ళి, "ఇక్కడ ఆడవాళ్ళు కూచుని తినేందుకు చోటుందా" అని అడిగింది.

"ఉందండి. చోటు ఏర్పాటుచేస్తాను. ఏమేం కావాలి?" అని అడిగాడు దుకాణం వాడు.

సుఖలత దుకాణం లోపలికిపోయి, దుకాణంవాడు చూపినచోట కూర్చుని, రెండణాలకు సరిపడా ఏమేంవస్తాయో చూసి ఆర్డరిచ్చింది. ఓకుర్రాడు ఆమె కావాలన్న పదార్థాలు కాయితంలోపెట్టి తెచ్చి, ఓగ్లాసెడు మంచినీళ్ళుకూడా ఆమె ముందుపెట్టి వెళ్ళిపోయాడు.

సుఖలత కాసేపు వూరికేకూచుని, గ్లాసులోని నీళ్ళతో మొహం తుడుచుకుని, మంచినీళ్ళుతాగి – పది నిమిషాల్లో బైటికివచ్చి, తనవద్దవున్న బేడబిళ్ళను దుకాణం వాడికిచ్చింది. అతడు దాన్ని అటూయిటూ తిప్పిచూసి. "ఇది మంచిదికాదు ... చెల్లదు," అన్నాడు.

సుఖలత తెల్లబోతున్నట్టుచూసి, "అదేవిటి? చెల్లదా? కాళీమాతగుళ్ళో పూజారి యిచ్చాడే!" అన్నది.

"ఇచ్చుండొచ్చు. ఈరోజుల్లో జనం తమదగ్గిరున్న చెల్లనిడబ్బుల్ని దేవుడి కిస్తూంటారు. దేవుడుకూడా త్యాగిగనక తనదగ్గిరేమీ వుంచుకోకండా మళ్ళీ వాళ్ళకే యిచ్చేస్తూవుంటాడు;" అన్నాడు దుకాణంవాడు.

సుఖలత జాలిగా, మధురంగానవ్వి, "అయితే ఎలామరి? దగ్గిరింకేం లేదే!" అన్నది.

దుకాణంవాడు ఆమెనవ్వుకు ముగ్ధుడైపోయి, "బోణీవేళని అనుమానిస్తున్నాను కానీ, అర్ధరూపాయిదాకా తిన్నా ఫర్వాలేదు." అంటూ బేడబిళ్ళని తనచేయి సుఖలత చేతికి తగిలేలా ఆమెకిచ్చి, "సరే, మీదగ్గిర యిప్పుడు లేకపోతే ఎప్పుడోసారి యివ్వండి. అంతకన్న నేనేంచెప్పను? మీరు గొప్పింటి..."

మాట పూర్తికాకముందే, "అలాగే. ఎప్పుడోప్పుడు యిస్తాలే, బాబూ అంటూ సుఖలత తలవంచుకుని ముందుకునడుస్తూ. జహర్‌కు రమ్మని సైగచేసింది.

కొంతదూరం పోయాక యిద్దరూ మళ్ళీ కలుసుకున్నారు. సుఖలత నవ్వుతూ పైటచాటున పెట్టుకవచ్చిన, పొట్లాం బైటకితీసి "తొందరగా నడువు. ముందిదికాస్తా తింటేనేగాని ప్రాణాలు నిలవ్వు." అన్నది.

జహర్ ఆశ్చర్యపోతూ ఆమెకేసి చూస్తుంటే, సుఖలత చెల్లని బేడబిళ్ళని అతడిజేబులో పడేసి, "నేనక్కడ ఏమీ తినలేదు. ఊరకెనే తింటూన్నట్టు నూచుని, ఈ పొట్లాం చాటుగా తీసుకువచ్చాను. ఇక నడు..." అంటూ అతడి చెయ్యపట్టుకుని లాగింది.

# 3

జహర్, సుఖలతా ఖవాసీపూర్ చేరారు. ఇక్కడికి వచ్చేలోపలే వాళ్ళిద్దరూ ఆలోచించి ఒక నిర్ణయం చేసుకున్నారు సుఖలత తన పిన్నిగారింట్లో ఎక్కువరోజు లుండననీ, హౌరా స్టేషన్‌లో లేడీ బుకింగ్ క్లర్కుగా చేర్తాననీ చెప్పింది. ఒక వేళ ఆ ఉద్యోగంకనక రాకపోతే, ఇద్దరం కలిసి టీ దుకాణం పెడదామనీ, తాను గుమ్మంవద్ద నిలబడి జనాన్ని ఆకర్షిస్తుంటాననీ, విద్యార్థులు వేలంవెర్రిగా ఎగబడతా రనీ ఆమె జహర్‌కు నచ్చచెప్పింది.

జహర్ వీధికవతల ఒక ఇంటి గోడపక్కన నించున్నాడు. సుఖలత వెళ్ళి తన పినతల్లిగారి ఇంటితలుపు తట్టింది. లోపల గడియవేసి వుండకపోవటంతో తలుపులు తెరుచుకున్నై. ఆమె లోపలికి వెళ్ళింది.

సుఖలత రాకకోసం వీధిలోనిలబడివున్న జహర్, పక్కనించిపోతున్న మంగలిని ఆపి గడ్డంచేయించుకుని, ఆచెల్లని బేడబిళ్ళనే అతడిచేతిలో పెట్టాడు. మంగలి దాన్ని తిప్పిచూసి. అతడికేయిచ్చేసి, మళ్ళీ రేపు ఆ యింటిదగ్గరే కనబడతాననిచెప్పి వెళ్ళిపోయాడు.

జహర్ మరికాసేపు వీధివారగానిలబడి, సుఖలత ఎంతకీ రాకపోయేసరికి, ఆమెకు పినతల్లిఇంట్లో ఆశ్రయం దొరికిందనుకున్నాడు. ఆమెకిక దిగుల్లేదు. సుఖలత అబలకాదు; మహిళ. ఈ దేశంలో మహిళలకంటే, అబలలే ఎక్కువ!

అంతకుముందు ఇద్దరూకలిసి చేసుకున్న నిర్ణయాన్ని అతిక్రమించి, జహర్ వెంటనే అక్కడినించి బయలుదేరాడు. ఎటువంటి నిర్ణయాన్నయినా భంగపరచట మంటే అతడికెంతోసేపు పట్టదు. నిజానికి గడిచిపోయినరాత్రి, ఈఉదయమూ

ఏదో స్వప్నంలోలా చాలా తేలిగ్గా గడిచిపోయాయి. సుఖలతతో అతడికి బంధుత్వమైతే ఏర్పడింది; కానీ అది బంధంగా మాత్రం మారలేదు. జహర్ విశ్రాంతిగా నిట్టూర్చి, తాపీగా ఆలోచించి, తానొక సుడిగుండంలోనుంచి తప్పించుకుని బైట పడ్డాననుకుని, తృప్తిగా గాలిపీల్చి వదిలాడు.

ఆవీధివదిలి పెద్దరోడ్డు దాటివచ్చి, ఎదురుగావున్న వీధినబడి జహర్ నడవ సాగాడు. ఆవీధి సరాసరి కాళికాలయానికి వెళ్తుంది. ఇవాళేదో పండగలావుంది రెండువేపులా పెద్దపెద్ద దుకాణాలు, చిన్నచిన్న కొట్లు. అమ్ముకునేవాళ్ళ అరుపులు, పండాల దెబ్బలాటలు - తిట్లు, గుర్రబండ్ల చప్పుళ్లు, ఆడవాళ్ళ నవ్వులు, చిన్న పిల్లల ఏడుపులు - అంతా పెద్ద తిరణాల్లలావుంది. ఆజనప్రవాహంలో కలిసి జహర్ వెళ్ళిపోతున్నాడు.

జహర్ చాలాసేపు ఆకాళికాలయం చుట్టుప్రక్కలతిరిగి, కొంచెంసేపు విశ్రాంతి తీసుకునేందుకని, ఎదురుగా కనిపించే సత్రంకేసి వెళ్ళబోయేంతలో, వెనకనుంచి ఎవరో అతడిచేయి గట్టిగా పట్టుకున్నారు. ఉలిక్కిపడి అతడు వెనక్కి తిరిగిచూసి తెల్లబోయి, "నువ్వా ? నువిక్కడికి మళ్ళీ వచ్చావేమిటి ?" అని అడిగాడు.

సుఖలత అతడిచేయి వదలకుండానే కాసేపు ఆయాసపడుతూ నిల్చుని, "అబ్బ, ఎంతకష్టపడి నిన్ను మళ్ళీ పట్టుకున్నాను. నీకోసం ఎంత వెతికాననుకున్నావ్, గొందులూ, సందులూ, హోటళ్ళూ, నువు కనపడకపోయేసరికి, ఇహ నీకోసమని దేవిముందు ప్రాణాలైనా పడదామని యిక్కడికి వచ్చాను," అన్నది.

"ఐతే - మీపిన్ని ఏమన్నా అన్నదేమిటి ?" అని జహర్ అడిగాడు.

"నేను ఆత్తారింటినుంచి లేచిపోయినట్టు ముందుగానే ఆమెకు తెలిసింది. నన్నెందుకు తనింట్లో వుండనిస్తుంది. నేననేకవిధాల బతిమాలాను, ఆఖరికి కాళ్లు కూడా పట్టుకున్నాను. లేచిపోయినదానికి తనింట్లో జాగాయిస్తే అప్రతిష్ఠ వస్తుందన్నది," అన్నది సుఖలత.

ఇద్దరూ గుంపులోంచి తప్పుకుని బైటికివచ్చి రద్దీలేని దారివెంట నడకసాగించారు. కొంతదూరం వెళ్ళాక వీధిపక్కన వాళ్ళకో పూరిఇల్లు కనిపించింది. ఇద్దరూ ఆఇంటిముందుకు వెళ్ళారు. ఇంటితలుపులకు తాళంవేసి వుండటంచేత వాళ్ళు గుమ్మంముందు చతికిలబడ్డారు. నిన్నరాత్రి వాళ్ళకెలాంటిదో ఒకటి ఆశ్రయం అంటూ దొరికింది. ఇవాళ దొరుకుతుందన్న నమ్మకంలేదు. చలికాలం, చీకటి పడబోతున్నది.



ఓ పావుగంట తరవాత పట్టుపంచ కట్టుకున్న ఒకతను ఆ ఇంటిముందుకు వచ్చాడు. ఆయన నెత్తిమీద పిలకవున్నది. నామావళి ముద్రించిన పసుపుపచ్చ పట్టు బట్ట ఒంటినిండా కప్పుకున్నాడు. అతడు గుడిలో పూజముగించుకుని వస్తున్నాడల్లే వుంది.

"ఎక్కణ్ణించి వచ్చావు, బాబూ ?" అని అడిగాడాయన జహర్‌కేసి నవ్వుతూ చూసి.

"చాలా దూరంనుంచి వచ్చాం. నాతోకూడావచ్చిన యీామె, గోపాల్‌పూర్‌లోని మాతృశ్రీ ఆశ్రమంతాలూకు ముఖ్య పరిచారకురాలు. నేనక్కడ స్కూల్లో మాష్టార్ని;" అన్నాడు జహర్.

"బావుంది. ఏంపనిమీద యిక్కడికి దయచేశారు ?"

"ఇక్కడి ఆలయంలో ఈమెని వుంచాలనివచ్చాను. ఆశ్రమం అభివృద్ధికోసం చందాలు వసూలుచేయాలి. ఈమె సద్బ్రహ్మచారిణి, గీతార్థంఅంతా ఉపన్యాసాలుగా చెప్పగల ప్రజ్ఞావంతురాలు," అన్నాడు జహర్.

అనుకోకుండా జహర్ యీావిధంగా నాటకమాడటంచూసి, సుఖలతకి భయంవేసి, తలవంచుకున్నది. ఆ వచ్చినాయన వయసుమళ్ళినవాడు. సుఖలతమీద అతడికి గౌరవ ప్రపత్తులు కలిగాయి.

"తమరెవరో తెలుసుకోవచ్చా ?" అని జహర్ అడిగాడు.

"తప్పకండా. నన్ను శివప్రసాదభట్టాచార్య అని పిలుస్తారు. ఇక్కడి దేవాలయంలో యాత్రికుల తరపున పూజలూ అవీ చేస్తూంటాను. ఈ ఇల్లు నాదే. యాత్రికులకు గదులు అద్దెకిస్తూంటాను. ఈ బ్రహ్మచారిణికి కావల్సిన ఏర్పాట్లన్నీ నేనుచేస్తాను. రా, అమ్మా, రా,'' అంటూ భట్టాచార్య ఇంటితాళంతీసి తలుపులు తెరిచాడు.

జహర్, సుఖలత అతడివెనకగా ఇంట్లోకి వెళ్ళారు. "మీవెంబడి సామాసులేమీ తెచ్చుకోలేదా ఏమిటి ? సరేలే, బాబూ. అన్ని ఏర్పాట్లూ నేనే చేస్తాను. మీరీలోగా... ఎంతసేపు ! ఇదిగో యిప్పుడే యీా ఇంటివెనకవున్న, నా నివాస గృహానికి వెళ్ళివస్తాను. నాతల్లి ముఖంలో లక్ష్మీకళ తాండవమాడుతున్నది," అంటూ భట్టాచార్య పెరటితలుపులు తెరుచుకుని వెళ్ళిపోయాడు.

సుఖలత జహర్‌కేసిచూసి నవ్వుతూ, "కొంపతీశావే మొత్తానికి. ఇదేమిటిలా చేశావ్ ? భలేబావుంది," అన్నది.

"ఎలాగో ఓలా బతకాలావద్దా ?" అన్నాడు జహర్ నెమ్మదిగా.

కొద్దిసేపట్లో భట్టాచార్య తిరిగివచ్చి. "ఆలయంలోకివెళ్ళి కొంచెంసేపు కూర్చోండి. ఈమె తెల్లబట్టలు కట్టుకునివస్తే ఎలా ? ఇదిగోనమ్మా, యీా కాషాయ బట్టలుతెచ్చాను; కట్టుకో," అంటూ వాటిని సుఖలత కిచ్చాడు,

సుఖలత వాటిని తీసుకుని, "సింధూరంవుందా, బాబూ ?" అని అడిగింది.

"లేకేం, అదీతెచ్చాను." అంటూ భట్టాచార్య సింధూరం ఆమెకిచ్చాడు.

"ఇన్నిఏర్పాట్లూ ఎలాగో చేశారు. ఒక దుప్పటికూడా ఇప్పించండి, బాబుగారూ" అన్నది సుఖలత.

"తెస్తానమ్మా," అంటూ భట్టాచార్య గబగబా వెళ్ళి, ఒకాషాయరంగు దుప్పటి తెచ్చి ఆమెకిచ్చాడు.

సుఖలత పక్కగదిలోకి వెళ్ళి కాసేపట్లో కాషాయరంగు చీర కట్టుకుని, సింధూరంతో పాపిటంతా ఎరుపు చేసుకుని, దుప్పటితో ఒళ్ళంతా కప్పుకుని బైటికివచ్చి, భట్టాచార్యగారి పాదాలకు వంగి నమస్కరించింది.

"అభీష్టసిద్ధిరస్తు - నీ కోరికలు నెరవేర్తాయి, వెళ్ళిరామ్మా!" అని దీవించాడు భట్టాచార్య.

సుఖలత మెల్లిగా వీధిలోకి వెళ్ళగానే, భట్టాచార్య జహర్‌ను పక్కకు పిలిచి నవ్వుతూ రహస్యంగా, "పెద్దవాణ్ని. ఏమీ అనుకోకు, నాయనా! నేను జీవించటమే యిలా. తప్పదుమరి. చీకటి పాటికి రోజూ అయిదు రూపాయలు తీసుకుంటాను. ఇంటి అద్దెకింద అర్ధరూపాయి... యిప్పించాలి," అన్నాడు.

"అదేమిటి! మీరు చెప్పాలా? తప్పకుండా యిప్పిస్తాను," అన్నాడు జహర్.

చీకటి పడబోతున్నది. ఆలయంలో దేవికి సంధ్యాహారతి జరుగుతున్నది. ఆడా మగా భక్తులతో ఆలయం కోలాహలంగా వున్నది. ఒకపక్కన కొందరు కాళీమాత భజన చేయటం ప్రారంభించారు.

సర్వమూ సన్యసించిన మహారాణిలా తలఎత్తుకుని ధ్యానస్థిమిత దృష్టితో సుఖలత ఆలయంలోకి వచ్చి నిలబడింది. ఆ మొహంలోని తేజస్సూ, నేత్రాల్లోని దివ్యకాంతులూ, చేయి తిరిగిన ఉత్తమశిల్పి చిత్రించినట్టున్న ఆమె పెదవులమీది చిరునవ్వూ- ఇవన్నీ ఆమె సర్వావయవాల్లోంచి వెల్లివిరుస్తున్న యవ్వనశోభతో మిళితమై, ఆమెని మహామహిమాన్వితగా చేశాయి. ఆ తేజస్సులోని ఆకర్షణ చుట్టూరా వున్నవాళ్ళను చకితుల్ని చేసింది.

భట్టాచార్య ఎక్కణ్నించో సమిధలు తెచ్చి, అగ్నిని ప్రజ్వలింపజేశాడు. మంట కాస్త పైకి రావటంతోనే, ఏ పండా దగ్గిర్నించో ఒకపీట తీసుకువచ్చి, ఈ యోగినీమాతకోసం వేయించాడు. జహర్‌కూడా పక్కనే నిలుచున్నాడు.

"నే నిప్పుడేవెళ్ళి నాలుగువేపులా కాస్త ప్రచారంచేసి వస్తాను. నువ్విక్కడే వుండు బాబూ! నా దబ్బుసంగతిమాత్రం మర్చిపోవద్దుసుమా!" అని జహర్‌తో చెప్పి, భట్టాచార్య నవ్వుకుంటూ వెళ్ళిపోయాడు.

చూస్తూండగానే కాసేపటికల్లా సుఖలత చుట్టూ ఆడా మగా గుంపుచేరింది.

వాళ్ళల్లో గుసగుసలు ప్రారంభమయినై... ఈమె ముత్తైదువులకీ, పెళ్ళికానివారికీ చేతులుచూసి అద్భుతంగా జ్యోతిషం చెబుతుందట! భారతదేశంలోని పుణ్యక్షేత్రాలన్నీ సేవించి, హిమాలయాల్లో ఎక్కడో ఒక గుహలో తపస్సు చేసుకుంటున్న ఋషివద్ద ఉపదేశం పొంది, దేశీయుల శ్రేయస్సుకని యీమె మళ్ళీ మనమధ్య కొచ్చిందిట!

ఇలాంటి మాటలూ, పొగడ్తలూ మధ్య ఓ వ్యక్తి నడుంచుట్టూ కండువా చుట్టుకుని, ఎర్రని నేత్రాలతో జనాన్ని తోసుకుంటూ వచ్చి, జేబులోంచి బేడబిళ్ళతీసి ఠంగ్ మనేట్టు సుఖలత పాదాలముందుంచి, ఆమెకి సాష్టాంగ ప్రణామం చేశాడు.

వెంటనే చిన్న తొక్కిసలాట ప్రారంభమయింది. అక్కడవున్నవాళ్ళంతా భక్తిభావంతో తలలువంచి, సుఖలతకు నమస్కరించి, తలా అర్ధణా, అణా, పావలా, అర్ధరూపాయిచొప్పున ఆమె పాదాలముందు సమర్పించటం మొదలు పెట్టారు.

# 4

రెండురోజులు గడిచినై. కాంసారిపాడులోని ఓ ఇంటి గుమ్మంలోకివచ్చి జహర్ తలుపు తట్టాడు. లోపల్నుంచి, "ఎవరది?" అన్న ఆడమనిషి కంఠంవినిపించింది.

"కొంచెం తలుపుతీయండి" అని జహర్ తరఫున సుఖలత జవాబిచ్చింది.

రెండు నిమిషాల తరవాత ఒక యువతి తలుపుతెరిచి జహర్‌నిచూసి, కొంచెంగా తలుపుచాటుకు తప్పుకున్నది.

"ఈ ఇల్లు అద్దెకిస్తారని రాసుంది. ఎన్నిగదులేమిటి?" అని అడిగింది సుఖలత.

"రెండుగదులూ, ప్రత్యేకంగా ఒక వంటగదీ. లోపలికివచ్చి చూడండి," అన్నది యువతి.

జహర్‌ని అక్కడే వుండమని సైగచేసి సుఖలత లోపలికి వెళ్ళింది. బాగా గాలీ వెలుతురూ వచ్చేట్టున్న ఆ గదులు సుఖలత కెంతో నచ్చాయి.

"అయితే, అద్దె సంగతి చెప్పారుకాదు, ఎంతుంటుంది?" అని అడిగింది సుఖలత.

"మగవాళ్ళంతా ఆఫీసులకి వెళ్ళారు. అద్దె ఇరవైరూపాయిలు. మీతో వచ్చినవా రెవరు? మీ వారా?" అని అడిగింది ఇంటావిడ.

సుఖలత నవ్వుతూ, "బాగా కనుక్కున్నారే!" అన్నది.

"కనుక్కోవటానికేముంది, చెప్పకపోయినా తెలుసుకోవచ్చు. మా ఇంటివారు

వచ్చాక, అద్దె కొంచెం తగ్గించమని చెబుతాలెండి,'' అన్నది ఇంటావిడ చిరునవ్వు నవ్వుతూ.

"ఇల్లు బాగానేవుంది. ఇరవై రూపాయిల అద్దె ఫరవాలేదులెండి," అంటూ సుఖలత బయిటికి వచ్చింది. జహర్ తాను కొన్ని సామాను మోసుకువచ్చిన కూలివాడితో, వీధిలో నిలబడి మాట్లాడుతున్నాడు. సుఖలత చెప్పగానే అతడు కూలివాడితోకూడా లోపలికివచ్చి, సామాను ఒకమూల పెట్టించి, వాడికి కూలిడబ్బు లిచ్చి పంపేశాడు.

రెండుగదులు దొరికాయన్న సంతోషంతో సుఖలత ఇంట్లో అటూ యిటూ కాసేపు హాయిగా పచార్లు చేసింది. ఉన్నట్టుండి హఠాత్తుగా ఇంతవరకూ ఉభయులకూ గుర్తుకురాని విషయం ఒకటి భయంకరంగా నృత్యంచేసుకుంటూ వారిమధ్యకు వచ్చి నిలబడింది.

"అన్నీ బాగానే అమిరాయి. ఇకతరవాత ?" అన్నాడు జహర్.

"తర్వాతేముందిక ?" అన్నది సుఖలత ఆశ్చర్యపోతూ.

"తెలీకడుగుతాను. ఈ ఇల్లూ యింత వంటసామగ్రీ... యివన్నీ దేనికి ?" అన్నాడు జహర్.

సుఖలత కిటికీ దగ్గిరకుపోయి బయటికిచూస్తూ, ''ఔను, యివన్నీ మన కెందుకు ? ఇద్దరం చెరోవేపూ వెళ్ళిపోదాం అనికదా అనుకున్నాం. నా కిప్పటిదాకా ఆ సంగతే గుర్తుకు రాలేదు.'' అన్నది.

"మనమిద్దరం యీ ఇంట్లో కలిసి వుండటానికి కారణమేమని చెబుతాం ? ఇతర్లతో, ఏ రకమైన సంబంధం వుందని చెప్పుకోగలం ?" అన్నాడు జహర్.

"నీ ఆలోచనా పరిధి చాలా సున్నితమైంది, చురుకైనది. ఆడవాళ్ళ మనసుకన్నా నీది చాలా సచేతనమైంది," అన్నది సుఖలత.

"ఆ సంగతి నాకు తెలుసు. అందుకనే మరీ సచేతనమైన మనసుగల వాళ్ళెప్పుడూ తమనితాము మరచిపోలేరు. ఎటువంటి పనైనా సరే చేయలేరు. వాళ్ళకు నిస్వార్థమైన త్యాగమంటే ఏమిటో, ప్రేమోద్రేకం అంటే ఏమిటో తెలీదు," అన్నాడు జహర్.

"అయితే, ఇంతకూ నీమీద నీకు స్పష్టమైన అభిప్రాయమంటూ ఏమీ లేదన్న మాట !" అన్నది సుఖలత.

జహర్ ఏదో అనబోయేంతలో ఇంటావిడ గుమ్మందగ్గిరకు వచ్చింది. సుఖలత

జహర్‌నడిగి ఇరవై రూపాయిలు తీసుకుని ఆమెకిస్తూ, "అద్దె ముందుగా యివ్వటమే మంచిది. మీ కెలాంటి బెడదా వుండదు." అన్నది.

ఇంటావిడ మృదువుగా నవ్వుతూ, "అద్దెకోసం వచ్చాననుకున్నారా? కావుంది. మిమ్మల్ని యీ పూట మా ఇంట్లోనే భోజనం చేయమని చెప్పేందుకు వచ్చాను. వంట చేసుకుంటారా ఏం?" అన్నది.

సుఖలత జహర్‌కేసి చూసి, "ఇంకోసా రెప్పుడన్నా పిలవచ్చులెండి. కాస్త బజారుకుపోయి రావలసిన పనుంది, బాగా ఆలశ్యం కావొచ్చు" అన్నది.

ఇంటావిడ వెళ్ళిపోగానే, సుఖలతా, జహర్ కొత్తబట్టలు కట్టుకుని, కొత్త చెప్పులు తొడుక్కుని బయలుదేరారు. వాళ్ళు పెద్దబజారులో చాలాదూరం అదీ యిదీ మాట్లాడుకుంటూ నడిచారు. ఒకచోట సుఖలత చేయెత్తి రిక్షను కేక వేసింది. అది రాగానే ఇద్దరూ దాన్లో ఎక్కికూచున్నారు.

జహర్ చెప్పినదిక్కుగా రిక్షవాడు గంట మోగిస్తూ వేగంగా పోసాగాడు. జహర్ రోడ్డుపక్కనున్న భవనాలకేసి పరీక్షగా చూస్తూ ఒకచోట రిక్షవాణ్ణి ఆగమన్నాడు. రిక్ష ఆగగానే యిద్దరూ దిగారు. జహర్ రిక్షవాణ్ణి అక్కడే తమకోసం వుండమని చెప్పాడు.

రోడ్డుపక్కనే ఎవరో శ్రీమంతుల పెద్దభవనం వున్నది. జహర్, సుఖలతా గేటును సమీపించగానే, అక్కడ కావలివున్న గూర్ఖా వాళ్ళిద్దరికీ సలాంచేసి పక్కకు తప్పుకున్నాడు. ఇద్దరూ భవనంలోని పెద్దహాల్లో ప్రవేశించారు. అక్కడ ఒక ఈజీచైర్లో – బహుశా భవనపు యజమాని అయివుంటాడు – చేరగిలబడి కూర్చుని వున్నాడు. అతడికి ఎదురుగా ముగ్గురు నలుగురు కుర్చీలో కూచుని ఆయనతో మాట్లాడుతున్నారు.

జహర్, సుఖలతా హాల్లో ప్రవేశించగానే, ఎవరో శ్రీమంతులింటి ఆడబడుచు వచ్చిందనుకుని కుర్చీలోవున్నవాళ్లు లేచి సుఖలతనూ, జహర్‌నూ ఆహ్వానించారు. వాళ్ళిద్దర్నీ కూర్చోమనిచెప్పి యజమాని, "ఏంపనిమీద వచ్చారు?" అని అడిగాడు.

"మేం తమకోసం రెండుసార్లు వచ్చాం. కానీ, తమ దర్శనభాగ్యం దొరకలేదు." అన్నాడు జహర్.

"అలాగా! నాకు తెలీదు, పనేమిటో చెప్పండి?" అన్నాడాయన.

జహర్ ఎంతో వినయంగా, "తమరు మహిళామండలి పేరు వినేవుంటారనుకుంటాం ... బహుశా పత్రికల్లోకూడా ఆ మండలినిగురించిన వార్తలు చదివేవుంటారు." అన్నాడు.



"మహిళా మండలా? మహిళా సమాజమా?"

"చాలామంది సమాజమనికూడా అంటారనుకోండి. దానికి యీమె కార్యదర్శిని..." అంటూ జహార్ సుఖలతని చూపి, "ఇది కొత్తగా స్థాపించిన సంస్థయినప్పటికీ, ఈమె ఇంకా కొంతమందిని చేర్పించి, ఎంతో శ్రమపడుతూ ప్రయాసతో దాన్ని నడుపుతున్నారు. దాని ఆర్థికపరిస్థితికూడా ఏమంత బాగాలేదు. అంతా దాన్ని..."

యజమాని జహార్ మాటకు అడ్డొచ్చి, "అక్కడేంచేస్తుంటారేం?" అని అడిగాడు.

సుఖలత గొంతు సవరించుకుని, చిరునవ్వు నవ్వి, "ఆడవాళ్ళకి ఆరోగ్య శిక్షణ, గర్భిణీస్త్రీల విధులూ-ఉచిత విద్యాసౌకర్యం, సంగీతశిక్షణ, నాట్యం, లైబ్రరీ..."

సుఖలత మాట పూర్తి చేయకుండానే యజమాని, "ఓం, బావుంది! బావుంది! మంచి ఏర్పాట్లు చేశారు," అన్నాడు.

జహర్ అందుకుని, "తమరు శ్రీమంతులు. తమదగ్గిన్నుంచి ఆ సంస్థకి సహాయా న్నభిలషించి యీమె..."

యజమాని చిన్నగా నవ్వుతూ, పక్కనేవున్న టేబిల్ డ్రాయరు తెరిచి, ఐదు వందరూపాయల నోట్లు తీసి సుఖలత కిస్తూ, "నా సహాయం చాలా కొద్దిది, చెప్పుకో దగ్గదికాదు. మీరు ఆశించినంతగా కాకపోయినా ప్రస్తుతం వున్నది యిచ్చాను. మీకు జ్ఞాపకంవుంచుకొని కొన్నాళ్ళుపోయాక ఇంకోసారి కనిపించండి, చూదాం." అన్నాడు.

సుఖలత లేచి నిలుచుని ఆయనకు కృతజ్ఞతాపూర్వకంగా నమస్కరించి, "మీరిచ్చిన యీ విరాళం స్వల్పమైనా, మీ ఆదరానురాగాలు చాలా గొప్పవి. మీ రిచ్చిన యీ ప్రోత్సాహంతో ముందుకు జయప్రదంగా నడుస్తాము. మీ మేలు మరవ లేము," అన్నది.

యజమాని జహర్‌కేసి చూసి నవ్వుతూ, "మహిళాసమాజాన్ని నిలబెట్టి జయ ప్రదంగా నడిపేందుగ్గాను, భార్యాభర్త లిద్దరూ నడుంకట్టి బైలుదేరారన్నమాట." అన్నాడు.

జహర్ చిరునవ్వు నవ్వాడు. ఆ తరువాత ఇద్దరూ ఆయనకు నమస్కరించి వచ్చేశారు. రిక్షా అక్కడేవున్నది. ఇద్దరూ దానెక్కి కూచున్నారు. జహర్ రిక్షా వాడితో, "నీ యిష్టమొచ్చినవైపుకు పో." అన్నాడు.

రిక్షా కదిలింది. "వందరూపాయిలన్నా యిస్తాడనుకున్నాను." అన్నది సుఖలత.

"నీ అందంమీద నీకు పెద్దనమ్మకమూ, విశ్వాసమూ వున్నదన్నమాట!" అన్నాడు జహర్.

"ఎవరి అందంమీద వాళ్ళ కలాంటి విశ్వాసం వుండటంతప్పా ఏమిటి? లోకా న్నంతటినీ మాటిమాటికీ దుమ్మెత్తి పోస్తూంటావుగదా, నువ్వే చెప్పు నిజం?" అంటూ సుఖలత తన వేడినిట్టూర్పు అతడి మొహానికి తగిలేట్టు అతడివేపుకు తిరిగింది.

తప్పుకునేందుకు వీలులేని ప్రజాసమూహంలో, రద్దీగా తిరుగుతున్న కార్లూ, బస్సూ, రిక్షాలూ మొదలైనవాటి రణగొణ ధ్వనులతో ప్రతిధ్వనిస్తున్నట్టున్న కలకత్తా రాజవీధులవేపు చూస్తూ, "ఎందుకంతగా బాధపడతావ్?" అన్నాడు జహర్.

"దగా చేయటంలో నీలా నేను అంతగా ఆరితేరినదాన్ని కాను. అందుకని..." అంటూ సుఖలత ఓక్షణం ఆగి, "ఇప్పుడు చెబుతున్నాను, నా పేరు సుఖలత కాదు శ్రీమతి," అన్నది.

జహార్ ఏమాత్రం ఆశ్చర్యం కనబర్చకుండా, "శ్రీమతా? చాలా మంచిపేరు," అని ఓ అరనిముషం ఆలోచిస్తూ పూరుకుని, "అవునుగాని శ్రీమతీ, ఇది దగా అంటావేం? ఇది దగాకాదు, మోసంకాదు. సంపాదన అంటారు, సంపాదన!" అన్నాడు.

"సంపాదించేందుకు ధర్మమార్గమంటూ యుక లేదా? ఏమిటి నీ వుద్దేశం?" అనడిగింది శ్రీమతి.

"సంపాదన వేరు, ధర్మమార్గం వేరు. సంపాదనకోసం కొందరు కూలిచేస్తారు, మరికొందరు జూదం ఆడతారు, ఇంకొందరు గుమాస్తాపనులు చేస్తారు, మరికొంత మంది మహాజ్ఞానసమాజాలు పెడతారు," అన్నాడు జహార్.

శ్రీమతి అతడి విచిత్రమైన యుక్తిని విని నవ్వసాగింది. జహార్ చెప్పే ప్రతి మాటనీ, యుక్తినీ విమర్శించవచ్చు. కాని అలా తర్కించటం మొదలుపెడితే అతడి మాటల్లోని చమత్కారం కాస్తా ఎగిరి పోతుంది. శ్రీమతి మనసు రసార్ద్రమైంది. ఆమె యింకేమీ మాట్లాడలేదు.

మరి కొద్దిసేపు వాళ్ళు రిక్షాలో తిరిగి భోజనంవేళ కాగానే, రిక్షావాడికి డబ్బిచ్చి పంపేసి, దాపుల కనిపించిన ఒక హోటల్‌కు పోయి భోజనం చేశారు. ఆ తరవాత రోడ్డంట నడుస్తూ, యిప్పు డింటికిపోవటమా మరెక్కడికైనా పోవటమా అని వాళ్ళు ఆలోచిస్తున్నంతలో, వెనకనుంచి ఏదో పిలుపు వినిపించింది. ఇద్దరూ ఆగారు. యువకు డొకడు పరిగెత్తుకుంటూ వచ్చి శ్రీమతికి నమస్కారంచేసి, "ఇదేమిటి వదినా! మీ రిలావచ్చారేం?" అని అడిగాడు.

శ్రీమతి సంతోషంగా నవ్వుతూ, "అరే. నువ్వా!" అంతా బావున్నారా?" అని అడిగింది.

"ఆఁ అంతా బావున్నాం. వరండాలో నిలుచునివున్నాను. మీరు వెళ్ళటం కని పించింది. చూసి, యిలా గబగబా వచ్చాను. అదుగో, మీ చెల్లెలు యింకా అక్కడ నిలుచుని చూస్తున్నది. ఇంటికి వెళ్దాం రండి."

"సరే. వెళ్దాం. వీరిని నీకు పరిచయం చేయలేదుకదూ...వీరు నేను చదువు కున్న కాలేజీలో ప్రొఫెసరుగా వున్నారు...ఈయన మా చెల్లెలి భర్త విమలబాబు - తెలిసా మాష్టారూ?" అన్నది శ్రీమతి జహార్ నుద్దేశించి.

విమలబాబూ, జహార్ ఒకరికొకరు నమస్కారం చేసుకున్నారు. "మా ఇంటికి వెళ్దాం రండి, మాష్టారూ," అంటూ విమల్ జహార్ చేయి పట్టుకున్నాడు.

విమల్ చాలా ఐశ్వర్యవంతుడు. వాళ్ళ పెద్దలు ఆయనకి చాలా సంపాయించి

పెట్టి పోయారు. వాళ్ళు ఇంటిని సమీపించగానే, అప్పటివరకూ ప్రహరీగోడ పక్కన కూర్చుని పిచ్చాపాటీ మాట్లాడుకుంటున్న వంటమనిషీ, ఇతర నౌకర్లూ చప్పున లేచి నిలుచున్నారు. వరండా పక్కనున్న గదిలో కొందరు యువకులు పేకాడుతున్నారు. శ్రీమతి చెల్లెలు రమ మెట్లదగ్గర నవ్వుతూ నిలుచునివున్నదల్లా, అక్కను చూడటంతోనే చేయి పుచ్చుకుని మేడమీదికి తీసుకువెళ్ళింది.

"మీరుకూడా పైకిరండి, మాష్టారూ," అన్నాడు విపుల్. జహర్ మాట్లాడకుండా ఆయనవెంట మేడపైకి వెళ్ళాడు.

"ఈ పడకకుర్చీలో కూర్చుని కొంచెంసేపు విశ్రాంతి తీసుకోండి మాష్టారూ. ఇది నా లైబ్రరీ గది. ఆ బీరువాలో మీకేదైనా పుస్తకం కావలిస్తే తీసుకొని... ఆగండి ఇప్పుడే వస్తాను." అంటూ విపులబాబు పక్కగదిలోకి వెళ్ళి రమని వెంటబెట్టుకుని మళ్ళీ గదిలోకి వచ్చాడు.

"నమస్కారమండీ, మాష్టారూ. నా అక్క మీదగ్గర చదువుకున్నానని చెప్పింది. కానీ, నాకా అదృష్టం కలగలేదు," అన్నది.

"ఐతే, మీ రే కాలేజీలో చదివారు?" అని అడిగాడు జహర్.

రమ విపుల్ కేసి తలతిప్పి నవ్వి "కాలేజీదాకా ఎక్కడండి – మెట్రిక్ వరకే చదువుసాగింది. ఆఖరికి అదికూడా ప్యాసవలేకపోయాను. ఇంతలో..." అంటూ ఆగింది.

"ఓహో, సరే – ఇంతలో కోయిలకూసింది. ఇంకేం!" అన్నాడు జహర్.

రమ నవ్వుతూ వెళ్ళేదల్లా ఆగి, "మీకు టీ చేసి తీసుకువస్తాను, వుండండి," అని చెప్పి వెళ్ళింది.

రమ చంటిపిల్లాణ్ణి ఒడిలో కూచోబెట్టుకుని శ్రీమతి ఆడిస్తున్నది. రమ గదిలోకి వస్తూ అది చూసి, "ఇలా కుదురుగా ఒకచోట పడివుండేందుకు నీకో కొడుకో కూతురో పుట్టివుంటే చాలా బావుండేది... సరే, ఆతర్వాత ఏమయింది?" అని అడిగింది.

"ఆతర్వాతేం చెప్పమంటావ్? పెద్ద తగాదా అయింది; చేసుకున్నమగాడు వట్టి దుర్మార్గుడై, ఎందుకూ పనికిమాలినవాడైతే నేను సహించలేను, రమా." అన్నది శ్రీమతి.

"అయితే, రమణిబాబుతో పూర్తిగా తెగతెంపులు చేసుకున్నావా ఏం?" అని అడిగింది రమ.

"అంతకంటే యింకో మార్గం కనిపించలేదు. ఏం చేయను? ఉన్నదబ్బంతా



ఖర్చయింది ఆస్తంతా పోయింది నగలన్నీ ఒక్కొక్కటిగా హరించుకుపోయాయి అంతేకాదు, ఇంట్లో సామానుకూడా ఒక్కొక్కటిగా తాకట్లకింద బజారుకి పోయాయి అక్కడికీ సహించి అలానే పడివుందామంటే, తాగి ఎక్కణ్ణించో ముండల్ని వెంటబెట్టుకు వచ్చేవారు అక్కడికి క్షమించుదామనుకున్నా, రానురాను ఇరుగుపొరుగు ఆడవాళ్ళకూడా చెడ్డచిక్కొచ్చిపడింది వాళ్ళు వాళ్ళ డాబాలమీదికి రావటానికి ఆస్కారంలేకపోయింది. పంపుదగ్గిర కెళ్ళేందుకూడా వీల్లేకపోయింది. ఇహ అక్కడితో నాకు భరించలేనంత అసహ్యంవేసింది. దాసీదాన్ని కూడగట్టుకుని, తెల్లారగట్ల ఇంట్లోనుంచి బయటపడ్డాను," అని చెప్పింది శ్రీపతి.

"నీకంత కష్టంగా తోచినప్పుడు, పోనీ నాన్నదగ్గిరకెందు కెళ్ళలేకపోయావ్? నాన్నగారి ఆస్తంతా నీదేకదా. ఆయన నీకు..."

రమ మాట పూర్తిచేయకముందే శ్రీమతి అందుకుని, "నువ్వన్నట్టు అత్తగారిల్లు తర్వాత ఆడదానికి పుట్టిల్లే అనుకో, కాదనను. కాని, ఏమొహంపెట్టుకుని అక్కడికి వెళ్ళమంటావ్? నాన్నదగ్గరకెళ్ళి ఏమని నాబాధచెప్పుకోను? భర్త ప్రవర్తనగురించి తండ్రిదగ్గర సిగ్గువిడిచి చెప్పుకోవటం కన్న - విషంతాగి చావటం మేలు..." అని చెపుతూంటే శ్రీమతికంఠం గద్గదికమైంది.

"బావుంది నీదతుకు. సరే - అక్కణ్ణించి సరాసరి యిక్కడకెందుకు రాలేక పోయావ్? నేనంత పనికిమాలినదాన్ననుకున్నావా?" అని అడిగింది రమ

"ఎందుకని రాలేకపోయానో, ఎలాచెబితే నీకుతెలుస్తుంది ఆత్మగౌరవంగల మానవులు, ప్రాణప్రదమైన తమ ఆశ్రయాన్ని పోగొట్టుకున్నప్పుడు - బతికున్నా చచ్చినవాళ్ళకిందే జమ. ఇంతకంటే నీకింకేం చెప్పమంటావ్, రమా?"

"బావుంది. సరేఅక్కా, అయితే ఈనాలుగైదు రోజుల్నించి ఎక్కడున్నావ్? ఏంచేశావ్?" అని అడిగింది రమ.

"ఆ దాసీదానివెంట సరాసరి దానింటికేపోయాను. అక్కడికెళ్ళి చూద్దునుగదా - దాని ఆలోచనలన్నీ యింకోవిధంగా వున్నాయి. ఏం చెప్పమంటావ్? అశ్లీల పద్మవ్యూహం, షడ్యంత్రం. అందులోనించి బైటపడ్డమేకష్టం. సరిగా ఆరోజునే మాష్టార్ని కలుసుకోవటం తటస్థించింది. ఆయన ఆపదలో అడ్డుపడిన ఆపద్బాంధవుడు, కష్టాల్లో ఆదుకున్న ఆప్తమిత్రుడు!"

"అయితే యిప్పుడిహ నాన్నదగ్గర కెళతావా?"

"తప్పకండా వెళతాను. కానీ, అక్కడ వుండదలుచుకోలేదు."

"అక్కడుండవూ? మరి ఎక్కడుంటావేం?" అని రమ ఆశ్చర్యంగా అడిగింది.

శ్రీమతి నవ్వుతూ, "ఎక్కడికెళ్ళినా ఎవరిమీనా ఆధారపడి వుండను, రమా. నా కాళ్ళమీద నేను నిలబడేందుకు ప్రయత్నిస్తాను. నాలాగా యిలాంటి ఇబ్బందుల్లో ఇరుక్కుపోయిన ఆడది - ధనవంతుడైన తండ్రిలేని అమ్మాయి - ఈ లోకంలో ఏవిధంగా నిలబడి వుండగలుగుతుందో, నేనూ ఆవిధంగానే వుండేందుకు ప్రయత్నిస్తాను," అన్నది.

"కాని, నాన్న నీ మీదే ఆశపెట్టుకుని వున్నాడు. తోడుగా ఆయనదగ్గర అమ్మ కూడా లేదాయె. అమ్మ పోయినప్పటినుంచీ నాన్న ఆశలన్నీ నీమీదే పెట్టుకుని..."

"నాకా సంగతి తెలుసు, రమా! సరే, ఆ విషయాలకేంగాని పిల్లాడికేం పేరు పెట్టావ్?" అని అడిగింది శ్రీమతి.

"ఇంకా వాడికి పేరేం పెట్టలేదు. పంచాననుడనో, భజహరి అనో ఏదో ఒకటి పెట్టాలి," అన్నది రమ.

ఇద్దరూ నవ్వుకున్నారు. తరవాత రమ టీ తయారుచేసి తీసుకుపోయి జహర్‌కిచ్చి వచ్చింది.

శ్రీమతిని తమ యింటనే వుండిపొమ్మని ఒకటికిరెండుసార్లు కోరింది. తన భర్త వుద్దేశంకూడా అదేనని చెప్పింది. శ్రీమతి పెద్దచిక్కులో పడింది.

విమలబాబు తన పేకాటమిత్రుల్ని సాగనంపేందుకు గేటుదగ్గరకు వెళ్ళాడు. శ్రీమతి అడుగులో అడుగువేసుకుంటూ లైబ్రరీ గదిలోకి వచ్చింది. జహర్ ఆమె రావటం గమనించకుండా ఏదో పుస్తకం చూస్తూ కుర్చీలో కూర్చుని వున్నాడు.

శ్రీమతి, జహర్ కూచునివున్న కుర్చీ హాండ్ మీద కూచుని, అతడిచేయి పట్టుకుని, "వచ్చివచ్చి చాలా పెద్దచిక్కులోనే పడ్డాను. వీళ్ళు నన్ను వదిలిపెట్టేట్టు లేరు," అన్నది.

"అయితే యింకేం! చాలా మంచిపనే జరిగింది. ఇంతకంటే యింకేం కావాలి. వాళ్ళు విన్నొదిలిపెట్టకుండా వుండాలనే, నేను భగవంతుణ్ణి ప్రార్థిస్తున్నాను," అన్నాడు జహర్.

"ఎందుకని? నామీద అంతకోపం ఎందుకు? నన్ను సహించలేకండా వున్నావన్నమాట. ఏం, అంతేనా?"

జహర్ వస్తున్న నవ్వాపుకుంటూ, "నా మనసులో ఏముందో, నేనేమని అనుకొంటున్నానో ఆ భగవంతుడికే తెలుసు. రంపపు పళ్ళమీద వున్నట్టున్నది, నాస్థితి. ఇంకేం చెప్పను?" అన్నాడు జహర్.

శ్రీమతి మరీ చిన్నపిల్లలా అతని చేయి నొకసారి గోముగా నలిపి, "ఇంకో విధంగా అనుకోకు. తప్పనిసరిగా ప్రస్తుతానికి నే నిక్కడ వుండాల్సి వచ్చేలావుంది. ఏం చెప్పను ..."

ఆమెమాట పూర్తికాకుండానే, "వాళ్ళు కోరినట్టు నీ విక్కడ వుండకపోతే—నీ ప్రవర్తనమీదింకా వాళ్ళు అనుమానపడాల్సి వస్తుంది," అన్నాడు జహర్.

శ్రీమతి నవ్వి, "అనుమానాలకేంలే. మరయితే... ఇక యిప్పు డేం చేస్తావ్ నువ్వు?" అని అడిగింది.

"చాలా చిత్రంగావుందీ ప్రశ్న. నేనిక ఏం చేయబోయేదీ, ఎక్కడెక్కడికి వెళ్ళేదీ, ఆ జాబితా అంతా తెలుసుకున్నందువల్ల నీకొచ్చే లాభమేమిటి? చేయ

వొదులు. లే, ఎవరన్నా గదిలోకి రావొచ్చు. ఇద్దర్నీ ఇలా కూర్చునివుండటం చూసి..."

"చూస్తే చూడనీయ్. ఏం ఫర్వాలేదు. నువ్వు ఏం చేయదలుచుకున్నదీ చెప్పనే లేదు," అన్నది శ్రీమతి. జహర్ ఏమీ మాట్లాడలేదు.

"ఏం చేయను, కొన్నిరోజులపాటు నేనిక్కడే వుంటాను. ఆతర్వాత మెల్లిగా మా నాన్న దగ్గరికి వెళతాను. అక్కడికి వెళ్ళింతర్వాత ఎప్పుడైనా నువ్వు కన్పిస్తావా?" అని అడిగింది శ్రీమతి.

"ఎందుకూ?" అన్నాడు జహర్ తల పైకెత్తి.

శ్రీమతి ఏమీ తొణక్కుండా మామూలు ధోరణిలో, "ఎందుకలా చిర్రుబుర్రులాడుతుంటావ్? అక్కడికి కొకవేళ రాకపోయినా నేనేమంటాను. నీమీద ఫిర్యాదేమీ చేయబోవటంలేదు, గాభరాపడకు," అన్నది.

జహర్ మెదలకుండా వూరుకున్నాడు. శ్రీమతి జహర్ క్రాఫును ఆప్యాయంగా వేళ్ళతో దువ్వుతూ, "నే నిలా అడుగుతున్నానని ఏమీ ఎగతాళి చేయవుగదా?" అన్నది.

"ఏవిటది?" అన్నాడు జహర్.

శ్రీమతి ఎంతో ఆపేక్షగా అతడి కళ్ళల్లోకి చూస్తూ, "ఒకటి అడుగుతాను, నిజం చెబుతావా?" అన్నది.

"శిష్యురాలితో అబద్ధం చెబుతానా?"

"సరే, ఇంతకీ నీ ఆఖరిగమ్యం ఏమిటి?"

"మానవులందరికీ ఆఖరిగమ్యం మృత్యువే!" అన్నాడు జహర్.

"అవును, అది మాట ఒకటోది. నేనడిగేది అంతకు ముందుండేది. నాతో నెంబరుది, తెలిసిందా?"

"ఓహో, అదా! అది కేవలం నీలాంటివాళ్ళు నువ్వే బైటపెట్టుకోవటం తెలుసా? లోకంలో చాలామంది ఆడాళ్ళు యిలాగే వ్యవహార కౌశలం లేక... సరే, పోనీయ్, అదెందుకిప్పుడు. తమ భవిష్యత్తు ఎలావుంటుందో ఎవరికన్నా తెలుసా? నీ విధి నిన్నెక్కడికి తీసుకువెళుతుందో, నీకసలు తెలుసా?" అని ప్రశ్నించాడు జహర్.

శ్రీమతి నవ్వుతూ, "ఈ డొంకతిరుగుడు మాటలకేంగాని, ఇంతకూ నీకు సంసారంమీద ఆపేక్షనేది వుందా లేదా చెప్పు?" అని అడిగింది.

"నా నుంచి ఆ విషయం తెలుసుకోవాలని నువ్వింతగా తల పగలకొట్టుకునేందుకు కారణం ఏవిటీ?"



"ఏమీలేదు, వట్టి కుతూహలం. ఆడవాళ్ళ మనస్తత్వాలూ, వాళ్ళ కుతూహలాలూ నీకూ తెలుసుగా ? అంతే."

"ఐతే సరే, సంసారంమీద నాకు చెప్పలేనంత ఆపేక్షవుంది, శ్రీమతీ. సంసారివి కావాలనీ, నలుగురిలాగే గౌరవంగా బతకాలనీ ఎందుకుండదు ?"

"అటువంటప్పుడు అలా ఎందుకుండకూడదు ?"

జహర్ మెదలకుండా పుస్తకంకేసి చూస్తూ వూరుకున్నాడు.

"నా ప్రశ్నకి సమాధానం చెప్పవేం ? ఇదేనా సంసారం చేసుకునేవాడి పద్ధతి ?" అంటూ శ్రీమతి అతడి తలను వూగిసలాడించింది.

జహర్ తలపైకెత్తి ఆమె ముఖంలోకి ఉదాసీనంగా చూసి నవ్వి, "మనసులో వున్నంతమాత్రాన అవుతుందా ? బావుంది. ఏంచెప్పను ?" అన్నాడు.

"నేను ఫలాని కారణంవల్ల సంసారివి కాలేకపోతున్నానని చెప్పరాదూ ? భయ

మెందుకు ... అలా సిగ్గుపడతావేం? ఏదన్నా భగ్న ప్రేమ జరిగిందా ఏం?" అన్నది శ్రీమతి.

"నువ్వు పరాయి స్త్రీవి. నా వ్యక్తిగత విషయాలు తెలుసుకోవాలన్న అంత కుతూహలం నీకెందుకు, శ్రీమతీ?" అని అడిగాడు జహర్.

శ్రీమతి ఆ ప్రశ్నకు బదులుచెప్పకుండా తలవంచుకుని లేచి నిలబడింది.

"ఇవాళ ఎందుకనో నీ మాటల్లో, నీ ప్రవర్తనలో విలక్షణమైనది లేకుండాపోయింది. ఎదటివారిని విసిగించే ఆత్మీయతకూడా కనబడుతున్నది. అకస్మాత్తుగా యిలా ఎందుకు మారిపోయావో నేనూహించలేకుండా వున్నాను," అన్నాడు జహర్.

శ్రీమతి అతడికేసి నవ్వుతూ చూసి, "అయితే నన్ను గురించి నువ్వేమనుకుంటున్నావేం?" అని ప్రశ్నించింది.

"నామీద నువ్వు చూపిస్తున్నదంతా నిజమైన ప్రేమ కాదు. అందులో కొంత జాలీ, కొంత సానుభూతీ, దయా కలిసున్నాయి. సరేలే, యిప్పుడా సోదంతా ఎందుగ్గాని, నువివాళ ఎందుకిలా మారిపోయావు? అసలిదంతా నీ మనసులోకి ఎందుకొచ్చింది?" అని అడిగాడు జహర్.

"ఇవాళ నిన్నొదిలిపెట్టాల్సి వస్తుందికదూ, అందుకని అనుకుంటాను. నువు చెప్పకపోయినా నీ మార్గమేదో నాకు స్పష్టంగానే కనిపిస్తున్నది. ఆ మార్గంలో నీకెక్కడా నీడనేదే లేదు," అని శ్రీమతి కొంచెంసేపు వూరుకుని, "వస్తానుండు," అని చిన్న నిట్టూర్పు వొదలి గదినుంచి బయటకి వెళ్ళింది.

నాలుగైదు నిమిషాల తరవాత శ్రీమతి, రమను వెంటబెట్టుకుని జహర్ దగ్గరకు వచ్చింది. రమ గదిలోకి వస్తూనే, "మాష్టారూ, వెళ్ళిపోతున్నారా?" అని అడిగింది. జహర్ తలవూపాడు.

రమ జహర్‌కి నమస్కరించి, "మా అక్కయ్యకి మిమ్మల్ని మించిన బంధువు లెవరూ లేరు. ఆపదలన్నీ ఆమెను చుట్టుకుని భయంకర పరిస్థితులు కల్పించినప్పుడు, మీరామెని ... మీరు చేసిన సహాయం మీముందు చెప్పటం బావుండదు. కానీ మీరు మళ్ళీ ఎప్పుడువచ్చేదీ చెప్పి వెళ్ళండి, అదిచాలు మాష్టారూ," అన్నది.

"ఎప్పుడొస్తానని చెప్పమంటావ్. ఎప్పుడో వీలైనప్పుడు వస్తాను," అన్నాడు జహర్.

"మీరు మరికొన్నాళ్ళు ఆ ఇంట్లోనే వుండండి. ఏదో మునుపు పోయినట్టు, పెద్ద ఇబ్బందులేమీ లేకపోతే తొందరపడి ఆ ఇల్లు ఖాళీచెయ్యకండి. వింటున్నావు కదూ?" అన్నది శ్రీమతి.

జహర్ బుద్ధిమంతుడిలా తలాడించాడు శ్రీమతి అతడికి సాష్టాంగంగా నమస్కరించి, పాదధూళిని శిరస్సున పెట్టుకున్నది.

"వారిని పిలుచుకువస్తానుండండి," అని చెప్పి రమ బైటికి వెళ్ళిపోవటంతోనే, శ్రీమతి ఓసారి అటూ యిటూచూసి, జహర్ పాదధూళి తీసుకున్న చేతిని మళ్ళీ అతడి తలమీదే పెట్టి గబగబా రాచింది. అంతలో విమలబాబు, రమా గదిలోకి వచ్చారు.

జహర్, శ్రీమతిని అతడికి చూపుతూ, "మా శిష్యురాలిని విచారంలోనించి తప్పించి, కళకళలాడేటట్టు సంతోషపరచి వెళ్తున్నాను కొంచెం జాగ్రత్తగా చూస్తుండండి, వెస్తాను," అని అందరివద్దా సెలవుతీసుకుని బైటికి వెళ్ళాడు

# 5

రెండురోజులపాటు జహర్ నగరంలో అక్కడా యిక్కడా తిరిగాడు అతడి మనసులోవున్న బరువు భారమంతా దిగిపోయి ప్రాణానికి హాయిగా వున్నది. శ్రీమతిని గురించి రెణ్ణాళ్ళకిందటివరకూ అతడికెంతో దిగులుగావుండేది. ఆమె భవిష్యత్తేమిటి? ఆమె మంచిచెడులు ఎవరు చూస్తారు? ఎవర్ని నమ్ముకుని శేష జీవితం వెళ్ళమారుస్తుంది? ఈ రకమైన అతడి ఆలోచనలకూ, భయాలకూ దేవుడిలా విమలబాబు అడ్డుపడి, ఆమెను ఆదుకుని తనను రక్షించాడు ...

ఈ గడిచిన రెండురోజుల్లో జహర్ అనుకోకుండా ఒక స్నేహితుడి చెల్లెలు పెళ్ళికి వెళ్ళి, అక్కడ వచ్చిన చుట్టపక్కాలను తనకు చేతనైన మేజిక్‌తో ఆనంద పరిచాడు. ఒక రాత్రి జోరున వర్షంలో తడిసి, తను చిన్నప్పుడు విద్యాభ్యాసం చేసిన స్కూలుతాలూకు పూరిపాకలో రాత్రంతా గడిపాడు. చివరకతడికి తాము అద్దెకు తీసుకున్న ఇంటికోమారు వెళ్ళిరావాలనిపించింది.

జహర్ కాంసారి పాడాలోని ఇంటిముందుకు రాగానే, ఇంటి యజమాని పెద్ద కొడుకు, "రండి, రండి. రెండు రోజుల్నుంచి కనబడటమేలేదే. మీ ఆడవాళ్ళు నిన్న వచ్చి వెళ్ళారు. ఇంటి తాళంచెవి యిస్తూ, ఒక ఉత్తరంకూడా మీకివ్వమని యిచ్చివెళ్ళారు ... వుండండి తెస్తాను," అంటూ ఇంట్లోకి పోబొయ్యాడు.

జహర్ అతణ్ణి ఆపి, "ఇంకేమన్నా చెప్పివెళ్ళిందా? ఎలావుంది?" అని అడిగాడు.

"ఏమీచెప్పలేదు. కారులో వచ్చారు. మొహంలో గాభరా, దిగులూ కనబడు తున్నై. ఏదో పెద్ద ఆపదలోవున్నట్టు కనిపించారు," అన్నాడు యజమాని కొడుకు.

అతడు ఇంట్లోకి పోయి తాళంచెవి, ఉత్తరం తెచ్చివ్వగానే జహర్ ఇంటి కలుపుతెరిచి లోపలికివెళ్ళి, కవరుచించి వుత్తరంతీసి చదువుకున్నాడు.

"ప్రియబంధూ!

మళ్ళీ కలుపడతావనుకున్నాను కానీ, నీ దర్శనం కాలేదు. ఒకవేళ నీకు తీరి కనేది లేకండా వున్నదేమో ననుకుంటాను తాళంచెవి నాదగ్గిరే వుండిపోయింది. క్షమించు ... కాయితంమీద పెట్టేందుకు వీల్లేని పెద్ద ఆపద వొకటి వచ్చిపడినందున విమల్‌వాళ్ళ యింటిదగ్గిర్నుంచి యివాళే వెళ్ళిపోతున్నాను నువ్వీ ఉత్తరం చూడటంతోనే, యీ క్రింది అడ్రసుకు తప్పకుండా రా అశ్రద్ధ ఎంతమాత్రం చేయవద్దు

—శ్రీమతి"

జహర్ ఉత్తరం చదివి ఆలోచనలోపడ్డాడు ఆమె ఇంటికి అంత హడావిడిగా వెళ్ళవలసిన అవసరం కనబడలేనతడికి ఆ ఆపదేదో వచ్చి ఇరవైనాలుగ్గంటల యింది ఆమె దాన్నుంచి బయటపడేవుంటుంది సందేహం లేదు వెళ్ళకపో యినా ముందుకుపోయే దేమీలేదు, అనుకుంటూనే అతడు ఇంటికి తాళంవేసి, వెతుక్కుంటూ సర్క్యులర్ రోడ్డులో వున్న ఓ పెద్ద మేడముందుకు వచ్చి ఆగాడు

అప్పటికి సాయంకాలమైంది జహర్ నెమ్మదిగా గేటుదాటి లోపలికి వెళ్ళి, బంట్రోతుద్వారా కబురు పంపించి, ఉదాసీనంగా నాలుగువేపులా చూస్తూ నిలబడ్డాడు. ఆ పెద్ద మేడచుట్టూ వున్న తోటా, మేక కట్టబడిన తీరూ, దాని చుట్టూవున్న చెట్లూ, పూలతోటా చూస్తూంటే, అతడికి శ్రీమతి యిక్కడి కెందుకొచ్చిందా అన్న అనుమానం కలిగింది. ఈ ఇంటికీ ఆమెకూ వున్న సంబంధం ఏమిటాఅని ఆలోచించసాగాడు

ఇంతలో శ్రీమతి హాల్లోకి వస్తూనే, "నిన్న యింటికివెళ్ళలేదా?" అని అడిగింది

సుదీర్ఘమైన ఒక యుగానంతరం, ఎంతోకాలంగా ఆరాధిస్తున్న దేవత ప్రత్యక్షమైనట్టు, జహర్ ఆమెను రెప్పవాల్చకుండా చూసి, ఆదుర్దాగా, "లేదు, ఇంతకు ముందేవెళ్ళి నీవుత్తరం చూసుకున్నాను. ఇంతకీ నువురాసిన ఆ ఆపదఏదో తొలిగి పోయిందా?" అని అడిగాడు

"ఆ ఆపద పోయిందిలే, లోపలికిరా," అంటూ దారితీసింది శ్రీమతి

రెండో అంతస్థులోని హాల్లోకి వచ్చాక, జహర్ తనంతటతానే వెళ్ళి ఓకుషన్ కుర్చీలో కూచుని, "ఇంతకూ నీకు వచ్చిన ఆపదేమిటి?" అని అడిగాడు

"నిన్న మా నాన్నగారు పోయారు," అన్నది శ్రీమతి తాపీగా.




"ఏవిఁటీ, చనిపోయారా? నిన్ననా? నిన్నటివరకూ మీ నాన్నగారు బతికే వున్నారన్న సంగతి నాకు తెలీదు," అన్నాడు జహార్ ఆశ్చర్యపడుతూ

"ఆఁ, నిన్న సరిగా యిదేసమయ మప్పుడు ఆయన పోయారు మా అమ్మ చిన్నప్పుడే పోయింది ఆమె పోవటం నాకు తెలీదు నాన్నతోపాటు అమ్మకూడా నిన్ననే పోయినట్టు నా కనిపిస్తున్నది," అన్నది శ్రీమతి

"తల్లిదండ్రులు శాశ్వతంగా ఎప్పుడూ వుండరు, శ్రీమతీ! ఈ ప్రపంచంలోకి వచ్చేప్పుడు మనం ఒంటరిగానే వచ్చాం, ఒంటరిగానే పోతాం రోజూ యీ ప్రపంచంలో..."

జహర్ మాటకు శ్రీమతి అడ్డొచ్చి, "నిన్నటినుంచీ యిలాంటి ఓదార్పు మాటల్తో నేను ఉక్కిరి బిక్కిరై పోతున్నాను ఒక మహాకావ్యానికి సరిపోయేంతగా అవి వున్నాయి కనీసం నువ్వయినా ఆ ఓదార్పుమాటలు మానరాదూ?" అన్నది.

ఆమె యిట్లా మాట్లాడుతుందని జహర్ వూహించలేదు ఆపదలోవున్న స్త్రీ యీ విధంగా మాట్లాడటం అతనింతవరకూ వినివుండక పోవటంతో, కరెంట్ షాక్ తిన్నట్టయి, కొంచెంసేపాగి, "ఈ ఇంట్లో ఇంకెవరూ లేరా ఏం?" అని అడిగాడు

"ఊహుఁ, నాన్నగారొక్కరే వుండేవారు. మా అమ్మ పోయాక ఆయన మళ్ళీ పెళ్ళిచేసుకోలేదు నా సంసారం, ఆనందం ధ్వంసమై పోయాయని తెలిసి ఆయన దిగులుపడతారని, నేను చాలాకాలం యిక్కడికి రాలేదు. మూడు సంవత్స

రాల తర్వాత మళ్ళీ యీ ఇంటి గుమ్మంలో కాలుపెట్టాను కాని, నాన్నను బతికించుకోలేక పోయాను," అన్నది శ్రీమతి

"చనిపోయేముందు నువ్వాయన్ని చూశావుకదూ? ఎంత సేపటికి పోతారనగా యిక్కడికి వచ్చావు?" అని అడిగాడు జహర్

"ఏం చెప్పను. నేనాయన్ని చూడటం, నన్నాయన చూడటం జరిగింది కాని, అప్పటికే ఆయనకు మాట పడిపోయింది రెండు రోజులపాటు ఆయనకు స్పృహ లేదట స్పృహ రావటంతోనే ఆయన తనకున్న స్థిరాస్తి చరాస్తి మొత్తం, నా పేర వీలునామా రాయించారట"

"మీ నాన్నగారు నీ మీద చాలా పెద్దభారం మోపి పోయారు నీకుబాగా దగ్గర బంధువులంటూ ఎవరూ లేరా?" అని అడిగాడు జహర్

"ఎవరూ లేరు వుంటే యీ జీవితం కొంతవరకు బాగుపడేది అందువల్లే యీ ఆస్థిపాస్థుల భారాన్నంతా మోయటం నా ఒక్కదానివల్ల కాదని ఆలోచిస్తున్నాను," అన్నది శ్రీమతి

"ఒకవేళ నీ భర్త తనతప్పు తెలుసుకుని, పశ్చాత్తాపపడి నీ దగ్గరకొచ్చి క్షమించమని కోరుతాడే అనుకో- ఎందుకంటున్నానంటే, ఇటువంటి విషయాలు ప్రపంచంలో మామూలుగా జరుగుతూండేవే. లోకానికిది కొత్తేమీ కాదు అందు కని..."

"నీ మాటలధోరణి చూస్తూంటే, నువ్వేదో నన్ను పరీక్షించేందుకు ప్రయత్నిస్తు న్నట్టున్నావు గాని, దయవుంచి అటువంటి ప్రయత్నం మాత్రం చేయకు... అ మనిషిని నీకంటే నేను బాగా ఎరుగుదును- ఈ విషయాలకేంగాని, ఈ మూడు రోజులూ ఉపవాసాలతోనే గడిపావా? మొహం అలా వాడిపోయినట్టుగావున్న దేమిటి?" అని అడిగింది శ్రీమతి

జహర్ మాట్టాడలేదు. మెదలకుండా వూరుకున్నాడు శ్రీమతి హాల్లోంచి బయటికి వెళ్ళింది. జహర్ కిటికీలోంచి బయటికి చూస్తూ కూచున్నాడు. క్రమంగా చీకటి పడసాగింది మేడలోని విద్యుద్దీపాలన్నీ ఒక్కసారిగా వెలిగాయి.

ఓ పావుగంట తరవాత శ్రీమతి జహర్‌వున్న చోటుకువచ్చి, "జరిగిపోయిన సంగతుల్ని గురించి యిప్పుడు మాట్టాడుకోవటంలో ప్రయోజనం ఏమీలేదు. వాటిని గురించి నువ్వివాళ వినకపోయినా ఫర్వాలేదు నీ కిష్టమైతే ఎప్పుడో ఒకప్పుడు వివరంగా చెబుతాను భోజనలగదిలోకి వెళదాం రా," అన్నది.

ఇద్దరూ రెండుమూడు గదులుదాటి, భోజనాల గదిలోకి వచ్చారు. గదిమధ్య

ఆయిల్‌క్లాత్ పరిచిన టేబిల్ ఒకటుంది. దానిమీద పింగాణీ ప్లేటుల్లో రకరకాల పళ్ళూ, మిఠాయిలూ పెట్టివున్నై. భోజనం చేసేందుకు జహర్‌ను అక్కడ కూచో మని చెప్పి, శ్రీమతి గుమ్మం బయటికి వెళ్ళి, "లఖియా!" అని కేకేసింది

ఆ పిలుపు వినటంతో ఒక అమ్మాయి నెమ్మదిగా లోపలికివచ్చి నిలుచుంది. ఆ అమ్మాయి చక్కగా వుంది, కట్టూ బొట్టూ చూస్తే హిందూస్తానీ యువతిలా వుంది చేతులకు రెండు జతల బంగారపు గాజులున్నాయి ఆ అమ్మాయి దగ్గరకు వచ్చి తల వంచుకుని నిలబడటంతోనే శ్రీమతి, "నే నిప్పుడేమీ తినను. షర్బత్ కొంచెంచేసిపెట్టు వీరికి మాత్రం ఓ కప్పు టీ," అని చెప్పింది లఖియా తలవూపి వెళ్ళిపోయింది

జహర్ తల వంచుకుని మిఠాయిలూ అవీ తింటున్నాడు. శ్రీమతి అతడికేసి పరీక్షగా ఓ క్షణకాలంచూసి, "అలా తలవంచుకుని తింటున్నావేమిటి? ఇటుకేసి కొంచెంచూడు అందచందాలుగల ఒకమ్మాయి యీ గదిలోకివచ్చి నేను చెప్పింది విని వెళ్ళిపోయింది ఆ అమ్మాయి తాలూకు మంచి చెడులు వినాలని నీకేమీ కుతూహలం కలగటం లేదా? నువు మగాడివికదా? నీ మనసు మగాడి మనసుగదా?" అన్నది

"ఐనంత మాత్రాన ప్రయోజనం ఏమున్నది? నువన్నట్టు ఒకవేళ అలాంటి కుతూహలం కలిగితే, అది న్యాయమైన కుతూహలం అనిపించుకోదు ఆ మాట కొస్తే, మా కన్న యిలాంటి వాటిల్లో మీ ఆడజాతికే ఎక్కువ కుతూహలాలు కలుగుతాయి," అన్నాడు జహర్.

ముసలి నౌకరొకడు ఆహారపదార్థాల పళ్ళెం తీసుకుని వాళ్ళున్న గదిలోకి వచ్చాడు. అతడి వెనకాలే లఖియాకూడా వచ్చింది ఆమెచేతిలో టీకప్పు ఒకటుంది పళ్ళెం, టీకప్పూ టేబిల్‌మీదపెట్టి వాళ్ళు వెళ్ళిపోయారు శ్రీమతి కొంచెంఆగి చిన్నగా నవ్వుతూ, "ఆ అమ్మాయిపేరు, లఖియా," అన్నది

"ఔను, నువు పిలుస్తుంటే విన్నాను," అన్నాడు జహర్.

"చిన్నతనంలోనే మొగుడు పోయాడు ఆమె బాల్య వితంతువు మానాన్న లక్నోలో వున్నప్పుడు, దానితల్లి మా అమ్మదగ్గిర పనిచేస్తూండేది ఆతల్లీ తండ్రీ చనిపోయేనాటికి యిది చాలా చిన్నపిల్ల మానాన్నే దాన్ని పెంచి పెద్దచేసి పెళ్ళి కూడా చేశారు దురదృష్టంకొద్దీ తరవాత కొద్దినాళ్ళకే దానికి వైధవ్యం ప్రాప్తించింది. మా నాన్న దానికి రెండోపెళ్ళి చేయాలనికూడా ఒకసారి ప్రయత్నించారని విన్నాను "

"భోజనం కావటంతోనే జహర్ టీకప్పుదగ్గరకు తీసుకుంటూ, ఆమెకంటె కూడా ఎందుకూ పనికిరాని దౌర్భాగ్యుణ్ణి నేను అనకూడదుకాని, నాజీవితం ఆడాళ్ళ చరిత్రలు వినటంతోనే గడిచిపోతున్నది," అన్నాడు

"ఆమాట నేను నమ్మను నీగురించి పూర్తిగా తెలుసుకోవలసిన అవసరం చాలా వుంది," అన్నది శ్రీమతి, జహర్ ముఖంలోకి చూస్తూ.

"నన్ను గురించి అంతా నీకు చెప్పాలనే వున్నది కాని, నా జీవితచరిత్ర మాత్రం చాలా లజ్జాకరమైంది, శ్రీమతీ, అది చెప్పుకునేందుకూడా నేను సిగ్గుపడతాను అది నా దైన్యస్థితి," అన్నాడు జహర్

"అవొచ్చు అందులో వంచన అనేది ఏదీ వుండదు ఈ గదిలోంచి పోదాం పద," అంటూ శ్రీమతి బయలుదేరింది

ఇద్దరూ గదినుంచి బయటికి వచ్చి, వరండాదాటి పడకగది ముందుకు వచ్చాక, "లోపలికి రా," అన్నది శ్రీమతి

జహర్ తొట్రుపడుతూ, "ఇప్పటికే చాలా పొద్దుపోయింది ఇవాల్టికి యీ కబుర్లుచాలు ఇక నేను వెళతాను, శ్రీమతీ," అన్నాడు జహర్

శ్రీమతి విస్తుపోతూ "వెళ్తావా? ఇంత రాత్రిపూట ఎక్కడికని వెళ్తావ్?" అని అడిగింది

"ఎక్కడికేముంది, ఇంటికి కాంసారిపాడాలోని ఇంటికి"

శ్రీమతి చిన్నగా నవ్వుతూ, "ఇంకా ఆ ఇంటి బడాయి ఎన్నాళ్ళుంటుం దేం?" అని అడిగింది

"ఉన్నన్నాళ్ళు..."

"నీ కింకా కుర్రతనం పోలేదు అనవసరంగా తిరుగుతూ కాలం గడపటంలో కూడా ఒకపద్ధతంటూ వుండాలి. నీ కలాంటిదికూడా చేతకాదు"

"చేతకాకపోతే పోనీ ... నే వెళ్ళకతప్పదు," అన్నాడు జహర్ మొండిగా.

"వెళ్ళి కాని వీల్లేదని యిక్కడ ఎవరన్నా నీతో అన్నారా?"

ఆ మాటకు జహర్ కోపం తెచ్చుకుని, "అయితే యిక్కడే పాతుకుపొమ్మంటావా ఏమిటి, నువ్వు?" అని అడిగాడు.

"ఔను, ఆమాటే చెప్పాలనుకుంటున్నాను," అని శ్రీమతి విందుగా నవ్వింది

"ఎవరన్నా చూస్తారేమోనని లోకానికి వెరవట మనేదికూడా వుండాలి, శ్రీమతీ!"



''ఆ పొరపాట మనేది నిన్నే పట్టుకుపీడిస్తున్న దల్లేవుంది  చాలాపొద్దుపోయింది ఇంత రాత్రిపూట నువ్వింకేమీ అల్లరిచేయకు బాబూ! ఇలా మారాం చేశావంటే యిక నేను సహించలేను. ఐనా ఏదీ వెళ్లు చూదాం. నీ కెంత వెళ్ళాలని కోరిగ్గా వుందో," అన్నది శ్రీమతి.

"ఐతే, నీ యిష్టంవచ్చినట్లు కానీయ్ ఇదంతా నువు చేసే అత్యాచారం," అంటూ జహర్ ఆమె వెనకనే పడకగదిలోకి వెళ్ళాడు

శ్రీమతి అతడికి ఎత్తయిన మంచంమీద శుభ్రంగా వేసివున్న పక్కచూపిస్తూ, "పొద్దుపోయింది, పడుకో కష్టసమయంలో నా కెంతగానో తోడుపడ్డావు. ఆ రుణం తీర్చుకునేందుకు కాస్త నన్ను పరిచర్య చేయనీయ్  చెప్పు, కాళ్ళు కొంతసేపు వొత్తనా," అన్నది.

"ఛీ, ఛీ, ఇదేమిటి?" అంటూ జహర్ ఎగిరిపడ్డాడు

శ్రీమతి మొహం పక్కకుతిప్పి నవ్వుకుని, "నీ కెందు కంత భయం? లఖియా, నేనూ పక్కగదిలోనే వుంటాం. బ్లూ దీపం వెలిగించుకుని పడుకో ... అదుగో, స్విచ్. ఏదైనా అవసరంవస్తే పిలు," అన్నది.

''ఊహూఁ, అవసరం ఏదీ రాదులే.

''రాకపోవటమే మంచిది. దోమతెరవేసి వెళతాను,'' అంటూ శ్రీమతి నెమ్మదిగా దోమతెర కిందికిదించి, అంచుల్ని పరుపుకిందికి మడవసాగింది.

''మనం చేస్తున్న యీ పనులు తాగుబోతుల చేష్టల్లా కనిపిస్తున్నాయ్. ఇల్లూ వాకిలీ అక్కడున్నాయి వంటకూ వాటికని కొన్నసామానంతా అక్కడే వుంది. ఇంటితాళం బద్దలుకొట్టి అవన్నీ ఎవరైనా ఎత్తుకుపోవచ్చు,'' అన్నాడు జహర్

''సరే, నువ్వన్నట్టు ఎత్తుకుపోయారనుకో, ఎంతనష్టం వస్తుంది?'' అని శ్రీమతి ప్రశ్నించింది.

''ఊహూఁ, వేళాకోళంకాదు, శ్రీమతీ! ఒకప్పుడు మనకవన్నీ ఎంతో అవసరంగా కనిపించాయి అంతేకాదు, ఆ ఇల్లుకూడా మనకొకనాడు ఆశ్రయంగా ఉపయోగించిందన్న సంగతి జ్ఞాపకం వుంచుకో ''

''నువ్వన్నది కాదనను. జరిగిపోయిన కాలంకేసి వెనక్కితిరిగి చూడాలనటం నా స్వభావానికే విరుద్ధం నువన్నట్టు ఆ రోజున ఆ ఇల్లు ఆశ్రయం అయితే, యీనాడు యీ ఇల్లు అంతకన్నా ఎక్కువగా ఆశ్రయమైంది ... ఒకవేళ యీనాడున్న యీ ఆశ్రయంపోయి మళ్ళీ చిక్కుల్లోపడ్డా విచారించను నేను. కాని నువ్వు మాయామమతలకి బాగా లొంగిపోయిన వాడివిలా వున్నావు. ముందు కదుగువేసే శక్తి నీలో వుందికాని, వెనకలాగుడిని మాత్రం వదుల్చుకోలేవు,'' అంటూ శ్రీమతి, జహర్ ముఖంలోకి నిశితంగా చూసింది.

జహర్ మౌనంగా వూరుకున్నాడు

శ్రీమతి కొంచెంసేపు ఆగి, ''నన్నెవరేమి తిట్టినా ఎలా వినిపించుకోనో, అలాగే, ఇది వుంది – ఇదిలేదు, అన్నసంగతినికూడా పట్టించుకోను. సరేలే, వదిలి వచ్చినవాటిని గురించి విచారించటం తెలివితక్కువపని. ఆ విషయం ఇక మర్చిపో,'' అన్నది

''నీ కేం ఎన్నయినా చెబుతావ్. కావలసినంత నీకుంది కాబట్టి ... ఆ కొంచెం సామానుపోయినా నీ కేం బాధవుండదు. ఇంకా ఇథవై అయిదు రోజులపాటయినా తిన్నాతినకపోయినా రాత్రిళ్ళుపోయి హాయిగా పడుకునేందుకు ఆ ఇల్లు నాకు పనికివస్తుంది. వెళ్ళి పడుకుని బాధల్ని మర్చిపోయి నిద్రపోతాను,'' అన్నాడు జహర్.

శ్రీమతి మాట్టాడలేదు. గదికి దక్షిణపువైపు నున్న కిటికీ రెక్కలు తెరిచి అక్కడే నిల్చున్నది శుక్లపక్షపు చంద్రుడు యింతకుముందే అస్తమించాడు. మేడ

ఆవరణలోవున్న పూలతోట మీదినుంచి తేలివస్తున్న కమ్మనిగాలి, మోహాన్నితాకి గదిలోకి వస్తూంటే, నూతన వసంతం యిప్పుడే వచ్చి తమతోటలోని పూలచెట్లన్నిటి మీదా విస్తరించినట్టు ఆమె కనిపించింది రకరకాలా పూలవాసనలు కలిసిన విచిత్ర మైన ఓ మధురసుగంధం మత్తుతోనిండి – ఆమె నిట్టూర్పు వాయువుతో కలిసి, హృదయాన్ని గజిబిజిచేస్తూ ఎక్కడెక్కడికో పరిగెత్తిస్తున్నది

శ్రీమతి చాలా సేపు ఒప్పువాల్చకుండా కిటికీలోంచి అలానే బైటికి చూసి చూసి, చివరకు తనే ఆ గది తలుపులు దగ్గిరగా చేరవేసి బైటికి వెళ్ళిపోయింది.

జహర్ బ్లూలైట్ వెలుగులో, మెత్తని పరుపులమీద పడుకుని ఏవేవో ఆలో చిస్తున్నాడు. ఈ ప్రపంచం నిజంగా ఆనందమయమేనన్న సమ్మకం ఆ క్షణంలో అతడికి కలిగింది అటుమొన్నరాత్రి తాను వానలో తడిసి బురదమయంగా వున్న ఒక పూరిపాకలో పడుకుని నిద్రపోయాడు. మరి ఇవాళ? మెత్తని పరుపుమీద పాలనురగలాంటి తెల్లని పక్క, తృప్తికరమైన రుచిగల భోజనం, విశాలమైన దివ్యభవనంలో చక్కని విశ్రాంతి, చుట్టూవున్న తోటలోనుంచి వచ్చే కమ్మని పూలవాసన, దేవలోకంనుంచి దిగివచ్చినట్టున్న ఓ చక్కని సుందరీమణి – ఇంతకు ముందే తనమీద అలిగి, తనకోసం కొంచెంసేపు నిలబడి, హంసలాగా బైటికి నడిచివెళ్ళటం.. ఏమనాలి?

నిజంగా యీ ప్రపంచం చాలా విచిత్రమైంది! ఎవరి మనసుల్లో ఏముంటుందో, ఎప్పుడు ఏరకమైన ఊహలు మానవులకు వస్తాయో, ఎందువల్ల మానవు లింతగా మారిపోతారో, ఆ మనసుల్ని బంతుల్లాచేసి కోరిక లేవిధంగా ఆడిస్తాయో... ఎవరూ చెప్పలేరు. దీనికి భాష్యం ఎవరు రాస్తారు?

## 6

జహర్‌కు నిద్ర మెలకువ వచ్చేటప్పటికి తూర్పువైపున్న కిటికీలోంచి సూర్య కాంతి గదిలో పడుతున్నది అతడికి రాత్రల్లా సరిగా నిద్రపట్టనందున తలంతా నొప్పిగానూ, బరువుగాను వుంది. అతడు దోమతెరలోంచి బైటికివచ్చి బ్లూలైట్ ఆర్పేశాడు. తరవాత దగ్గిరగా వేసివున్న గదితలుపుల్ని బార్లా తెరిచాడు.

లక్ష్మీ పక్కనున్న మరొక గదితలుపు తెరుచుకుని బయటికి వచ్చి, సబ్బు, తువాలూ బాత్‌రూంలో పెట్టి, "టీ తయారుచేసుకొస్తాను," అని జహర్‌కి చెప్పి గబగబా వెళ్ళిపోయింది.

కొంచెంసేపు తరవాత జహర్ తిరిగి గదిలోకి వచ్చేసరికి అక్కడ ఒక టీ పాయ్‌మీద, టీ రెండుమూడు ప్లేట్లలో టిఫినూ పెట్టివున్నాయి లఖియా ఒక కుర్చీ తెచ్చి వేసింది జహర్ టిఫిన్ తింటూ అంతదూరంలో నిలబడిన లఖియాను, "ఆవిడగారికింకా నిద్ర మెలకువ రాలేదా?'' అని అడిగాడు

''అమ్మగారి సంగతా మీరడిగేది? ఆమెగారు ఇంట్లోలేరు, కారుమీద ఎక్కడికో వెళ్ళారు,'' అన్నది లఖియా.

"నీకు బెంగాలీ బాగావచ్చనుకుంటాను, లఖియా బాగా మాట్లాడుతున్నావ్ ఇక్కడ నీకు జీతం ఎంతయిస్తారేం?" అన్నాడు జహర్

''నేనీఇంట్లో నౌకరీ చేయటంలేదు బాబుగారూ! అసలు నేనీ ఇంటి అమ్మాయినే,'' అన్నది లఖియా

జహర్ టిఫిన్ తిని లేచి గదినుంచి బయటికివచ్చి, ఆపక్కనువున్న ఒక్కొక్క గదినే చూస్తూ ముందుకుపోయి, ఒకగదిలో తెరిచివున్న బీరువాలోంచి కనిపించే పుస్తకాలకేసి చూస్తూ, "లఖియా, యీ పుస్తకాలన్నీ ఎవరు చదువుతారు?'' అని అడిగాడు.

"అవన్నీ నేను చదువుకున్న పుస్తకాలే స్కూలుపుస్తకాలవి," అన్నది లఖియా

"స్కూలుపుస్తకాలా? ఐతే నువిప్పుడు కాలేజీలో చదువుతున్నావా ఏమిటి?" అన్నాడు జహర్ ఆశ్చర్యంగా

"ఆఁ, పోయినసంవత్సరమే కాలేజీలో చేరాను."

"బావుంది, చాలాబావుంది మంచిపని చేశావ్," అని జహర్ స్నానాలగదిలోకి వెళ్ళి, ఓ గంటసేపు హాయిగా స్నానంచేసి బయటికి వచ్చాడు. అసరికి శ్రీమతి తిరిగొచ్చింది జహర్, లఖియా యిచ్చిన కొత్త దుస్తులు వేసుకుని శ్రీమతివున్న గదిలోకి వెళ్ళాడు

శ్రీమతి, జహర్‌ని చూసి నవ్వుతూ, "నేనెప్పుడూ అనుకోలేదుసుమా! అచ్చంగా రాజులా తయారయావ్," అన్నది.

"ఇప్పటివరకూ కనిపించలేదు, ఎక్కడి కెళ్ళావ్?" అని అడిగాడు జహర్.

శ్రీమతి, జహర్‌కు కుర్చీచూపి, తాను సోఫాలో వెల్లకిలా వాలి పడుకుని, "అవసరం అయిన పనులమీద వెళ్ళాను కొన్ని పనులుమాత్రమే అయినై. అన్ని పనులూ గుమాస్తా ఒక్కడే చేయలేడు-ఇంకోసంగతి, మనం అద్దె అడ్వాన్సుగా

యిచ్చివుంచిన కాంసారిపాడా లోని ఇల్లు ఖాళీచేసేశాను అదింకా మనకిందే వున్నం దున మన కొచ్చేదేమిటి." అన్నది

"నా కున్నదారులన్నీ ఒక్కొక్కటిగా మూసేస్తున్నావు. శ్రీమతీ నేనీ ఇంటిని వదిలిపెట్టి వెళ్ళటం నీ కేమాత్రం యిష్టంలేదనుకుంటాను " అన్నాడు జహర్ బాధగా

"అవును, ఇక్కణ్ణించి నువ్వెందుకు వెళ్ళాలి? మూర్ఖంగా యిక్కణ్ణించి కాలు కదిపావంటే. ఎడారిలోకి వెళ్ళి పడతావు " అన్నది శ్రీమతి

"లేదు శ్రీమతీ నువు నాచేత ఎలాంటి పొరపాటుపనీ చేయించకు. స్వేచ్ఛగా ఎగిరే పక్షిని బంగారుపంజరంలో కట్టిపడవేయకు కామినీ కనకాలే మనిషికి ఎన్నో అనర్థాలు తెచ్చిపెడుతున్నై అవిమాత్రం నన్నంటకూడదు," అన్నాడు జహర్

"సరే. కనకమంటే అర్థంచేసుకున్నాను, మరి కామిని ఎవరు? నేనేనా?" అని అడిగింది శ్రీమతి

"అఁ నువ్వే అలా అని చెప్పటానికి నా కెలాంటి అభ్యంతరమూలేదు నీ సౌందర్యం, అందచందాలు, మాటలు, చూపులు నన్ను నిశ్చింతుణ్ణి చేస్తాయి, ముగ్ధుణ్ణిచేస్తాయి కాదనను కానీ అలాంటి స్థితిమాత్రం నేను కోరటంలేదు ''

"అందుకనే నీకిన్ని కష్టాలు వీటినుంచి ఒడ్డుకు చేరుకోగలిగినంత విశాల హృదయం, ధైర్యం నీకు లేవు అటుపోదామా, అటుపోదామా, ప్రేమించుదామా, మానుదామా, లోకంలో అన్నింటినీ బాగుచేదామా, ఉన్నవాటన్నిటిని ధర్మం చేదామా — అని నీ మనసెప్పుడూ రెండు పడవలమీద కాళ్ళుపెడుతూనే వుంటుంది ఈరకమైన సమస్యలతోనే నీకిన్ని కష్టాలు ప్రేమకోసం పరుగెత్తుతావు, కాని నీకు ప్రేమమీద ఏమాత్రం గౌరవంలేదు నువ్వేపనీ చేయలేవు, ఏపనీ చేతకాని వాడివి. వీరుడివీకాదు, విద్రోహివీకాదు అనకూడదుకాని, విధాతసృష్టించిన ఒక్క మూతి పిందెలాంటివాడివి," అన్నది శ్రీమతి గుక్కతిప్పుకోకుండా

జహర్ ఏమీ మాట్లాడలేదు అంతా తలవంచుకునే వింటూ కూర్చున్నాడు

"ఏం మాట్లాడవ్?' అని శ్రీమతి అడిగింది

జహర్ తలఎత్తి, "చాల్లే, యిక తిట్టకు, ఆపు," అన్నాడు.

"ఇవి తిట్లుకావు, నీ గురించిన విమర్శ ''

''విమర్శేకాని, ముఖ్యవిషయాన్ని వదిలేసి వ్యక్తిగత దూషణచేసే విమర్శకు ల్లాంటి విమర్శ యిది ఆ విమర్శకుల లక్ష్యం, నీ లక్ష్యం ఒకటే,'' అన్నాడు జహర్

సరిగా ఆ సమయంలోనే లఖియా గదిబయట నుంచుని, "భోజనం తీసుకురమ్మని చెప్పనా, అమ్మగారూ!" అని అడిగింది.

"ఆఁ వస్తున్నా లఖియా లే, పద. బాగా పొద్దెక్కింది ముందు భోజనం చేయి పీతో మాట్లాడాల్సిన విషయాలు యింకా చాలావున్నాయి పద," అంటూ శ్రీమతి విట్టూర్చి సోఫాలోంచి లేచింది జహర్‌కూడా కుర్చీలోంచి లేచి నిలబడ్డాడు.

జహర్ మొత్తంమీద ఎంత ప్రయత్నించికూడా శ్రీమతి పట్టుదలవల్ల అక్కడే వుండిపోవలసివచ్చింది. ఆమె తన తండ్రికి చేయవలసిన శ్రాద్ధకర్మలన్నీ ఏలోపం లేకుండా చాలా ఆడంబరంగానే జరిపించింది అందుకోసం వచ్చిన బంధుగణంతో మూడురోజులపాటు ఆ మేడ చాలా సందడిగా వుంది తరవాత ఒకరొకరే వచ్చిన బంధువులంతా వెళ్ళిపోయారు.

శ్రీమతి జహర్‌ను లఖియాకి మేష్టరుగా నియమించింది మొదట్లో ఆమె అతడికి యిందుగ్గాను జీతం యిచ్చేందుకు ఒప్పుకోలేదు కాని, జహర్ తాను జీతం లేకుండా లఖియాకు చదువు చెప్పనని మొండికెత్తాడు శ్రీమతి జీతం యివ్వటానికి ఒప్పుకున్నది. జహర్ ప్రొద్దున ఒకగంట రాత్రి ఒకగంట లఖియాకు చదువు చెప్పాలని నిర్ణయించింది, శ్రీమతి.

జహర్‌కి ఆ ఇంట్లో ఎంతోగౌరవం ఏర్పడింది అతణ్ణందరూ, 'మాష్టార్‌సాబ్' అని పిలిచేవాళ్లు పనివాళ్ళ సలాములు, దాసదాసీల దణ్ణాలు, గుమాస్తాలు చూపించే ఆదరపూర్వకమైన మర్యాదా-ఇవన్నీ అతడికి వున్నతమైన స్థానాన్ని ఏర్పరిచాయి. ఉదయం, సాయంత్రం ఆంగ్లోయిండియన్ డ్రైవర్ అతణ్ణి కారులో షికారుకు తీసుకుపోతూండేవాడు

ఒకరోజున మాటల సందర్భంలో జహర్, శ్రీమతిని, "డబ్బుకు సంబంధించిన వలహా లేమీ నన్నడగొద్దు అటువంటివేమీ నాకు తెలీవు ఐతే, నువ్వీ ఇంటిని ఆడవాళ్ళ ఆస్పత్రిగానో, స్కూలుగానో మార్చబోతున్నావని విన్నాను, నిజమేనా," అని అడిగాడు.

"ఔను, నిజమే," అన్నది శ్రీమతి నవ్వుతూ

"చాలాబావుంది, మంచి వుద్దేశ్యమే అలా అయితే యీ సంపదంతా ఇటువంటి పనులకోసం ధ్వంసం కావలసిందేనా?'' అన్నాడు జహర్.

"రెండుమూడు తరాలవరకూ పదిపన్నెండు కుటుంబాలవాళ్లు కూచునితిన్నా తరగని ఇంత ఆస్థి పెట్టుకుని నేనొక్కదాన్నీ చేసేదిమాత్రం ఏముంది?'' అన్నది శ్రీమతి

''ఉన్నదంతా యిలా వెదజల్లింతర్వాత, మరి నీ స్థితి ఏమవుతుందో ఆలోచించావా?'' అని అడిగాడు జహర్.



"అదా నీ విచారం ఎవరికోసం నేనీ ధర్మకార్యాలన్నీ చేయబోతున్నానో వాళ్ళే చివరికి నాకింత తిండీ బట్టా యివ్వరనా నీ భయం?" అన్నది శ్రీమతి

"నా భయం అదే వాళ్ళ వల్ల గౌరవంపొందటం ఎంత తేలికో, అగౌరవం పొందటంకూడా అంత తేలికే," అన్నాడు జహర్.

"అంత దరిద్రమే అనుభవించాల్సివస్తే, ఎక్కడైనా దాసీపని చేసుకుంటే కాలం వెళ్ళమారిపోతుంది," అన్నది శ్రీమతి.

"ఆఁ ఆదీ, అలా చెప్పు! కష్టపడి సంపాయించిన డబ్బుతోనే బతకదలిస్తే, నువ్వింత బ్రహ్మాండమైన త్యాగం ఎవరికోసం, ఎందుకోసం చేస్తున్నట్టు?" అని అడిగాడు జహర్.

"బ్రహ్మాండమైన త్యాగం అని హేళనచేయకు నాకు సక్రమించినదాన్ని బుద్ధి

పూర్వకంగా పొదుపు కుంటున్నాను. నాకున్నదంతా ఆడవాళ్ళ శ్రేయస్సుకోసం ఖర్చుపెట్టబోతున్నాను." అన్నది శ్రీమతి

"ఆడవాళ్ళమీద నీకున్న యింత దురభిమానం చూస్తుంటే, చాలా ముచ్చట వేస్తున్నది ఎందుకనో నువ్వివాళ నాకు చాలా నచ్చావు. పద కాసేపు అలా అలా తిరిగివద్దాం ఆ వాద ప్రతివాదాలేవి(టో కార్లో కూడునే చేసుకోవచ్చు." అన్నాడు జహర్.

ఇద్దరూ కార్లో బయలుదేరి టాలీగంజ్ అంతా తిరిగి, ఓ చిన్న వీధిలోంచి 'లేక్' ప్రాంతానికి వచ్చారు అక్కడ యిద్దరూ కారుదిగి జలాశయాన్ని సమీపించారు. సంధ్యాకాంతులు నీటిమీద పడటంతో జలాశయం అంతా మిలమిలా మెరిసి పోతున్నది శ్రీమతి, జహర్ పక్కనే నీటిఒడ్డున కూర్చుని పాదాలను నీటిలోకి జార్చింది.

జహర్ అస్తమించే సూర్యునికేసి కొంచెంసేపు చూసి, శ్రీమతితో, "నీళ్ళ లోంచి కాళ్ళుతియ్. శ్రీమతీ! ఏవైనా కరుస్తాయేమో" అన్నాడు శ్రీమతి కాళ్లను పైకి తీసింది

జహర్ ఆప్యాయంగా ఆమె చేయిపట్టుకుని, "నీకు జ్ఞాపకంవుందో లేదో నాకు తెలీదుకాని, కాంసారిపాడాలోని గదిలో మనం వున్నప్పుడు, ఒకసారి నీ సిల్కుచీర కొద్దిగా నా శరీరానికి తగిలింది. నా హృదయంలో నలుమూలలా వేణు నాదం మోగింది నా జీవితానిక్కూడా విలువనేది వుంది నే నీ లోకంలోనుంచి అనుభూతులు పొందవలసిందే. అని గట్టిగా అనుకున్నాను," అంటూ తన ధోవతి కుచ్చెళ్ళతో ఆమె పాదాలు మెల్లిగా తుడిచాడు ఉద్రేకంతో అతడిచేయి వణికింది

"ఎంత అదృష్టం నాది నా జన్మ తరించింది హఠాత్తుగా యివ్వాళ పాదాల మీద చేయివేశావే!" అంటూ శ్రీమతి నవ్వింది

"పాదాలమీద తడిఆరలేదు, జలుబుచేస్తుందని పంచెతో అద్దాను," అన్నాడు జహర్.

"అహా(, అలానా! నేవింకోవిధంగా అనుకున్నారే ఆడవాళ్ళ ఒంటిమీద చేయి వేయకుండా పాదాలమీద చేతులువేసే మగాళ్ళు చాలా గడుసువాళ్ళని అంటారు. సరేలే, ఆడాళ్ళ చెవినపడకుండా నీకో రహస్యం చెబుతా విను. నన్ను ముగ్ధురాల్ని చేసేందుకు, ఆకర్షించేందుకు అన్నిటికన్నా తేలికైన ఉపాయం నా పాదాలమీద చేతులువేయటమే!" అంటూ శ్రీమతి నవ్వింది.

చల్లని గాలి మెల్లగా ఆ ఇద్దరి హృదయాలనూ తాకుతూ పోతోంది. వాలుగు

వేపులా పాలమీగడలాంటి చక్కని వెన్నెల కాలం ఏవిధంగా దొర్లుకుంటూ పోతు న్నదీ, ఆఇద్దరిలో ఎవరూ గమనించనేలేదు ఎదురుగావున్న నీటిలో చంద్రబింబం ప్రతిఫలించి, ఆ కాంతికి ఇద్దరి ముఖాలూ ఉజ్వలంగా ప్రకాశించాయి. శ్రీమతి జుట్టుముడి వూడి జహర్ ఒళ్ళోపడింది

చాలా సేపటిగ్గాని వారికీ తన్మయత్వం వదల్లేదు

"అం చాలా పొద్దుపోయింది!" అంటూ శ్రీమతి గంగబా లేచి సరిగ్గా కూచుని, "నీకసలు మంచీ చెడూ, బుద్ధీ జ్ఞానం అనేవి లేవు నా జుట్టుముడి వూడతీశావేం?" అన్నది

"ఆడాళ్ళ జుట్టంటే నాకెంతో యిష్టం," అని జహర్ నవ్వాడు

తలవెంట్రుకలు రెండు చేతుల్తోనూ సరిచేసుకుని, మళ్ళీ ముడివేసుకుంటూ, వున్నట్టుండి జహర్‌ని కొంచెం తోసి, "నీకోసమని నేనుకూడా సిగ్గును వొదిలిపెట్టు కున్నాను నా అదృష్టం మంచిదై యీ సమయంలో చుట్టుపక్కల ఎవరూ లేకుండా పోయారు," అన్నది శ్రీమతి

"లేరని ఎవరన్నారు? నువ్వనుకుంటున్నావ్, అంతేనా! ఒకవేళ ఎక్కడైనా కాలేజీ కుర్రాళ్ళు దాక్కుని చూస్తున్నారేమో!" అన్నాడు జహర్

"ఛీ ఛీ ఆమాటలకేం, లే వద ఒకపక్కన తెల్లారుతోందల్లేవుంది," అంటూ శ్రీమతి లేచి నిలబడింది పాలసముద్రంలాటి వెన్నెలతో నిండిన ఆరాత్రి, వాళ్ల నడిచేవారివైపు నవ్వుతూ చూస్తోంది

# 7

నెలరోజులు యిట్టే గడిచిపోయాయి శ్రీమతి స్థాపించనున్న ఆస్పత్రి, స్కూలూ వగైరాకోసం భవనాలు కట్టేస్తున్నారు డాక్టర్లు, నర్సులు, ఇంజనీర్లు, కంట్రాక్టర్లు మొదలైనవాళ్ళంతా వచ్చి శ్రీమతితో మాట్లాడిపోతున్నారు బ్యాంకు నుంచి శ్రీమతి డబ్బుతెప్పిస్తున్నది, అది మంచినీళ్ళ ప్రవాహంలా ఖర్చయి పోతున్నది

వార్తాపత్రికలు శ్రీమతి త్యాగాన్ని గురించి మొదటిపేజీల్లోనే పెద్ద పెద్ద అక్షరాల్తో గొప్పగా ప్రచురిస్తున్నాయి స్కూలు పెట్టబోతున్నారని తెలిసి ఉపాధ్యా యులు, విద్యార్థులు దరఖాస్తులు పంపుకుంటున్నారు. పెద్దలైనవారు, పూజ్యులైన వారు శ్రీమతికి అభినందనలూ, ఆశీస్సులూ, అమూల్యమైన సలహాలూ పంపు తున్నారు.

జహర్ మాత్రం యీ హడావిడి ఏమీ పట్టించుకోకుండా కొన్నాళ్ళు దూర దూరంగా తిరిగి, ఒకనెల జీతం పుచ్చుకుని ఎక్కడికో వెళ్ళిపోయాడు ఇక్కడ వుంటే అతడికి తిండీ తిప్పలకు బాధవుండేదికాదు ఎక్కడికి వెళ్ళాడో, ఎందుకు వెళ్ళాడో, ఎవరిమీద కోపంవచ్చి వెళ్ళాడో ఎవరికీ తెలీదు.

వారం గడిచింది ... రెండువారాలుకూడా గడిచాయి అతడు తిరిగి రాలేదు. వూపిరాడని పనుల్లో మునిగివున్నా శ్రీమతి, జహర్ వస్తాడని ప్రతి క్షణమూ ఎదురుచూస్తూనేవుంది. ఇది ప్రేమా ? ప్రేమకాదు; ఏదో కావాలనే కోరిక ప్రయో జనాపూర్వకమైన కాంక్ష ఆకాశాన్ని కౌగిలిలో బిగించుకుని, దాన్ని పిండిపిండి చేసినా — ఈ కోరికా, తృప్తి తీరదు ఈ కోరిక . హృదయాన్ని మండిస్తుందే యీ కోరిక ... కోరికే ! అది ప్రతి క్షణమూ ఆమె హృదయాన్ని కంపింపచేస్తూ వున్నది. అందుకోసమే ఎదురుచూస్తోంది : అతడికోసమే నిరీక్షిస్తోంది ...

* * * *

ఉన్నట్టుండి ఒకరోజున జహర్ తిరిగివచ్చాడు

"ఇన్నాళ్ళకి వచ్చారా ? ఇంతకాలం ఎక్కడున్నారు ? మొహం అలావుందే మిటి ? ముందు ఇంట్లోకి రండి !" అంటూ లక్ష్మి అతణ్ణి ఇంట్లోకి లాక్కు పోయింది

ఒకటి రెండు గంటల తరవాత పనిమీద బయటికి పోయిన శ్రీమతి తిరిగివచ్చి గదిలో ఒంటరిగా కూచునివున్న జహర్‌ను సమీపించి, "ఇంతకాలం ఎక్కడున్నా రేమిటి ?" అని అడిగింది.

జహర్ మాట్లాడలేదు

"జీవితం అంటే ఏమిటో, యీ కొద్దిరోజుల్లో బాగా అనుభవానికి వచ్చిందనుకుం టాను మరిచిపోలేని పాఠాలుకూడా నేర్చుకుని వుండొచ్చు." అన్నది శ్రీమతి

జహర్ ఆమెతో ఏదో చెబుదామని వచ్చివుంటాడు కాని, శ్రీమతి యిలా వెటకారంగా మాట్లాడటంతో, అతడికి హఠాత్తుగా కోపం వచ్చింది

"చాలా చాలా పాఠాలు నేర్చుకున్నాను," అన్నాడు జహర్ విసురుగా

"జూదంలో ఎంత డబ్బు గెలిచావేం ?"

జహర్‌కు కోపం ఎక్కువైంది. అతడు గట్టిగా, "ఆ జమాఖర్చులు నీకు చెప్పేందుకు రాలేదు," అన్నాడు

"ఐతే మరి ఏ వుద్దేశంతో వచ్చినట్టు ? శ్రీమంతుల ఇంట్లో వుంటూ మళ్ళీ ఒళ్ళు బాగుచేసుకు పోయేందుకా ?"

అకస్మాత్తుగా శ్రీమతి నోటినుంచి వెలువడిన పిడుగులాంటి యీ మాటలు అత డికి ఎక్కడలేని కోపాన్ని తెప్పించినై. కలహం పెంచాలనే తీవ్రమైన ప్రకృతిని అతను అణుచుకోలేక, మరీ ఒళ్లుతెలియని స్థితిలోపడి, చాలా అమర్యాదగా, కటు వుగా, "అంతేకాదు, మరోసంగతికూడా వుంది అదేమి టంటావేమో - నీతో నాకున్న సంబంధం సంగతి ఐతే నా కిప్పు డా కోరికలేదు," అన్నాడు

"బావుంది. లేకపోవటమేం? నీ మనసునిండా వుంటే," అన్నది శ్రీమతి

"ఆఁ అదే చెప్పివెళదామని వచ్చాను భాగ్యవంతుల యింటి ఆడపిల్లవి గనక భయమేస్తోంది ఇప్పటివరకూ నీ వలలో ఎన్నిచేపలు చిక్కాయి? పాపం వా ళ్ళంతా అమాయకులు, అభాగ్యులు అయినా వాళ్ళని గురించి నే నంతగా విచారి చ డంలేదు నా దిగులంతా లఖియాని గురించే ఇకనుంచైనా ఆ అమ్మాయిని రాచు బారాలు నడిపే అవమానకరమైన దాసీపనినుంచి మాత్రం తప్పించు ఇంతకన్నా నే నేమీ కోరను," అన్నాడు జహర్.

శ్రీమతి వ్యంగ్యంగా, "నన్నింతగా ఎందుకవమానం చేస్తున్నావో నీ మాటల ద్వారా నే నర్థం చేసుకున్నాను పర్వాలేదు లఖియామీద నీ కింత విచారం, బెంగా ఎందుక్కలిగాయో తెలుసుకోవచ్చా?" అన్నది

"ఎందుకు తెలుసుకోకూడదు. లఖియాను నేను ప్రేమిస్తున్నాను," అన్నాడు జహర్ తొణక్కుండా

"ఏవిటీ ప్రేమా! ప్రేమంటే ఏమిటో నీ కసలు తెలుసా?'' అని అడిగింది శ్రీమతి.

జహర్ ఓ నిమిషంసేపు మాట్లాడకుండా కూచుని, తరవాత కుర్చీలోంచిలేచి, "ఇదంతా ఎందుకొచ్చిన తగాదా? ఇక్కణ్ణించి వెళ్ళేప్పుడు సంతోషంగా నవ్వు కుంటూ వెళ్ళిపోదామనుకున్నాను. ఇక యీ ఇంట్లో నాకు టీ అనీ, భోజనమనీ వుండవు. ఇక వెళతాను నా వల్ల ఏదైనా దోషముంటే క్షమించు, శ్రీమతీ!" అంటూ తలుపుకేసి కదిలాడు.

శ్రీమతి గాభరాపడిపోతూ, అతడిదారికి అడ్డంగా వచ్చి నిలబడి, "ఎక్కడికి వెళతావ్?'' అని అడిగింది

"ఎక్కడికని చెప్పమంటావ్? ఇంతవరకూ ఆ వెళ్ళవలసిన చోటేదో నిర్ణ యించుకోలేదు ఫలానాచోటంటూ నా కేదీ లేదుకదా. ఊరికే రైళ్ళల్లో ఎక్కి తిరుగుతాను," అన్నాడు.

శ్రీమతి కళ్ళనీళ్ళ పర్యంతం అయిపోయి, "నేను నీ పట్ల ఏం అపరాధం చేశాను? నామీద నీ కింతకోపందేనికి? ఇక్కణ్ణించి వెళ్ళిపోయేందుకు నే నేం తప్పుచేశాను?" అని అడిగింది

జహర్ మెల్లిగా నవ్వాడు. "నువ్వు నా కన్యాయం చేశావనీ, అమర్యాదగా చూశావనీ నే ననలేదు, శ్రీమతి ఇక్కడుండే స్థోమతా, అర్హతా నాకులేవు. మాటల్లో చెప్పేందుకు చాలనటువంటి నీ అపూర్వమైన వ్యక్తిత్వానికి నమస్కరిస్తున్నాను," అన్నా డతను

బ్రహ్మాండమైన పెనుగాలితోపాటు బైట పెద్దపెద్ద చినుకులతో వర్షం ప్రారంభమయింది కోపంతో వున్న క్రూరజంతువులాగా బైటవీస్తున్న పెనుగాలి ప్రచండ గర్జన ధ్వనులు గదిలోకి వినవస్తున్నాయి అకస్మాత్తుగా చూస్తూ చూస్తూ వుండగానే ప్రకృతి ఒక్కసారిగా మారిపోయింది.

శ్రీమతి, జహర్‌కు మరింత దగ్గిరగా జరిగి, "ఇంత భయానకమైన వర్షంలో నువ్వు వెళ్ళాల్సిందేనా? నా ముఖంలోకి చూసి చెప్పు! వేడుకుంటున్నాను. నా మాటమన్నించు," అన్నది

"నే నిప్పుడే వెళ్ళాలి, తప్పదు నీ మాట వినలేదని బాధపడకు కష్టాల్లోనే నా రాకపోకలు ఆపదలతో, బాధలతో వున్నప్పుడే నేను రావటం జరుగుతుంది. నన్ను క్షమించు," అన్నాడు జహర్

"పిడుగులుపడే యీ వర్షంలో తడుస్తూనే వెళతావా? నా మాటవినవా? ఇది ధర్మమా? అయితే యికరావా?" అడిగింది శ్రీమతి

"మళ్ళీరానని చెప్పలేదుకదా, వస్తాను రావటమనేది జరిగితే, ఈ జీవితంలో నువుతప్ప నా కిం కెవరూలేరు అని నాకు నేను స్పష్టంగా తెలుసుకున్న రోజున - వస్తాను, శ్రీమతి నేను మళ్ళీ తిరిగివచ్చిన రోజున, నీలాంటి ఆడదాని పాదాల ముందు ..." అంటూ జహర్ చప్పున గదినుంచి బయటికిపోయి, మేడమెట్లు దిగేశాడు.

ప్రళయఝంఝూమారుతంలో వూగుతూ, పిడుగులుపడేప్పుడు కలిగే భయంకర గర్జనల్ని లెక్కచేయకండా, ఆకాశాన్ని చీల్చుకుని లోకం మీదికిపాకే మెరుపుల్ని తోసుకుంటూ, మోతపెడుతూ కురిసేవానలో తడుస్తూ, సర్వసంగ పరిత్యాగిలా అన్నిటినీ వదిలి, కష్టాల్ని వెతుక్కుంటూ ముందుకుసాగిపోయే జహర్‌ని రెప్ప వాల్చకుండా చూస్తూ, కిటికీదగ్గిర విగ్రహంలా నిలబడిపోయింది, శ్రీమతి



# 8

నాలుగు సంవత్సరాలు గడిచిపోయినై. జహర్ రానేలేదు. ప్రతిరోజూ అతడి కోసం శ్రీమతి ఎదురుచూసేది ఇవాళ తప్పకండావస్తాడు... అనుకుంటూనే సుదీర్ఘమైన నాలుగు సంవత్సరాలు గడిపింది. ఆమె విశ్వాసమూ, నమ్మకమూ, ఆశా ఏమాత్రం తగ్గలేదు. జహర్ తప్పక వస్తాడనే నమ్మకం ఆమె హృదయంలో రానురాను బలపడింది

ఆమె నమ్మకానికి తగినట్టు ఒకనాడు జహర్‌నించి వుత్తరం వచ్చింది ఆ ఉత్తరాన్ని ఆమె ఎన్నిసార్లు చదివిందో, ఆ దస్తూరీని ఎన్నిసార్లుచూసిందో ఆమెకే తెలీదు. దీర్ఘమైన నాలుగు సంవత్సరాల తపః ఫలితంగా ఉత్తరం ఆమెకు ప్రాణం పోసింది.

నాలుగు సంవత్సరాలు గడిచిపోయింతర్వాత వచ్చిన ఆ ఉత్తరానికి, ఆ మర్నాటి రాత్రి తెల్లవార్లూ మేలుకుని కూర్చుని శ్రీమతి ఉత్తరం రాయసాగింది...

ప్రియా !

చాలాకాలం గడిచింతర్వాత యిన్నాళ్ళకి నీ దగ్గిర్నుంచి ఉత్తరాన్ని అందుకున్నాను. నీ నుంచి ఉత్తరం రావటంలో అస్వాభావికం ఏమీలేదు. కానీ నేను నీ నుంచి ఉత్తరాన్ని ఆశించలేదు. నీవు వస్తావనే నమ్మకంతో యింతకాలం ఎదురు చూశాను. ఉత్తరం రావటంవల్ల నాకేమన్నా ఆనందం కలిగిందా? ఏమో చెప్పలేను. బహుశా కొంతవరకు నీ వుత్తరం నాకు దుఃఖాన్నే కలిగించిందనుకుంటాను. నీ భాష నాకు కొత్త విషయాల్నీ, విశేషాల్నీ ధ్వనింపజేసింది. నువ్వెవరివికావో నీ మనసేమిటో – ఆ పరిచయాన్ని మాత్రం బాగా కలిగించింది.

ఇక్కణ్ణించి నువు వెళ్ళిపోయిన రోజు జ్ఞాపకం వుందా? ఎందుకుండదు –తప్పకుండా వుండేవుంటుంది. మగవాళ్ళ హృదయాల్లో జరిగిన సంఘటనలు మాత్రమే నిలబడి వుంటాయి. మాకు సంఘటనలతోపాటు, వాటి ఫలాఫలాలుకూడా జ్ఞాపకం వుంటాయి.

నీ ఉత్తరం నా చెవిలో రహస్యంగా, నువ్వు పైకి కనిపించే 'నువ్వు' కావని చెప్పింది. ఎలాగైనా మీ మగాళ్ళ మనస్తత్వంలో కదలిక వుంటుంది, అభివృద్ధి వుంటుంది. మాలో అది వుండదు. మీ మగాళ్ళున్నారే హద్దులేని ఆకాశంలాంటి వాళ్ళు. నన్ను బాగా, స్పష్టంగా అర్థంచేసుకునేందుకని, నానుంచి నువు దూరంగా వెళ్ళిపోయావు.

నువేమన్నా అనుకో. ఒకర్నొకరు అర్థం చేసుకునేందుకు యిలా తెంచుకుని దూరంగా పోవలసిన అవసరం నాకేమీ కనిపించటంలేదు. నీదగ్గర, నేనెవర్నో– ఎలా పరిచయమయ్యానో అలాగే వుండిపోయాను. ఇవాళ సాయంకాలం ఒకావిడ పెత్తనానికివచ్చి, నాతో, "ఈ లోకంలో అందరికన్న నువ్వే ఎక్కువ సుఖవంతురాలివి," అని చెప్పి పోయింది. ఆమె మాటవిన్నప్పట్నుంచీ, ఈ రాత్రే నీకు ఉత్తరం రాయటానికి తగిన సమయమని – నిశ్శబ్దంగా, ఆకురాలి కిందపడినా వినబడేంత నిశ్శబ్దంగావున్న యీ రాత్రిపూట రాస్తూ కూర్చున్నాను.

ఆమె మాటలు నాకు ములుకుల్లా తగిలాయి. సుఖవంతురాల్ని కాబట్టే, మనసుకింత శాంతనేది లేకుండా పోయిందా? 'నా మెత్తని సుకుమారమైన పాన్పుమీద, యీనాడు కంకరరాళ్ళ మెరికలు బైటపడుతున్నాయి' అని నేను అతిశయోక్తులు చెప్పదలుచుకోలేదు. అదంతా చవకబారు కవిత్వం. కవిత్వానికీ, మానవుల వాస్తవ

జీవితానికి సంబంధంలేదు. కవిత్వం జీవితంలోని ఒక అంశమైతే కావచ్చుగాని, అదే జీవితమని అంటే ఎవరూ ఒప్పుకోరు; మనల్ని పిచ్చాసుపత్రికి పంపుతారు.

ఆఁ, నేను బాగానే వున్నాను, కాని విశ్రాంతగామాత్రం లేను. ఎవరికీ అందుబాటులో లేకండా, అర్థంకాకండా ఒకమూల గోప్యంగా పడివున్నాను ఎన్ని పోష్టు ముద్రలుపడి, అడ్రసులుమారి నీ వుత్తరం నా కెక్కడికైతే వచ్చి చేరిందో- అది మాత్రం చాలా కొత్త ప్రదేశం. నీకు ఉత్తరం రాస్తూ కూర్చున్న యీ ఇల్లు పర్ణకుటీరం. దీనిచుట్టూవున్నవి తడికలతో కట్టిన గోడలు. ఇది వెదురు విట్టాళ్ళపాక. ఈ గదిలోపల కొద్దిపాటి గృహాలంకరణ సామగ్రీ, మినుకు మినుకుమనే దీపం మాత్రం వున్నాయ్,

అదేమిటీ? ఆ మేడా, కారూ అవీ- అన్నీ వొదిలిపెట్టి వచ్చానని తెల్లబోతున్నావా? నేనూ తెల్లబోతున్నాను. అంత ఐశ్వర్యాన్ని వదులుకువచ్చినా, యిక్కడ నాకు దారిద్ర్యం అనేదిలేదు. నేనున్న యింటిముందు చిన్న వరండా- అంటే పంచపాళీ అంటామే అది. దానికి కిందుగా మెల్లా. దానినిండా పూలమొక్కలు. నెమ్మదిగా నడుస్తూంటే అవి నా చీరకొంగును పట్టుకుంటూ వుంటాయి. చుట్టూ దడికట్టినట్టుగా మాధవీలతలు. మూసుకున్న మబ్బుల్లా అవి ఎంతో గుబురుగా పెరిగాయి.

కుటీరంనుంచి బయటికి రాగానే నదికి వెళ్ళేదారి. ఆ దారివెంట చెట్లనీడల్లో సాయంకాలం నదికివెళ్ళి నీళ్ళు తెచ్చుకోవటం ఎంతో బావుంటుంది ని దెవినీళ్ళమీద వదిలి, గొంతులోతు నీళ్ళలోకి వెళ్తే - ఆ నీళ్ళల్లో నాకేనాడూ శ్రీకృష్ణుడి ఛాయ కనిపించదు; నీ ఛాయకూడా కనిపించదు. నా ప్రతిబింబమే నాకు కనిపిస్తుంది. తడి చీంతో తిరిగి వచ్చేప్పుడు చంకలోవున్న నీళ్ళ బిందెలోని నీళ్ళు తొణుకుతూ వుంటాయి. ఎందుకలా యిదవుతావ్? వూరుకో, ఎగతాళి చేయకు. నీ దగ్గరగావుండి నేనీమాటల్ని అనివున్నట్టయితే, తప్పకండా ఏదో ఒక కొంటెమాట అనివుండేవాడివి. నాకు తెలుసు. ఏం చెయ్యమంటావు? మధురమైన కావ్యాల్లోని నాయికల రూపమన్నా, ఆవేశం అన్నా, అలా వుండాలన్నా - ఆడాళ్ళకి ఎంత యిష్టమనుకున్నావ్?

ఈ విషయాలకేంగాని.... నేను నా ఐశ్వర్యాన్నుంచి విముక్తురాల్ని అయానని చెప్పాగదూ. ఆ హోదా, ఆ ఐశ్వర్యం నా తత్వానికి పడలేదు. రమని తనభాగం తీసుకు వెళ్ళమన్నాను. ఆమె ఒప్పుకోలేదు. తన అత్తమామలూ, భర్తగారూ సంపాదించిన సిరిసంపదలతోనే ఆవిడ సంతృప్తురాలైంది.

నా చుట్టూవున్న జనసామాన్యంచేసే హంగామా, ఆర్భాటం అంతా నువు చూస్తే వెళ్ళావుగా? వాళ్ళ మాటలు, మెప్పులు, విసయాలు - అన్నీ నాకు తలనొప్పి తెప్పించినై. ఒక్క క్షణంకూడా అక్కడ వుండలేనంత భయానక పరిస్థితుల్ని సృష్టించాయ్. ఇలాంటి వాళ్ళతో లావాదేవీలు పెట్టుకోవటం అంత తెలివితక్కువ పని ప్రపంచంలో ఇంకోటి లేదనుకో!

లఖియా నీకు బాగా గుర్తుండే వుంటుంది రెండు సంవత్సరాలక్రితం ఒకనాడు-హఠాత్తుగా ఆమె గర్భవతి అన్న సంగతి బైటపడింది. తీరా ప్రసవించాక, ఆ ఆసుపత్రి గదిలోనే ఆమె ఆత్మహత్య చేసుకున్నది. విశాలమైన క్షమా అనురాగాలను మర్చిపోయి నేను తనను అవమానపరుస్తానని, ఆమె పొరబడివుంటుంది.

లఖియా చెడుప్రవర్తనకి నేనే బాధ్యురాలినని కొంతమంది అనుమానించారు. ఆ కారణంగా చాలామందికి నేను ఏహ్యురాలినై పోయాను. వాళ్ళందరూ నన్ను తేలిగ్గాచూడటం ప్రారంభించారు. ఆప్తులమని చెప్పుకున్నవాళ్ళంతా దూరంగా తొలగిపోయారు. కాని, లఖియా వదిలిపెట్టిపోయిన సంతానాన్ని నేనుకూడా ఎలా వదిలిపెట్టను? పుట్టిన చంటిబిడ్డకి తల్లిలేదుకాని, నేనా బిడ్డను తల్లిలా కాపాడగలను. నువ్వేమంటావ్?

నోరూవాయీలేని ఆ చంటివాణ్ణి దగ్గిరికి తీసుకని ఇంత ఆశ్రయం యిచ్చానో లేదో-ఆనాడు నన్నంతా వెలివేశారు. తలదాచుకునేందుక్కూడా నాకు చోటులేకండా పోయింది. నా ఆస్తీ, బోలెడంత రొక్కం లోకానికి పంచిపెట్టి, నా గొప్పతనాన్ని వెల్లడిచేసుకోబోయాను. ఈ కళ్ళముందే ట్రస్టీల చేతుల్లోకి ఆ ఆస్తంతా పోయింది. నాకు నిలుచునేందుక్కూడా ఆశ్రయమనేది లేకండాపోయింది.

నా ఒళ్ళో పడుకునివున్న దెవర్లో ఊహించగలవనుకుంటాను. రెండేళ్ళ ముద్దుబిడ్డ! సూర్యకుమార్ అని పేరుపెట్టాను. గాఢంగా నిద్రపోతున్న వాడి మొహంలో చిరునవ్వు చిందులాడుతోంది. వాడి ఒళ్లు తాకడంతోనే, నా ఒళ్లు యిలా పులకరిస్తుం దెందుకని? నా రక్తనాళాల్లో మధురమైన చైతన్యం కలుగుతూవుంటుం దెందుచేత?

ఏం చెప్తావ్? దీనికి నువేమంటావ్? వాత్సల్యమా? మాతృత్వమా? ఏమంటావ్? దీనికి నీ నిర్వచనం ఏమిటి?

నీకింకా ఏం రాయను? నువిక్కడికి రావలసిన సమయం వచ్చేసింది, ప్రియా! రా. ఈ హృదయకవాటాన్ని యింతకాలం నీకోసమే తెరిచుంచాను ప్రియా! రా, నువ్వు. నువు రావలసిన సమయంకూడా యిదే. ఆపదల్లో, బాధల్లో, కష్టాల్లో నువు తప్పక వస్తావని నానమ్మకం. నా ఆశని, కోరికని తోసేయకు.

నిజంగానే హృదయం విప్పి పిలుస్తున్నాను, నేను. రా, నువ్వు. ఈ కళ్లు నీకోసం వెతుకుతున్నాయి ఈ చెవులు నీ అడుగుల శబ్దంకోసం పొంచిపొంచి వింటున్నాయి శరీరంలోని స్నాయువులు నీకోసం గంతులువేస్తున్నాయి. నువు రావలసిన సమయ మిదే. రా, తప్పదు.

నీకోసమని ఉల్లూ వాకిలీ ఏర్పాటు చేసుంచాను. ఇంటిచుట్టూ మాలతీలతలు దడికట్టినట్టు విచ్చిన నవ్వుమొహాలతో ఆహ్వానించేందుకు నీకోసం పెరిగాయి. మత్తెక్కించే యీ పూలవాసనలకి, చల్లనిగాలికి, నీ కళ్ళమీద నిద్రాదేవత శీతలమైన తన హస్తాల్నుంచి ముద్దు పెట్టుకుంటుంది. దాహమై నిద్రలోలేస్తే, పురాతనమైన మృత్పాత్రలో ఘంరసావిని తేనెతో నింపి, తెచ్చి అందిస్తాను. కొలనులోని స్వచ్ఛమైన నీటిని తెచ్చి నీ దోసిలినిండా పోస్తాను.

నేనెలావున్నానో, నాశరీరం ఎలావుందో తెలుసుకోవాలని వుందా? ఎందుకుండదులే, నా మంచికోరి నా వెంట తిరిగిన మనిషివి-నీకు అంతమాత్రం వుండదా ఏమిటి? శరీరంసంగతి కేంలే, దానిసంగతలావుంచు. ఇది ఎందుకూ పనికిరానిది. మనసుని గురించి చెబుతాను. ఈనాడు నా శరీరాన్నిగురించి, శరీరంలోని మెరు

గుర్నిగురించి, సౌష్టవాన్నిగురించి ఆలోచించటం మానివేశాను. కేవలం మనసుని గురించే ఆలోచిస్తున్నాను. హృదయానికి ఉత్సాహాన్ని కలిగించే కావ్యభాషలో 'యవ్వనం' అని అంటారే, ఆ యవ్వనం నాలో నశించింది. నన్నది ఏనాడో వదిలి పెట్టింది. నేనిప్పుడెంతో విశ్రాంతగా, నా యిష్టంవచ్చినవేపు, యిష్టమున్నంత సేపు కళ్ళప్పగించి చూడగలుగుతున్నాను. యవ్వనం అనేది నన్నెప్పుడైతే వదిలిపెట్టి వెళ్ళిందో ఆనాటినుంచీ 'శాంతి' అనేది నా మనసుకు అర్థమైంది. ఎంతో తృప్తిని పొందగలుగుతున్నాను.

పైకిమాత్రం విగ్రహాన్ని నటించటం, లోలోపల విగ్రహాన్ని వర్జించటం ఆడ వాళ్ళ మన స్తత్వం అని. నీ ఉత్తరంలో ఒక ఆరోపణ చేశావు. సరే, నువ్విక్కడికి వచ్చింతరవాత దానికి సమాధానం చెబుతాను. ఆడవాళ్ళకు ఆదర్శవాదమంటే చాలా యిష్టం. కాని నీ సంగతి నాకు తెలుసు. నువు వొట్టి 'సినిక్'వి. ఈశ్వరుడి పేరుచెబితే బూటకం అంటావు. మానవులు నీదృష్టిముందు ఎందుకూ పనికిరాని రాతివిగ్రహాలు... ఈ వైపునుంచిచూస్తే నువ్వు ఇంతే! కాని అటువైపునుంచిచూస్తే మాత్రం నువ్వు 'డ్రీమర్'వి, విలాసపురుషుడివి, భావోద్రేకుడివి, ఆనందమయుడివి.

ఇంక చాలు; రాత్రి బాగా పొద్దుపోయిందని కాదు. చాలా కాగితాలు రాశానని కాదు, యిలా అనటం. నువేమాత్రం ఆలస్యం చేయకుండా వచ్చేయమంటున్నాను. నువు వెళ్ళవలసిందీ, తిరగవలసిందీ యిక లేదు. నువు యిక్కడికే రావాలి. వచ్చి స్థిరపడివుండవలసిన తుది ఆశ్రయం యిదే.

బాధలతో కుంగిపోయినవాళ్లూ అవమానాలతో దూరంగా విసిరివేయబడిన వాళ్ళూ, దురదృష్టంతో అణగారిపోయినవాళ్ళూ, ఈ లోకంలో ఎవరైతే వున్నారో వాళ్ళ తరపున మనమిద్దరం, ప్రశాంతమైన యీ సరిహద్దులో నిలబడి _ సంఘ విద్రోహులమీద నేరారోపణ చేద్దాం! అభియోగం తీసుకవద్దాం.

మానవజాతి అంతా ఒకటేననీ, దరిద్రులు, దుఃఖితులు, ఈ జాతిలో లేరనీ, సుఖంగా బతికేందుకూ, ప్రకృతి సంపదను అనుభవించేందుకూ, సృష్టి అందరిపట్లా ఒకేవిధంగా వుందనీ, తృప్తిగా, హాయిగా, సుఖంగా అందరూ అనుభవించేందుకు, ఈ లోకాన్ని సుభిక్షం చేసిందనీ చాటుదాం.

రా, తప్పకుండా రా. నువు రావలసిన సమయం యిదే. నా యీ ఆఖరి విన్నపాన్ని నీకు తెలియజేస్తూ _ నీ రాకకోసం ఎదురుచూస్తున్నాను ...

నీ

ప్రియబాంధవి



# మీనా

యద్దనపూడి సులోచనారాణి

(గత సంచిక తరువాయి)

దూరంనుంచి నాటకం దగ్గర పెట్టిన లౌడ్‌స్పీకర్‌లోంచి రకరకాల సినిమాపాటలూ వినిపిస్తున్నాయి. మధ్య మధ్యలో మైక్ గరగరమని, కీచుమని రకరకాల శబ్దాలు చేస్తోంది. అవి వినలేక నేను రెండుచెవులూ మూసుకున్నాను.

కృష్ణ వాళ్ళని దింపి తిరిగి వచ్చేస్తాడు.

నాలుగైదు గంటలు మేం ఇద్దరం ఎవరూ లేని యీ యింట్లో, రాత్రివేళ ఒంటరిగా వుంటాం.

ఈ వూహ నా కెలాగో వుంది.

హఠాత్తుగా నాకు అనుమానం వచ్చింది.

కృష్ణ కావాలని నాతో యీ ఏకాంతం కల్పించుకోలేదుకదా! అత్తయ్యకి వయసువాళ్ళని ఒంటరిగా వదలకూడదనే అనుమానం కాస్తయినా రాలేదా!

అదే మా అమ్మ అయితే యిలా వదిలేదా? ఎన్ని ఆలోచించేది? ఎన్ని వూహించేది? ఒకవేళ గత్యంతరంలేక తప్పనిసరిగా వెళ్ళాల్సివస్తే నాకు ఎన్ని జాగ్రత్తలు చెప్పి వెళ్ళేది? ఏ మ్మనుష్యులు వీళ్ళు! ఆ నాటకం హడావుడిలో అసలు ఏమీ గుర్తువున్నట్టే లేదు.

అంతవరకూ మామూలుగావున్న నేను ఆలోచన్లు యిలా వంకరదారి పట్టటంతో ఎలాగో అయి, కృష్ణ ఆగమనంకోసం వేచి చూడసాగాను.

ఏమంటాడతను!

చనువుగా నా చెయ్యి పట్టుకుని. "నువ్వంటే నాకిష్టం మీనా!" అంటాడా? ఛస్తే నమ్మను నేను.

నిన్న మొన్నటివరకూ యిష్టంలేనివాడికి ఈ రోజు యీ క్షణంలో హఠాత్తుగా ఎలా యిష్టం వచ్చేస్తుంది?

నేను చెయ్యి విదిలించి పారేస్తాను.

కటువుగా, నిర్లక్ష్యంగా, ఏమయినా అనేస్తాను.

తొలియవ్వనంలో, ప్రప్రథమంగా, పురుషుడితో ఏకాంతంగా గడపబోతున్న సమయం ముందు, కన్నెపిల్లహృదయం ఎలా ఖంగారు పడుతుందో, ఎంత తికమకగా ఆలోచిస్తుందో, నేనుకూడా అలాగే అనుభూతి చెందసాగాను.

నాకు భయం భయంగా, ఆసక్తిగా, కుతూహలంగా, ఎలాగో అన్పించసాగింది.

అరగంట అయింది.

గంట గడిచింది.

రెండో గంటలో సగంపైగా తరిగిపోయింది.

కృష్ణ తిరిగి రానే రాలేదు. అసలు వచ్చేజాడకూడా కన్పించలేదు.

నిజంగా నాతో ఏకాంతంకోసం తపించిపోతున్న వాడయితే యింతకాలం వృధా చేస్తాడా!

క్రమంగా నా వెర్రిమొర్రి ఆలోచనలన్నీ అంతరించిపోయాయి.

[illegible]

[illegible] ఆ ప్రదేశమే [illegible]

ఎప్పుడూ ఏనాడూ వయసుకొచ్చిన మగవాళ్ళతో ఒక్క క్షణంకూడా ఒంటరిగా గడపని నేను, ఆ కుతూహలంతో, ఆ భయంతో, యిదంతా వూహించుకున్నాను. [illegible] ఆలోచనలకి నాకే కోపం వచ్చింది సిగ్గువేసింది కూడా.

కృష్ణకికూడా నాలాగే [illegible], కేవలం ఆత్మ[illegible] సంతృప్తి పడటం కోసం, రాజా [illegible] నేనుండగానే భయంతో ఎలా అని వుంటాడు. అతను, యీపాటికి హాయిగా, సర్కస్ [illegible], ఆ నాటకం చూస్తూండడంలో లీనమైపోయి వుంటాడు.

అసలు [illegible] నేను ఒకదాన్ని ఒంటరిగా వున్నాననే జ్ఞాపకంకూడా అతనికి వుండకపోవచ్చు.

వాళ్ళెవరూ వచ్చేవరకూ యింటికి రాడు, అనేవూహ నాకు భయాన్ని కలగచేసింది.

దిండు సరిచేసుకుని పడుకున్న నాకు నిద్రపట్టలేదు.

ఎక్కడో, ఎవరో నడిచిన శబ్దం వినిపించింది.

చటుక్కున లేచి కూర్చున్నాను.

వీధితలుపు దగ్గరగా వేసివుంది.

లోపలికి ఎవరూ రాలేదు కదా!

ఏమో! వీధిలో ఏమూలయినా నక్కి వుండి యింట్లో నేను తప్ప అంతా వెళ్ళిపోయారని గ్రహించి లోపలికివస్తే! నాగొంతు పిసికితే! నానగలు యిమ్మని బెదిరిస్తే!

అసలే కాస్త ఒంటరిగా కూర్చున్నానంటే, నా ఆలోచనలు వంకరటింకరగా పరుగెత్తుతాయి.

అందులో ఒంట్లో బాగా లేకపోతే మరీను. చీకటిపడితే నాకు చచ్చేంత భయం. చూసిన ప్రతిదానికీ ఏమిటో ముక్కూ చెవులూ వున్నట్టే కన్పిస్తాయి.

మంచంమీద కూర్చున్నాను. లేచి వెళ్ళి వీధితలుపు గడియవేసి రావాలని ఎంతగానో అన్పిస్తోంది.

కాని కాళ్ళు కదలటంలేదు.

ఇంతలో ఎక్కడో ఏదో దభిల్లుమని పడిన శబ్దమయింది.

మంచంమీద అంతెత్తున ఎగిరిపడ్డట్టుగా వులిక్కిపడ్డాను.

శరీరంలో అణుపణువూ బిగబట్టి, గ్రహణశక్తినంతా రెండు చెవుల్లో కేంద్రీకరించి, మళ్ళీ ఏదయినా శబ్దం అవుతుందేమోనని చూడసాగాను.

ఏదీ వినిపించలేదు.

కానీ మళ్ళీ అదే అడుగులచప్పుడు!

దేన్నో పరపర కోస్తున్న ధ్వని.

ఎవరైనా లోపలికి వచ్చే వీలులేదు కదా!

నేను మేలుకొని వున్నాననీ, ఏంచెయ్యటమా అని ఆలోచిస్తూ నిలబడి పోలేదుకదా! మరి అడుగుల శబ్దం ఎందుకు ఆగిపోయింది.

గదిలో లాంతరు వెలుగులోవున్న నాకు బైటంతా చీకటిగా వుండటంతో ఏం కన్పించటంలేదు.

చివరికి ఎలాగో, నాకు నేను ధైర్యంచెప్పుకుని, చిన్నప్పుడు మా నాన్నచెప్పిన రాజకుమారుల సాహస కృత్యాలన్నిటిని గుర్తుచేసుకుంటూ, లాంతరు తీసుకుని ఎత్తిపట్టుకుని చూస్తూ, బైటహాల్లోకి వచ్చాను.

లాంతరు పట్టుకున్న నాచెయ్యి చలిజ్వరం వచ్చినవాళ్ళ చెయ్యిలా గడగడ వణుకుతూ వుండటం స్పష్టంగా నాకే కన్పిస్తోంది.

నా అనుమానం నిజమే!

నేను వృధాగా భయపడలేదు.

ముందు గదిలో కిటికీకి కుడిపక్కన మూలగా, వుదయం రాజేశ్వరి నాకు కప్పి ఆవిరిపట్టిన నల్లటి రగ్గు కప్పుకుని ఎవరో నిలబడి వున్నారు.

శరీరం అంతా రగ్గులో దాచబడివుంది.

ఎర్రగా, వికృతంగావున్న రెండు కళ్ళుమాత్రం నావైపు క్రూరంగా చూస్తున్నాయి.

"ఎ-ఎవరది?" వణుకుతున్న కంఠంతో పిలవబోయాను.

కానీ నా నోట్లోంచి సరిగ్గా మాట రాలేదు.

నేను కదిలితే నా మీదికి వురకాలన్నంత జాగ్రత్తగా ఆ కళ్ళు నిర్దాక్షిణ్యంగా నావైపు రెప్పవాల్చకుండా చూస్తున్నాయి.

నాకు నోట మాట రాలేదు.

చెమటలు పోస్తున్నాయి.

నేనిక్కడ అరిచినా, ఎచ్చిగీపెట్టినా, నన్ను ఆదుకునే నాధుడు లేడు.

వూరువూరంతా [illegible] దగ్గిరే వుందన్న సత్యం నన్ను చిగురుటాకులా వణికించి [illegible] చేసింది.

నేను స్పృహతప్పి పడిపోతానేమో అనుకున్నాను. ఉన్నట్టుండి తలుపులు తెరుచుకున్నాయి. అప్రయత్నంగా తలతిప్పి అటువైపు చూసాను.

లోపలికివచ్చిన కృష్ణ హఠాత్తుగా ఆగిపోయాడు. నేనక్కడ అలా నిలబడి వుండటం అతనికి విచిత్రంగా కనిపించి వుండవచ్చు.

"మీనా!" అన్నాడు అర్థంగానట్టు చూస్తూ. నే నేమన్నానో నాకే తెలియదు. నా చేతిలో లాంతరు క్రింద ఎలాపడిందోకూడా నాకు గుర్తులేదు. రెండంగల్లో వచ్చి అతన్ని కరుచుకుపోయాను!

"ఏమిటది? ఏమైంది? ఏమైంది?" ఖంగారుగా, ఆదుర్దాగా అడుగుతున్నాడతను.

"దొ..దొంగ. ఆ..ఆమూల.." అన్నాను.

క్రిందపడ్డ లాంతరు గప్‌గప్‌మని ఎగిరి ఆరిపోయింది.

చిమ్మచీకటిలో అతన్ని హత్తుకుపోయి నిలబడిన నాకు, అతని స్పర్శకి కొత్త ప్రాణం వచ్చినట్టుంది.

"ఎక్కడికి ఎందుకు? వుండు. నన్ను చూడనీ-" అతను నన్ను విడిపించుకోటానికి ప్రయత్నిస్తూ అన్నాడు.

"వద్దు. వెళ్ళకు నీ. వంజరివాడివి. అతనిచేతిలో కత్తిలాంటిది ఏదయినా వుందేమో!" అతణ్ణి కదలనివ్వకుండా చేస్తూ అన్నాను. అప్రయత్నంగానో ప్రయత్నంగానో, క్షణంసేపు అతనిచేతులు నన్ను బలంగా గుండెలకి హత్తుకున్నాయి. అది భ్రమో, లేక యదార్ధమో తెలియనంత వేగంగా జరిగిపోయింది.

అతను, ఆ వెంటనే నా చేతుల్ని విడదీస్తూ, "నీ మొహం. యీ యింట్లోకి అంత ధైర్యంగా రావటానికి ఎవరికీ గుండెలు లేవు. వుండు, లాంతరు ఆరిపోయింది. వెలిగించనీ నన్ను-" అన్నాడు.

"నాకు భయంగా వుంది." అతనిచేయి గట్టిగా పట్టుకుంటు అన్నాను.

"నేనుండగానే?" అతని స్వరం ఎలాగో అయింది.

నేను అతనిచేతిని వదలలేదు. అతనుకూడా యీసారి వదిలించుకోవాలని చూడలేదు.

---




ఎక్కడ
లైఫ్‌బాయ్ వున్నదో
అక్కడ ఆరోగ్యము వున్నది

లైఫ్‌బాయ్ మురికిలో గల క్రిములను కడిగి వేస్తుంది

హిందుస్థాన్ లీవర్ ఉత్పత్తి

జేబులోంచి అగ్గిపెట్టెతీసి పుల్ల వెలిగించి లాంతరుదగ్గరకు వెళ్ళి లాంతరు వెలిగించి వత్తి సరిచేశాడు.

“ఏది? ఎక్కడ-యిప్పుడు చూపించు,” అన్నాడు.

“అదుగో ఆమూల-” రహస్యంగా చెప్పి చేత్తో చూపించాను.

లాంతరు పట్టుకున్న అతనిచెయ్యి కొద్దిగా కంపించటం నేను గమనించకపోలేదు.

కృష్ణ నేను చూపించిన వైపు వెళ్ళి గ్గు చూపిస్తూ “యిక్కడేనా?” అన్నాడు.

ఔను అన్నట్టు తలూపాను. కాని ఆ ఊళ్ళులేవు. మనిషిమాత్రం ఒరిగి నిలబడి స్పష్టంగా కనిపిస్తూనే వున్నాడు.

కృష్ణ దాని దగ్గరికి వెళ్ళి ఉన్నట్టుండి బిగ్గరగా నవ్వాడు.

“ఇదా! మూరగ్గా భలేవాడివి! యిదేమిటో చూశావా?” చేత్తో దగ్గులాగి, దాన్ని క్రిందకి తోశాడు.

చిరిగి, దూది బైటికివస్తున్న పరుపు చుట్టి నిలువుగా ఎత్తి నిలబెట్టబడివుంది. దానిమీద పాతబట్టలమూట ఒకటి పెట్టారు.

నవ్వుతూనే చెప్పాడు – “ఇది యిన్నాళ్ళూ పాకలో వుండేది. మొన్న వానకి

# ఫాస్ఫోమిన్



శక్తిని పెంపొందించును.



ఆకలిని అధికము చేయును.

సహనశక్తిని



హెచ్చించును.

శరీరముయొక్క రోగనిరోధక శక్తిని

ఎక్కువ చేయును.




అమ్మకు — కుటుంబము
అంతటికి ఫాస్ఫోమిన్
వల్ల ఆరోగ్యము కలుగును.

ఫాస్ఫోమిన్...బి కాంప్లెక్స్ విటమినులు మల్టిపల్
గ్లిసరోఫాస్ఫేట్లుగల ఆకుపచ్చని పండ్ల రుచిగల టానిక్

® ఇ. ఆర్. స్క్విబ్ & సన్స్ ఇన్‌కార్పొరేటెడ్ వారి
రిజిష్టర్డ్ ట్రేడ్ మార్కు చిహ్నం: దీని లైసెన్సు
ఉపయోగదారులు కరంచంద్ ప్రేంచంద్ ప్రయివేట్ లిమిటెడ్

SQUIBB®

SARABHAI CHEMICALS

Shilpi SC 50 A/67 Tel

తడిసిపోయిందని అమ్మ కేకలేస్తే పీరాయి తెచ్చి యీ మూల పెట్టాడు. అసహ్యంగా వుందని రాజు ఆ నల్లరగ్గు కప్పింది. భలేదానివి, హడలగొట్టావు నన్ను."

నేను కళ్ళు పెద్దవిచేసి ఆ పరుపువైపు చూసాను. అయితే యింతక్రితం నాకు కన్పించిన కళ్ళ మాటేమిటి ?

ఇంతలో మ్యావ్ మ్యావ్ అని విన్పించింది. ఇద్దరం అటుతిరిగి చూసాం.

కుర్చీక్రిందనుంచి నల్లపిల్లి యిటువైపే చూస్తూ అరుస్తోంది. అవి దానికళ్ళే !

"దీన్ని చూసికూడా భయపడ్డావా ?" యింకా నవ్వుతూనే అన్నాడు కృష్ణ.

నాకు కోపం వచ్చింది. అభిమానం వేసింది. సిగ్గు కలిగింది.

"మహా నన్ను వెక్కిరిస్తున్నావు యిప్పుడు యింతక్రితం లాంతరు పట్టుకున్నప్పుడు నీ చేయి కంపించటం నేను చూడలేదనుకోకు," అన్నాను.

"అది భయపడికాదు."

"మరింకేమిటి ?"

నవ్వుతున్న కృష్ణ ముఖం హఠాత్తుగా గంభీరమైంది.

"నేను వచ్చాగా, యిక భయంలేదు. వెళ్ళు. వెళ్ళి పడుకో. పద లాంతరు తీసుకువస్తాను," అన్నాడు.

---

# సక్రమంగా బ్రష్‌తో తోముకుంటే ఫోర్‌హాన్స్ టూత్‌పేస్టు పళ్లచిగుళ్ల బాధలను దంత క్షయమును నిలుపును

చిగుళ్ల బాధలను దంతక్షయమును నిలుపుటలో ఫోర్‌హాన్స్ టూత్‌పేస్టు సాధించిన అద్భుతమైన ఫలితాలను. చిన్నా పెద్దా అనేభేదంలేకుండా అయాచితంగా చేసిన ప్రశంస లెలావున్నాయో చదవండి. ఈ ప్రశంసా పత్రాలను జెఫ్రి మానర్స్ అండ్ కంపెనీ వారి యే కార్యాలయములోనైనా చూడవచ్చును.

'నేను పళ్ళజబ్బులతో బాధపడుతుండే వాడిని అప్పుడు ఫోర్‌హాన్స్ టూత్‌పేస్టు వాడి చూచేను... ఇప్పుడు అటువంటి జబ్బులేమి లేవు. షుమారు 20 నుండి 25 మంది వరకు ఇప్పుడు ఫోర్‌హాన్స్ ఉపయోగిస్తున్నారు. మా ఇంట్లో అయితే ఫోర్‌హాన్స్ తప్ప వేరే మాట వినబడదు.''

ఉదయశంకర్ తివారీ, పాట్నా

'శాస్త్రీయంగా నిర్మింపబడిన మీ ఫోర్‌హాన్స్ టూత్‌పేస్టు నేను గత పది సంవత్సరాల నుండి ఉపయోగిస్తున్నాను; నా చిగుళ్ళ బాధలన్నీ అది పోగొట్టింది. ఇప్పుడు మా ఇంట్లోని వారంతా క్రమంగా ఫోర్‌హాన్స్ టూత్‌పేస్టుతోనే బ్రష్ చేస్తారు.''

ఎన్.ఎమ్ లాల్, న్యూఢిల్లీ

సరియైన పంటి జాగ్రత్తకోసం ప్రతిరాత్రి, ప్రొద్దుటా ఫోర్‌హాన్స్ టూత్ పేస్టును, ఫోర్‌హాన్స్ డబుల్-ఏక్షన్ టూత్ బ్రష్‌నూ వాడండి....మరియు మీ దంత వైద్యుని వద్దకు నియమానుసారము వెళ్లండి.



ఉచితము! 'పళ్ళు చిగుళ్ళను గురించి తీసుకోవలసిన శ్రద్ధ' అనే రంగుల చిన్న పుస్తకం, ఇంగ్లీషు తెలుగు భాషల్లో లభిస్తున్న యీ చిన్న పుస్తకము కావలసినయెడల యీ కూపన్‌ను 10 పైసల తపాలా బిళ్లతోపాటు (తపాలా ఖర్చుల నిమిత్తం) మానర్స్ డెంటల్ అడ్వయిజరీ బ్యూరో, పోస్టు బ్యాగ్ నం 10031 బొంబాయి-1కి పంపండి.

పేరు ______________ వయస్సు ______

చిరునామా ______________

భాష ______________

**ఫోర్‌హాన్స్** ఒక దంతవైద్యునిచే నిర్మింపబడిన టూత్ పేస్టు

Y - 11

65F- 182 TL

ఇద్దరం గదిలోకి వచ్చాం.
నేను మంచంమీద కూర్చున్నాను.
కృష్ణ లాంతరు పేపరుమీద పెట్టాడు.
మళ్ళీ అడుగుల శబ్దం విన్పించింది.
నేను కూర్చున్నదాన్ని వెంటనే లేచి నిలబడుతూ "అదుగో, పాదాల చప్పుడు." అన్నాను. కృష్ణ క్షణంసేపు తదేకంగా విన్నాడు.
"ఆవో, గేదో విప్పుకుంది." కృష్ణ చటుక్కున లాంతరు తీసుకుని వెళ్ళిపోయాడు.
చీకట్లో ఒంటరిగా నిలబడిన నాకు యీసారి భయం అన్పించలేదు.
కృష్ణ ఏమనుకుంటాడు!
ఏమిటిలా చేశాను నేను! నాకు గురుకొస్తే ఎలాగోవుంది. అతనికేమీ అన్పించటంలేదా?
ఛీ-ఛీ జన్మలో ప్రాణంపోయే ప్రమాదంవచ్చినా యింకెప్పుడూ భయపడను.
పదినిముషాల్లో కృష్ణ తిరిగివచ్చాడు. అతనిముఖం చాలా సీరియస్‌గా వుంది.
క్షణంక్రితం నా భయంచూసి విరగబడి నవ్విన మనిషి యీ మనిషేనా అన్పించింది నాకు.
గదిలోకి తిరిగి వచ్చిన అతను నావైపు చూడలేదు.
లాంతరు టేబిల్‌మీదపెట్టి పేపరు ఒకటి తీసుకుని, పడక్కుర్చీలో కూర్చుని చూడసాగాడు.
నేను అతనివైపే చూడసాగాను.
ఆక్షణంలో ఆ లాంతరు వెలుగులో అతనిముఖం ఎందుకో నాకు యీ ప్రపంచంలో యింకేదీ సాటిరాని త ఆకర్షణీయంగా కన్పించింది.
కొద్దిక్షణాలతర్వాత, పేపరు పేజీలు తిప్పుతూ, మడతపెడుతున్న అతను నావైపు తిరిగి చూసాడు
నేను అతనివైపునుంచి చూపులు తిప్పుకునే అవకాశమైనా దొరకలేదు.
"నిద్రరావటం లేదా" అన్నాడు
రావటంలేదన్నట్టు తల తిప్పాను.
అతను పేపరులో ఏదొచ్చిందేమీ కొట్టు విసుగ్గా టేబిల్‌మీదపడేసి లేచి వచ్చి కిటికీదగ్గరగా నిలబడి జేబులు తడుముకుని సిగరెట్ తీసి వెలిగించుకున్నాడు.
"నువ్వు సిగరెట్లు కాలుస్తావా!" అన్నాను నమ్మలేనంత ఆశ్చర్యంగా చూస్తూ.

"అప్పుడప్పుడూ. ఏం?"

"ఏం లేదు నేటింతవరకూ ఎప్పుడూ చూడలేదు."

"చాలా ఎక్కువగా కాలుస్తాను. ఏ అలవాటైనా సరే దానికి బానిసవొతుంటా, మనం దాన్ని అదుపులో వుంచగలిగితే ఫర్వాలేదు అనే సూత్రాన్ని నమ్ముతాను నేను.

నేను సమాధానం చెప్పలేదు.

చాలా రోజుల తర్వాత గోళ్ళు కొరకాల్సిన అవసరం వచ్చింది నాకు. ఈ మధ్య దాదాపు యీ అలవాటు మర్చిపోయాను.

నాకెందుకో ఎలాగో వుంది. అతనివైపు సూటిగా చూడలేకపోతున్నాను.

"రాజా పెళ్ళివిషయంలో నీకేమైనా చెప్పిందా?" వున్నట్టుండి అడిగాడతను.

"అంటే?"

"అదే–పిల్లవాడిగురించి. అతనెలా వున్నాడో–"

"నన్ను అడుగుతావేం? నీ చెల్లెల్ని నువ్వు అడగలేదా?"

"అడిగాను. కానీ–"

కృష్ణ అలా మామూలుగా మాట్లాడి వేరే ప్రసంగంలోకి దింపటంతో నాలో సిగ్గు సంకోచం మెల్లగా వదిలిపోయినాయి.

"దాని యిష్టాయిష్టాలకి విలువ వుందా?" అన్నాను.

"ఎందుకులేదు?"

"వున్నట్టయితే ఆ సంబంధం మానేసేయి."

కృష్ణ హతాశుడయినట్టు నావైపు చూసాడు.

"రాజుని నువ్వు స్వయంగా అడిగావు. అది నీకు సమాధానం చెప్పింది. అయినా నీకు నమ్మకంలేదు. అందుకే నన్నడుగుతున్నావు. ఔనా?"

ఔనన్నట్టు తలూపాడు.

"అంటే అదిచెప్పిన అభిప్రాయంమీద నీకే నమ్మకం లేదన్నమాట. అంత స్పష్టంగా తెలిసికూడా మళ్ళీ నన్ను అడుగుతావెందుకు?"

కృష్ణ సమాధానం చెప్పలేనట్టు చూసి ఇంకో సిగరెట్ తీసి వెలిగించుకున్నాడు.

"ముందు ఇది చెప్పు. నువ్వు సుందరని మనస్ఫూర్తిగానే చేసుకుంటున్నావా?"

అగ్గిపుల్ల బైట పారేయబోతున్న అతను అప్రయత్నంగా ఆగిపోయి బిటారుగా అయాడు

(సశేషం)

Printed and published by A. Sudhakara Rao for Yuva Publications, Hyderabad-4
and printed at Yuva Press, Public Garden Road – Hyderabad 4. Phone 36336
Controlling Editor : Sri "CHAKRAPANI"

# యువ

## గాంధీజీ శతజయంతి

## ప్రత్యేక సంచిక

1969 అక్టోబరు 2వ తేదీన గాంధీజీ శతజయంతిని పురస్కరించుకొని, మహాత్ముని దివ్యస్మృతికి యువతరం పట్టే నివాళిగా, యువ అక్టోబరు నెల సంచిక, ప్రత్యేక సంచికగా సమర్పించాలని సంకల్పించాము. గాంధీజీ గురించి ప్రత్యేక రచనలతో, ఎక్కువ పేజీలతో ప్రత్యేక చిత్రాలతో వెలువడబోయే ఈ సంచిక వెల రూపాయి మాత్రమే.

పాఠకులు, ముందుగానే తమ ఏజంట్ల దగ్గర కాపీలు రిజర్వు చేసుకోండి.

— సంపాదకుడు



కలడు కలండనెడు వాడు కలడో లేడో -

YUVA August '69 One Rupee Regd. No. H 131